# విష్ణుపారిజాతము యక్షగానము

మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ ప్రణీతము



ప్రచురణ
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# విష్ణు పారిజాతము
## యక్షగానము

**మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ ప్రణీతము**

సాధారణ సంపాదకుడు

**బి.యస్. రెడ్డి (భూమన్)**

సంచాలకుడు, తి.తి.దే. "శ్వేత" తిరుపతి

తరిగొండ వెంగమాంబ వాఙ్మయప్రాజెక్ట్




పరిష్కర్త : ఆచార్య కె.జె.కృష్ణమూర్తి

తరిగొండ వెంగమాంబ వాఙ్మయప్రాజెక్ట్

తి.తి.దే."శ్వేత" తిరుపతి

రూ 35-00

ప్రచురణ

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు,తిరుపతి.

2008

**VIṢṆU PĀRIJĀTAMU**
(YAKṢA GĀNAMU)
**MĀTṚ ŚRĪ TARIGONḌA VENGAMĀMBA**

Edited by
Prof. K.J.Krishnamoorthy
Tarigoṇḍa Vengamāmba Vānmaya Project
"SVETA",T.T.D., TIRUPATI.

TTD Religious Publications Series No. 776


First Edition: 2008
Copies : 1,000

Published by
K.V.RAMANACHARY,I.A.S.,
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
TIRUPATI-517 507

Printed at
TTD.Press, Tirupati.

# ఓం నమో వేంకటేశాయ

## ముందుమాట

భూమన కరుణాకరరెడ్డి 14.03.2008.

అధ్యక్షులు,

తి.తి.దేవస్థాన పాలకమండలి,

తిరుపతి.

శ్రీనివాసుడు నిత్యకళ్యాణ చక్రవర్తి. ఆ దేవదేవుణ్ణి ఉద్దేశించి వెలువడిన మధురభక్తి సాహిత్యంలో తాళ్లపాక అన్నమాచార్యుల వరుసలో పేర్కొనదగిన మహనీయ కవయిత్రి మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ.

ఈ ప్రజాకవయిత్రి సామాన్యులకు సైతం సుకరంగా, ఆహ్లాదకరంగా మధురభక్తి సందేశాన్ని అందించడానికి 'యక్షగానం' మిక్కిలి అనువయిందిగా గుర్తించింది. ఇందువల్లే ఇంచుమించు పది యక్షగాన రూపకాలను సృష్టించింది. వీటన్నింటిలో అగ్రగణ్యమైనదీ, పవిత్రమైన తిరుమలక్షేత్రంలో అక్షరాకృతిని పొందిన మొదటి కృతీ ఈ 'విష్ణుపారిజాత'ప్రబంధం.

ఇలవేల్పైన తరిగొండ లక్ష్మీనృసింహుడు, ఇష్టదైవమైన తిరుమల వేంకటేశ్వరుడు, ఈ కథానాయకుడయిన శ్రీకృష్ణుడు - ఈ ముగ్గురూ ఒక్కరే అన్న సత్యాన్ని వెంగమాంబ ఈ నాటకంలో రుక్మిణి పల్కులద్వారా సుందరంగా సమన్వయించింది.

ఈ కథానాయిక సత్యభామ జీవాత్మకూ, నాయకుడు శ్రీకృష్ణుడు పరమాత్మకూ ప్రతీకలు. జీవాత్మ అహంకారాన్ని వీడి, పరమాత్మను ఆరాధిస్తే పారిజాతప్రాప్తిలాంటి ఐహికసుఖాలతోపాటు, బ్రహ్మానందపదవియైన మోక్షాన్నికూడా అందుకోవచ్చుననేది ఈ కావ్యం ప్రబోధిస్తూవున్న ఆధ్యాత్మిక సందేశం.

ఈ కృతి అవతరించిన క్రీ.శ.18వ శతాబ్ది మధ్యకాలంనాటి చారిత్రక, సామాజిక విశేషాలు-తిరుమల దేవస్థానానికి సంబంధించినటువంటివి-ఇందులో ప్రతిబింబించివుండటం కారణంగా దీని ప్రాముఖ్యం మరింతగా ఇనుమడించింది.

వెంగమాంబగారి మునిమనుమడు స్వయంగా లిఖించివుండిన వ్రాతప్రతి-ఆచార్య వేటూరి ఆనందమూర్తిగారి సౌహార్దంతో ఈ వాఙ్మయ ప్రాజెక్టుకు లభించి, తత్సహాయంతో ఈ ప్రచురణ వెలువడటం మిగుల ముదావహమైన సంగతి.

తిరుమల తిరుపతి దేవస్థానముల "శ్వేత"సంస్థ ఆధ్వర్యంలోని మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ వాఙ్మయ ప్రాజెక్టు ఇలాంటి విశిష్ట ప్రచురణలను ఇతోధికంగా చేపట్టి ఈ పరమయోగిని సృష్టించిన వాఙ్మయ రాశిని విస్తృతంగా వెలుగులోకి తీసికొని రాగలరని ఆశిస్తున్నాను;ఆశంసిస్తున్నాను.

శ్రీవారి సేవలో

భూమన కరుణాకర రెడ్డి

## శ్రీనివాసో విజయతే

## నామాట

కె.వి. రమణాచారి, ఐ.ఎ.ఎస్., Date 14-03-08
కార్యనిర్వహణాధికారి,

తి.తి.దేవస్థానములు, తిరుపతి.

"కలౌ వేంకట నాయక:" - అని ప్రశస్తి గాంచిన శ్రీనివాస భగవానుని భక్తబృందంలో విశిష్టత గడించిన పరమ భాగవత కవయిత్రి మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ. ఈ మహాకవయిత్రి వెలయించిన అష్టాదశ గ్రంథాల్లో సరిగ్గా సగపాలు యక్షగానాలు. తిరుమలేశుని తత్త్వాన్నీ, మహత్త్వాన్నీ ఆబాలగోపాలానికి చాటే సంకల్పంతో రచనాకైంకర్యాన్ని చేపట్టిన ఈ 'కవితా తపస్విని' యక్షగాన కృతుల్లో ఆణిముత్యం 'విష్ణుపారిజాతం' అసలు, 'విష్ణుపారిజాత' మనే పేరే చమత్కారంగా ఉంది. ఈ పేరు రెండు విధాలైన అర్థాలను స్ఫురింపజేస్తున్నది:

i) విష్ణువు (శ్రీకృష్ణుడు) సంపాదించిన పారిజాతం - ఇది ఒక అర్థం.

ii) విష్ణువు (శ్రీకృష్ణుడు - అనగా వేంకటరమణుడు) - అనే పారిజాతం అనేది ఇంకొక అర్థం.

పరికిస్తే, ఈ రెండర్థాలూ కలిసివచ్చేట్టుగానే కవయిత్రి ఈ పేరు పెట్టినట్లుతోస్తుంది.పైగా, ఈ కథలో దేవేంద్రునిచే పారిజాతకల్పతరువును స్వామివారికి ససంకల్పంగా ధారాదత్తం చేయించడం ద్వారా,

ఈ అంతరంగికభక్త శిరోమణి ఇష్టదైవానికి అపహరణదోషాన్ని నివారింపజేసింది!

ఈ కథను యక్షగానంగా రచిస్తే ముక్తి లభిస్తుందనే విశ్వాసం సంప్రదాయంలో నెలకొనివుండటంచేత శ్రీనారాయణ తీర్థులు, సిద్ధేంద్రయోగి, తరిగొండ వెంగమాంబ - ఆ యా కాలాల్లో యక్షగాన రూపకాలుగా వెలయించారు.

ఈ గ్రంథం యొక్క మూల వ్రాతపత్రి (Original Manuscript) - శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారి గ్రంథ సంకలనంలో ఉండినది - వారి తనయులు ఆచార్య వేటూరి ఆనందమూర్తి గారి సౌజన్యంవల్ల తిరుమల తిరుపతి దేవస్థానంవారు "శ్వేత" లో నిర్వహిస్తూవున్న తరిగొండ వెంగమాంబ వాఙ్మయ ప్రాజెక్టుకు బహూకరింపబడింది. సదరు మూలపత్రి ఆధారంగానే ఈ ప్రచురణ వెలువడటం ముదావహం.

ఇందుకు ముఖ్య కారకులూ, కార్యదీక్షాదక్షులూ - అయిన శ్రీతరిగొండ వెంగమాంబ ప్రాజెక్టు డైరెక్టర్, శ్వేత సంస్థ సంచాలకులు శ్రీయుతులు "భూమన్" గారిని మిగుల అభినందిస్తున్నాను. శ్రీనివాసుని కరుణావిశేషంతో ఈ కవయిత్రీశిరోమణి సారస్వతం అంతా అచిరకాలంలో వెలుగు చూడగలదని ఆకాంక్షిస్తున్నాను.

తిరుమల క్షేత్రంలో నెలకొన్న 'తరిగొండమ్మ బృందావనం' లో తొలుదొలుత వికసించిన ఈ సాహితీ పారిజాతంయొక్క దివ్య సౌరభాలను వాఙ్మయోపాసకులు అందరూ ఆహ్లాదంతో ఆస్వాదిస్తారని ఆశిస్తున్నాను.

శ్రీనివాసుని సేవలో

కె.వి. రమణాచారి

# సాహితీ సౌరభం

"భూమన్" Date 01 .05.2008.

సంచాలకులు,
మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ వాఙ్మయప్రాజెక్టు,
"శ్వేత" తి.తి.దేవస్థానములు, తిరుపతి.

తరిగొండ వెంగమాంబ తాను పుట్టిన ప్రాంతానికీ, జీవించిన కాలానికీ అతీతంగా మనుగడ సాగించిన మహనీయురాలయిన మహిళా శిరోమణి.

ఆ కాలంలో సనాతనాచారపరాయణులైన కొందరు ఆమె జీవితాన్ని విమర్శలకు గురికావించినట్లే, ఆమె రచనావ్యాసంగంమీద సైతం 'శీతకన్ను' ప్రసరింపజేశారు. వెంగమాంబ అలాంటి అజ్ఞుల సంకుచిత అభిప్రాయాలను లక్ష్యపెట్టకుండా, తన కవితాసృజనను ఒక 'తపస్సు'గా కొనసాగించింది!

ఈ మహాకవయిత్రి రచించిన కృతులన్నీ సులభమైన భాషలో, సుందర శైలిలో విలసిల్లుతూ, పఠితలకు ఉదాత్తమైన ఆనందాన్నీ, ఉత్తమ సందేశాన్నీ అందిస్తూ అలరారుతున్నాయి. ఈకారణంవల్లనే ఈ భక్తకవయిత్రి క్రీ శ.18వ శతాబ్దిలో వర్ధిల్లిన "ప్రజాకవయిత్రి"గా పరిగణింపబడింది.

వెంగమాంబ తరిగొండను వదలి, తిరుమల చేరిన పిదప రచించిన గ్రంథాల్లో మొదటిది 'విష్ణుపారిజాతం'. ఈకృతికి 'పారిజాతా పహరణం' -అనే నామాంతరంకూడా ఉంది. ఇది ఈ కవయిత్రి వెలయించిన యక్షగాన నాటకాలన్నింటిలోకీ తలమానికమైనది. ఇది ప్రదర్శనకు కూడా అనువయిన విధంగా కవయిత్రిచే తీర్చిదిద్దబడింది.

ఈకథలోని నాయికానాయకుల (సత్యభామా శ్రీకృష్ణుల) సంభాషణల నెపంతో వెంగమ్మ ఇందులో ఆ కాలంలో తిరుమల దేవాలయంలో నెలకొనివుండిన చారిత్రక విశేషాలను కొన్నిటిని సొంపుగా

ప్రతిబింబింపచేసింది. ఈ అంశంఈ కృతియొక్క విశిష్టతను ఇనుమడింప చేస్తూవుంది.

క్రీ.శ. 18వ శతాబ్ది మధ్యకాలంలో తరిగొండ వెంగమాంబ వాఙ్మయ బృందావనంలో వికసించిన ఈ 'కవితాపారిజాతం' యొక్క సాహితీ సౌరభాలను రసజ్ఞులు ఆస్వాదింపగలరని ఆకాంక్షిస్తున్నాము.

తి.తి.దే."శ్వేత"సంస్థలోని'మాతృశ్రీ తరిగొండవెంగమాంబ వాఙ్మయప్రాజెక్టు' ఈకవయిత్రియొక్క రచనలను అన్నిటినీ అచిరకాలంలోనే ప్రచురించే ప్రణాళికను సిద్ధపరుస్తున్నదని తెలుపటానికి సంతోషిస్తున్నాము; అలాగే ఆంధ్రావనిలోగల ఆ యా పట్టణాల్లో సాహిత్యోపన్యాసాలు, సంగీత ప్రదర్శనలు, హరికథలు మొదలయిన వివిధ సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహించటంద్వారా ఈకవయిత్రి సారస్వతంయొక్క ప్రశస్తిని ప్రబోధించే ఉద్యమాన్ని తి.తి.దే. తరిగొండ వెంగమాంబ వాఙ్మయప్రాజెక్టు ద్వారా కొనసాగిస్తూవున్నదని తెలుపటానికి ఆనందిస్తున్నాము.

— భూమన్

# పీఠిక

## యక్షగాన ప్రక్రియ:

ఆంధ్రసాహిత్యంలోని రచనా ప్రక్రియ లన్నింటిలో ప్రత్యేకమైనది, విస్తృతమైనది, అత్యంత విశిష్టమైనది 'యక్షగానం'. ఆదిలో ఆ యా దేవతామూర్తుల ఆరాధనకై ఉద్దేశింపబడిన అపూర్వ గాన పద్ధతిగా ఆరంభమయినా, క్రమంగా అది శిష్ట కవుల దృష్టిని ఆకర్షించి, 'యక్షగాన' మనే పేరును సవదరించుకొని క్రమేణ ప్రముఖ వాఙ్మయ శాఖగా పరిణమించివుండటం దాని ప్రత్యేకత. ఆ యా సందర్భాల్లో సంస్కృతనాటక సంప్రదాయానికి సంబంధించిన అంశాలను కొన్నిటిని పుణికిపుచ్చుకొంటూనే, అది ఆబాలగోపాలాన్ని అలరించే అసలుసిసలు 'దేశి'రూపకంగా స్థిరపడివుండటం దాని విశిష్టతకు తార్కాణం. తెలుగులోని తదితర సారస్వతశాఖ లన్నిటికన్నా విపులమైన ప్రశస్తినీ, ప్రచారాన్నీ పొందివుండటం ఇట ప్రధానంగా పేర్కొనదగ్గ విషయం.

తెలుగులో క్రీ.శ. 15వ శతాబ్దినుండే యక్షగాన రచనలు వెలువడినట్లు ఆధారాలు ఉన్నప్పటికీ, అవి నేడు నామమాత్ర అవశిష్టాలు. పోగా, 16వ శతాబ్ది పూర్వార్ధంనుండి రచింపబడిన యక్షగాన కృతులు నేడు లభ్యమవుతూవున్నాయి. రానురాను క్రీ.శ.16వ శతాబ్ది చివరిభాగంనుండి తెనుగులో యక్షగాన రచన విరివిగా కొనసాగి పెంపొందుతూ వచ్చింది. ఈ కారణంచేత సాహిత్య చరిత్రకారులు 17వ శతాబ్దిని తెనుగున యక్షగాన వాఙ్మయంయొక్క వికాసదశగాను, 18వ శతాబ్దిని పరిణతి పొందిన దశగాను పరిగణించటం జరిగింది. ఈ పరిణత దశలో విలసిల్లిన యక్షగాన కవుల్లో ప్రథమగణ్యగా పేర్కొనదగిన మహాకవయిత్రి మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ.

తరిగొండ వెంగమాంబ తొమ్మిది యక్షగానాలను వెలయించింది. వెంగమ రచించిన యక్షగానాలకు వస్తు వైవిధ్యము, రచనా రామణీయకము ముఖ్య లక్షణాలు. మొత్తంమీద దృశ్య, శ్రవ్య -

ఉభయ ప్రయోజనాత్మకాలుగా ఆవిర్భవించిన ఈ యక్షగానాలు అన్నీ పదునెనిమిదవ శతాబ్దపు యక్షగాన వాఙ్మయాభ్యున్నతికి సదమల నిదర్శనాలై ప్రకాశిస్తూవున్నాయి. ఈ విషయమై ప్రసిద్ధ పరిశోధకులు విద్యారత్న, కళాప్రపూర్ణ డా॥నిడుదవోలు వేంకటరావుగారి ఈ క్రింది ఆంగ్లవాక్యాలు పరిశీలింపదగివున్నాయి.

"In this branch of literature Vengamamba occupies a prominent place. No doubt there are some poets and poetesses who compiled Yakshaganas.....These works reveal her proficiency not only in Sahitya but also in Sangita, as Yakshagana is a combination of the two arts....All the above works of Vengamamba strictly adhere to the technique of Yakshagana. They contain different varieties of musical compositions like Daruvu, Dvipada, Manjari, Yela, Gobbillu, Suvvalalu, Dhavalamulu Sobhanamulu, Mangalaharatulu. The style and nature of the conversations employed by the poetess reveal her mastery over the Telugu language".[1]

ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర రచయితయైన ఆచార్య యస్.వి.జోగారావుగారు వెంగమాంబ రచించిన యక్షగానాలన్నీ మంచి నాటకపు వాటం కలిగి వున్నాయనీ, సంగీత, సాహిత్య - ఉభయ రంగాల్లో ఆమెకు గల వైదుష్యాన్ని చక్కగా చాటుతూవున్నాయనీ, "ఆటవికజాతుల జీవితవిశేషములనుండి గహనములైన యోగశాస్త్ర రహస్యములవరకు

---

1. Vide : 'Literary and Philosophical works of Taringonda Vengamamba, A woman saint' N. VenkataRao, Department of Telugu, The Madras University Journal(Section A), Vol xxx No.1, January 1958. pp 24-25.

గల యనేక విషయము లామె కధిగతార్థములు-----ఆమెవలె నిన్ని యక్షగానము లింత సమర్థముగా రచించిన కవయిత్రులు లేరు. సరికదా కవులు నరుదు".[2] అని ప్రకటించియున్నారు.

వెంగమాంబ వెలయించిన యక్షగాన రచనల్లో నాలుగవదీ, ఆమె తిరుమల చేరిన తదుపరి సృజించిన మొట్టమొదటి కృతీ

ఈ 'విష్ణుపారిజాత' యక్షగానం. ఇది ఆంధ్ర యక్షగానవాఙ్మయ శాఖలో ఆణిముత్యం లాంటిది.

## నామధేయం:

ఈ యక్షగానంలోని ఇతివృత్తాన్ని బట్టి కవయిత్రి దీనిని 'పారిజాతాపహరణ సత్కృతి' - అని పేర్కొన్నప్పటికీ, దీనికి "విష్ణుపారి జాత"మనే నామాంతరం ఆమె కాలానికే ప్రసిద్ధంగా రూఢిగాంచి యున్నట్లు వ్రాతప్రతులు సాక్ష్యమిస్తున్నాయి.

ఈ కృతి 'విష్ణుపారిజాత'మనే పేరుతో ప్రసిద్ధిపొందడానికి ఇంకొక హేతువుకూడా ఉంది. వెంగమాంబ తరిగొండలో ఉన్నప్పుడు రచించిన గ్రంథాల్లో 'శివనాటక'మనే యక్షగానం ఒకటి. ఆ శివనాటకానికి 'శివపారిజాత'మనే నామధేయం అదివరకే బాగా రూఢి గాంచింది.

ఆ 'శివపారిజాతం'తోడి సామ్యంవల్ల నూతనంగా తిరుమల క్షేత్రంలో రూపొందిన ఈ కృతి 'విష్ణుపారిజాతం'గా ప్రశస్తి గాంచింది. ఈ నామధేయం ఈ నాటకానికి సర్వవిధాలా సార్థకంగా అమరివుంది. విష్ణువు దేవలోకంనుండి తీసికొనివచ్చిన పారిజాతంయొక్క కథ ఇందులో

---

2. చూ. "ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర" (1961) - ఆచార్య యస్.వి.జోగారావు, ద్వితీయ భాగము, పుటలు 115 & 116

ప్రధానమైనందువల్ల ఇది 'విష్ణుపారిజాతం'. ఇంతేగాక, విష్ణువే పారిజాతమై (భక్తజనులకు కోరికలను ప్రసాదించే కల్పవృక్షమై), లీలామానుషావతారుడై భూలోకంలో విహరించి వున్నందువల్లను, ఆ విష్ణువే (శ్రీకృష్ణుడే) ఈ కావ్యంలో కథానాయకుడై ఉండటంచేతను ఇది 'విష్ణుపారిజాతం'గా అన్నివిధాలా అన్వర్థమయింది. యావదాంధ్రసారస్వతంలోనూ ఈ పేరుతో ఇంకొక్క గ్రంథం లేకుండటం దీని ఏకైక ప్రశస్తికి తిరుగులేని నిదర్శనం!

## కథాస్వరూపం:

శ్రీకృష్ణుడు సత్యభామకు స్వర్గలోకంలోని పారిజాత కల్పతరువును తెచ్చియివ్వడం ఇందలి కథ. యోగీశ్వరుల్లో అగ్రగణ్యుడూ, మహానుభావుడూ అయిన శుకయోగి శ్రేష్ఠతరమయిన శ్రీమద్ భాగవతాన్ని చక్కగా తెలియజేస్తూవుండగా, భక్తియుక్తుడైన పరీక్షిత్తు అమితమైన ఆసక్తితో ఇలా అడిగినాడు: 'మహాత్మా! శ్రీకృష్ణుడు దేవలోకంనుండి పారిజాతవృక్షాన్ని భూలోకానికి కొనివచ్చిన వృత్తాంతాన్ని సమగ్రంగా, సాంగోపాంగంగా వివరించండి!' అని. అప్పుడు ఆ యోగీంద్రుడు అత్యంత కరుణతో ఆ రాజేంద్రునకు ఇలాగ వివరింపసాగినాడు...

'రాజచంద్రా! విను. దేవముని నారదుడు ఒకనాడు అమరావతినుండి పారిజాత పుష్పాన్ని కైకొని వచ్చి, ద్వారకలోనున్న శ్రీకృష్ణునకు మేలికానుకగా బహూకరించాడు. శ్రీకృష్ణుడు ఆ దివ్య సుమాన్ని ప్రీతితో పట్టపుదేవియైన రుక్మిణికి ఇచ్చినాడు. ఇది తెలిపిన సత్యభామ తన వద్దకు వచ్చిన శ్రీకృష్ణుణ్ణి అనురాగంతో చూడక, కోపనయై తిరస్కరించింది. కారణం తెలిసికొన్న శ్రీకృష్ణుడు 'ఆ పారిజాతతరువునే ప్రియంగా నీకు తెచ్చియిస్తాను!' అని ఆమెను సమాధానపరచినాడు. అనంతరం సత్యభామతోడి సరస సల్లాపాలలో మునిగితేలినాడు. ఆ స్వామి సరసాలకు ఆనందతన్మయురాలయిన సాత్రాజితి అలసతతో అలాగే హాయిగా నిదురపోయింది.

అప్పుడు సత్యభామను మేలుకొలుపకనే, శ్రీకృష్ణుడు ఆ మందిరం నుండి వెలువడినాడు. శిరస్సుపై నెమలిపింఛంతో గూడిన నవరత్న మకుటం, మెడలో తులసీ కుసుమ మాలికలు, ఆ యా అవయవాల్లో అందమైన ఆభరణాలు వెలుగులీనుతూవుండగా, భుజములపై బంగారు శాలువ ప్రకాశిస్తూవుండగా, కస్తూరీతిలక శోభితుడై ఆ మహనీయుడు జగన్మోహనంగా మురళిని వాయిస్తూ, చిరునవ్వులు చిందిస్తూ, పాదమంజీరాలు మనోజ్ఞంగా శబ్దిస్తూవుండగా, వెడలి శృంగార వనాన్ని చేరుకొన్నాడు.

శ్రీకృష్ణుడు వికటభాషణుడనే వనపాలుణ్ణి దగ్గరకు పిలిచి, రుక్మిణి మొదలైన పత్నులను (సత్యభామగాక మిగిలినవారిని) పిలుచుకొని రావలసిందని ఆజ్ఞాపించాడు. వినోదంగా, వికటంగా మాట్లాడే స్వభావంగల ఆ వనపాలకుడు శ్రీ కృష్ణుని పుట్టు పూర్వోత్తరాలనుగూర్చి - ఆయన అనుమతితోనే - వినోదంగా ప్రశ్నిస్తూ, సంభాషిస్తూ సంతోషాన్ని కలిగిస్తాడు.

అటుపిమ్మట రుక్మిణి మున్నగు వారిని అచ్చటికి పిలుచుకువస్తాడు.

ఉద్యానవనం చేరిన రుక్మిణ్యాదులు శ్రీ కృష్ణుని కొరకు వెదకుతూవుండగా, వనపాలుని భార్య వక్రభాషిణి వాళ్లకు ఎదురౌతుంది. ఈవిడ పేరుకు తగ్గట్టు, వక్రంగా మాట్లాడటంలో భర్తకన్నా ఏడాకులెక్కువ చదివింది! ఆ విధంగా ఆ వనపాలిక రుక్మిణి, జాంబవతి, కాళింది, మిత్రవింద, నాగ్నజితి, భద్ర, లక్షణ, రాధలతో వక్రంగా సంభాషిస్తూ, వాళ్లందరి వృత్తాంతాలను (వాళ్లు శ్రీ కృష్ణుణ్ణి పెండ్లాడిన విశేషాలతో కూడా) క్రమంగా అడిగి తెలుసుకుంటుంది. పత్నులెల్లరూ వక్రభాషిణి సూచన ననుసరించి శ్రీకృష్ణుణ్ణి భక్తితో ప్రార్థించి పిలుస్తారు. అనంతరం నందనందనుడు వారలకు కానిపించి, వాళ్లందరితో శృంగారవనంలో హాయిగా విహరిస్తూ ఆనందంగా గడుపుతుంటాడు.

ఇంతలో సత్యభామ నిద్రమేల్కొని, శ్రీకృష్ణుని కానక, తత్తరపడుతుంది. చక్కగా అలంకరించుకొని, తన కేళీవనానికి వెళ్లి అక్కడ శ్రీకృష్ణుణ్ణి అన్వేషిస్తుంది. అక్కడ వనపాలిక వక్రభాషిణి ఎదురుపడుతుంది. తన సహజ హాస్య ధోరణితో వక్రంగా మాట్లాడి, సత్యభామ సమాచారాన్ని సంపూర్ణంగా తెలిసికొంటుంది.

పారిజాత తరువును తెచ్చియిస్తానని మాటిచ్చిన తనను వంచించి సవతుల వద్దకు వెళ్లిన శ్రీకృష్ణుణ్ణి తోడ్కొని రావలసినదని సత్యభామ వక్రభాషిణిని బ్రతిమాలుతుంది. ప్రసన్నురాలైన ఆ వనపాలిక శ్రీకృష్ణుని వద్ద కేగి, భక్తి ప్రపత్తులతో ఆయనను సంప్రార్థించి, సత్యభామ సందేశాన్ని విన్నవిస్తుంది. పారిజాత వృక్షాన్ని తెచ్చియిస్తానన్న వాగ్దానాన్ని జ్ఞాపకం చేసి, 'ఆయన వచ్చేంతవరకు గంగ ముట్ట' నన్న సత్యభామ శపథాన్ని యథాతథంగా వివరిస్తుంది.

అటుపిమ్మట తనవద్దకు విచ్చేసిన శ్రీకృష్ణుణ్ణి సత్యభామ కోపాతిరేకంతో తిరస్కరిస్తుంది. అందువల్ల, అలుకవహించిన శ్రీకృష్ణుడు రుక్మిణ్యాది కాంతలకడకు మరలిపోతాడు. అనంతరం సత్యాదేవి అంతకు రెట్టింపు పశ్చాత్తాపంతో మిక్కిలి చింతిస్తుంది.

సత్యభామ ఇంకొక చెలిని దగ్గరకు పిలిచి 'నీవు వెళ్లి శ్రీకృష్ణుని తోడితె'మ్మంటుంది: 'అలా చేస్తే నాకేమి లంచమిస్తా'వని ఆ చెలికత్తె అడుగుతుంది. 'హారావళులు, కెంపుల జంపులు, చిలుకల తాళి, జీవమణులు - మొదలైన అమూల్య ఆభరణాలను, ధనరాసులను ఇస్తా'నని సత్యభామ చెపుతుంది. 'అశాశ్వతాలైన ఆ అలంకారాలేవి తనకు అక్కరలే'దనీ, 'తరిగొండ నరహరీ శేషాచలపతీ అయిన శ్రీకృష్ణుని యెడల నిర్మలమైన భక్తినే తనకు కానుకగా ఇప్పించవలసిన'దనీ, ఆ చెలి అడుగుతుంది. 'అలుకతో వెళ్లిపోయిన శ్రీకృష్ణుణ్ణి పిలవటానికి జంకుగా

వుంది గనుక, ఏదైనా ఉత్తరం వ్రాసియి'మ్మని చెలికత్తె సత్యభామను వేడుతుంది. బంగారు మొగలిరేకు మీద కొనగోటితో అందంగా సత్యభామ లేఖ వ్రాసియివ్వగా, కైకొని వెళ్లి, ఆ చెలి శ్రీకృష్ణునికి అందజేస్తుంది. సత్యాదేవి కోరికను నిరాకరిస్తూ శ్రీకృష్ణుడు ప్రత్యుత్తరం వ్రాసి పంపుతాడు.

ఆ సమయంలో సరస్వతి యెఱుకత (కొరవంజి)యై వచ్చి, సత్యభామకు సోదె చెబుతుంది. 'శ్రీకృష్ణుడు త్వరలో నీ నగరుకు రాగలడు. నిన్ను చక్కగా ఏలుకోనున్నాడు. పదికోట్లు కృష్ణ జపం చెయ్యవలసింది. అందుకు మెచ్చి ఆయన నీవడిగిన వస్తువును తెచ్చి యిస్తాడు. నీ పంతం నెరవేరుతుంది!' అని పలికి, కొఱవంజి తనకూ, తన బుడుతనికీ (నారదునికి) మంచిమంచి సొమ్ములను బహుమానంగా పొందుతుంది. తనను వెదకుతూ వస్తున్న సింగణ్ణి (బ్రహ్మను) కలుసుకొని తమ నివాసానికి తరలిపోతుంది.

అటు తరువాత సత్యభామ తన మందిరంలో ఒకానొక సతితో ఇలా అన్నది 'చెలీ! ఇంకొక్క మారు శ్రీకృష్ణుని వద్దకు వెళ్లి పిలిచివత్తాము. ఆయన వస్తే సరి, అలా రానట్లైతే, సవతులపై విద్వేషభావాన్ని వీడి కొఱవంజి చెప్పిన రీతిగా ఉపశాంతితో శ్రీకృష్ణమంత్ర జపం చేస్తూవుంటాను'అని. అనంతరం ఆమె చెలితో శ్రీకృష్ణుని సమక్షానికి వెళ్లి, రమ్మని అభ్యర్థిస్తుంది. ఆయన రావటానికి నిరాకరించటంవల్ల పరిపరి విధాల ఆయనను నిందించి, జడతో విసరికొట్టి, తన నిలయానికి చేరుకుంటుంది. శ్రీకృష్ణుని దివ్యాకృతిని ధ్యానిస్తూ ఏకాంతస్థలంలో పద్మాసనాసీనయై కృష్ణజపం కావిస్తూవుంటుంది.

సత్యభామ తపస్సుకు సంతోషించిన శ్రీకృష్ణుడు జాంబవతి మొదలుగాగల సతులను ఎట్టకేలకు ఒప్పించి సత్యభామసౌధానికి వస్తాడు. 'దివ్యవృక్షాన్ని కనులతో చూచేదాకా నిన్ను పొంద'నని సత్య

తెగేసి చెప్పగా ఆయన అప్పుడే ఆ వృక్షాన్ని తేవటానికి పట్టుదలతో బయలుదేరుతాడు. అప్పుడు ఉద్ధవుడు శ్రీకృష్ణుని ఆనతి ననుసరించి రుక్మిణ్యాది పత్నులను ఉద్యానవనంనుండి వాళ్లవాళ్ల అంత:పురాలకు చేరుస్తాడు. అనంతరం శ్రీకృష్ణుడు మన్మథుణ్ణి పంపి క్షీరసాగరతీరంలో తపస్సు కావిస్తూవున్న గరుత్మంతుణ్ణి ద్వారకకు రప్పిస్తాడు. అటుపిమ్మట శ్రీకృష్ణుడు సత్యభామ వెంటరాగా గరుడునిపై ప్రాగ్జ్యోతిష పురానికి వెళ్లి ముర, నరకాసురాదులను జయిస్తాడు. నరకునిచే చెఱలో ఉంచబడియుండిన పదహారువేల మంది రాజకుమార్తెలను విడుదల కావించి వారందరినీ ద్వారక చేరుస్తాడు.

నరకుని భవనంలో స్వాధీనం చేసుకొన్న అదితి కుండలాలను అప్పగించేటందుకై శ్రీకృష్ణుడు సత్యభామాసమేతుడై గరుడవాహనంపై ప్రాగ్జ్యోతిషంనుండి బయలుదేరి అమరావతి చేరుకుంటాడు. అక్కడ అదితికి కుండలాలను సమర్పించి, ఇంద్రునిచే సత్కరింపబడి, విహరించే నిమిత్తంగా సతీసహితంగా నందనవనం ప్రవేశిస్తాడు. ఆ వనమందలి పారిజాత తరువును-వనపాలుని ఆక్షేపణలను లెక్కపెట్టక - పెకలించి గరుత్మంతునిపై ఉంచుతాడు. వనపాలునివల్ల విషయం తెలిసికొన్న సురపతి శీఘ్రంగా ఐరావతం మీద ఏతెంచి, శ్రీకృష్ణుణ్ణి అడ్డుకుంటాడు. ఇరువురి మధ్య శస్త్రాస్త్రాలతో, శపథ వాక్యాలతో పోరు ఘోరంగా సాగుతుంది. తుదకు ఇంద్రుడు వజ్రాయుధాన్ని, శ్రీకృష్ణుడు సుదర్శన చక్రాన్ని ఒకరిపై మరొకరు ప్రయోగించటానికి ఉద్యుక్తులౌతూవున్న సమయంలో ఆ పరమేశ్వరుడు ఆ యిరువురి నడుమ ఆవిర్భవిస్తాడు. పరమశివుడు ఇంద్రోపేంద్రులతో సమయోచితంగా సంభాషించి, లోకోపద్రవకారణమైన ఆ యుద్ధాన్ని విరమింపజేస్తాడు. పరమశివుని పలుకులచే పశ్చాత్తాపతప్తుడైన ఇంద్రుడు శ్రీకృష్ణుణ్ణి శరణుపొంది పారిజాత కుజాన్ని స్వయంగా శ్రీకృష్ణునకు సమర్పించి, ఆ హరిహరులను స్తుతించి, ఐరావతంతో తన లోకానికి తరలివెళ్లిపోతాడు.

శ్రీకృష్ణుడు కోసి యివ్వగా సత్యభామ పారిజాత పుష్పాలతో పార్వతీపరమేశ్వరులను భక్తితో సమర్చిస్తుంది. ఆదిదంపతులు సత్యాకృష్ణులను ఆశీర్వదిస్తారు. అనంతరం వాళ్లు కైలాసానికి వేంచేయగా, సత్యాకృష్ణులు ద్వారకానగరం చేరుకుంటారు. పారిజాత కల్పతరువు సత్యభామయొక్క కేళీవనంలో నెలకొల్పబడటం జాంబవతి మొదలయిన సవతులకు అసూయావహం అవుతుంది. అందువల్ల, వాళ్లందరూ తమకూ తలా ఒక పారిజాతవృక్షాన్ని తెచ్చియివ్వవలసిందని శ్రీకృష్ణుణ్ణి అడ్డగించి నిర్బంధిస్తారు. అప్పుడు ఆ సవతులకూ సత్యభామకూ కొంతసేపు సపత్నీకలహం (సవతుల కయ్యం) నడుస్తుంది.

శ్రీకృష్ణుని కోరికపై రుక్మిణీదేవి చెల్లెండ్రందరితో తగినట్లు మాటాడి, సయోధ్యతోడి సామరస్యాన్ని సాధిస్తుంది. సత్యభామ శ్రీకృష్ణుని సూచనతో చందనతాంబూల ముఖ్యపదార్థాలతోగూడిన పారిజాతపుష్పాలను వాసుదేవునకు, రుక్మిణ్యాది సపత్నులకు, రాధకు ఆప్యాయతతో అర్పించటంతో అందరిలోనూ ఆనందం వెల్లివిరుస్తుంది. మహిళామణులు కొందరు శ్రీకృష్ణునకూ, ఆయన పత్నులకూ మంగళగీతాలను ఆలాపించటంతో ఈ యక్షగాన నాటకం సుఖాంతంగా, శుభాంతంగా పరిసమాప్త మవుతుంది.

## కథా సంవిధానం:

'కథాసంవిధాన' మంటే కవి తాను చేపట్టిన కథావస్తువును తన రచనాప్రణాళికకు అనుగుణంగా మలచుకోవడం. ఈ యక్షగానంలోని కథాసూత్రం ద్వారకానగరంలోని సత్యభామామందిరంనుండి శ్రీకృష్ణుడు వెలువడటంతో మొదలౌతుంది. అటనుండి కవయిత్రి సంకల్పించిన పాత్రచిత్రణకు, రసపోషణకు అనుగుణమైన మలుపుల్లో, అందమైన శైలిలో కొనసాగుతూ, ఎట్టకేలకు మళ్లీ అదే సత్యభామా మందిరాన్ని

అనుకొనివున్న శృంగారవనంలో పారిజాతవృక్షచ్ఛాయలో కొలువుదీరివున్న శ్రీకృష్ణునికీ, రుక్మిణ్యాది సవత్నులకూ, సత్యభామ చందన తాంబూలాదులతో పారిజాతపుష్పాలను అవిరళభక్తితో, అత్యంతప్రీతితో అర్పించటంతో ఈ నాటకం మంగళాంతంగా పరిసమాప్త మవుతుంది.

అవతారపురుషుడుగా ప్రశంసింపబడిన శ్రీకృష్ణుని లీలా విభూతులలో మిగుల ప్రసిద్ధమైనది పారిజాతాపహరణ వృత్తాంతం. ఈ గాథను యక్షగానంగా రచిస్తే మోక్షం సంప్రాప్తిస్తుందనే విశ్వాసం ఉందని కూచిపూడివారికి చెందిన ఒకానొక ఐతిహ్యంలో ఉట్టంకింపబడినది.[3]

తరిగొండవెంగమాంబ ఈ యక్షగానరచనకు అవసరమైన కథావస్తువును పోతన భాగవతము, నందితిమ్మన పారిజాతాపహరణము, కూచిపూడి సిద్ధేంద్రయోగీంద్రుని భామాకలాపము - ఈ మూడు గ్రంథాల్లోనుండి స్వీకరించి, సన్నివేశ కల్పనలతో సొంపుగా విస్తరించి, ఈ యక్షగాన నాటకాన్ని మనోజ్ఞంగా తీర్చిదిద్దింది.

కవయిత్రి ఈ యక్షగానకథను భాగవతానుసారిగా శుకయోగీంద్రుడు పరీక్షిన్మహారాజుకు వివరించినట్లు ఆరంభించింది. ఆ ఉపక్రమంలోనే నందితిమ్మనార్యుని పారిజాతాపహరణ ప్రబంధంలోని పుష్పవృత్తాంతాన్ని ఈ క్రిందివిధంగా జోడించి కథాసూత్రాన్ని సుకుమారంగా ముందుకు సాగించింది:

"వినరయ్య కవులార! - విద్వాంసులార!
ఘనయోగిచంద్రాగ్ర - గణ్యుఁడనంగ

సురుచిరాత్మకుఁడైన - శుకయోగి దెలుప
చిరభక్తితోఁబరీ - క్షిన్నరేంద్రుండు

నలలిత విమలసు - స్వాంతుఁడై చెలఁగి

3. చూ. 'ఆంధ్రవాగ్గేయకార చరిత్రము' (1958), బాలాంత్రపు రజనీకాంతరావు, పుట 183

యలఘు భాగవతంబు - నాలింపుచుండ
'నలపారిజాతాప-హరణ వృత్తాంత
మెలమి సాంగంబుగా - నెఱిఁగింపు'మనిన
శుకయోగి యభిమన్యు - సుతుని వీక్షించి
యకలంక కరుణ ని-ట్లని చెప్పఁదొడఁగె
విను రాజ చంద్ర! యీ - విధమెల్లఁదెలియ
ననిమిషమునిచంద్రుఁ - డమరావతికినిఁ
జని పారిజాతపు - ష్పము ఁగొని తెచ్చి
కనకాంబరునకు మేల్ - కాన్కగా నిచ్చెఁ,
బనిఁబూని కృష్ణుఁడా - పారిజాతమును
నెనరు మీఱఁగ రుక్మి - ణీ దేవి కొసఁగెఁ;
నందుకుఁబద్మాక్షు - నా సత్యభామ
పొందక, కోపించి - పొమ్మన్న శౌరి
'సతి! నీకు నేఁబారి - జాతవృక్షమును
హితవుమీఱఁగఁదెచ్చి - యిచ్చెద' ననుచు
సమ్మత పఱచి, యా - జలజాక్షి నెనసి,
నెమ్మది నందుండె - నీరజాక్షుండు."

-- విష్ణు పారిజాతము, పుటలు 4&5

పై ద్విపద పంక్తులలో తెల్పిన రీతిగా సత్యభామను సమ్మతపరచి, శ్రీకృష్ణుడు ఆమెకు చెప్పకుండా, మెల్లగా మందిరంనుండి వెలువడి శృంగారవనం చేరుకుంటాడు. అటు తరువాతి కథ అంతా ఉద్యానవనాల్లోనే నిర్వహింపబడింది. ఈ విధంగా ఉద్యానవనాలను కథా రంగాలుగా పరికల్పించటంలో కారణాన్ని ఇలాగ ఊహింపవచ్చు:

వెంగమాంబ తిరుమల చేరిన క్రొత్తలో ఎటు చూచినా నందనవనాలు విలసిల్లుతూవుండేవి. ఆ నందనవనాల నడుమ

ఆనందనిలయంలో నెలకొనియున్న వేంకటరమణుడు ఆమెకు ద్వాపరయుగం నాటి శ్రీకృష్ణుడుగా భాసించాడు. అంటే ఈ కవయిత్రీమతల్లి తిరుమల క్షేత్ర కమనీయ దృశ్యాల్లో పూలతోటలతో పరివేష్టించియున్న ద్వారకానగరాన్నీ, అందు నెలకొనియున్న ద్వారకాధీశు ణ్ణీ ఆ దేవదేవుని పారిజాతాపహరణ లీలనూ ఉదాత్తంగా భావించి, ఆ పవిత్రభావనను ఈ యక్షగానంలో పాదుకొల్పినదని ఊహింపవచ్చు. ఇదిగాక, కల్పవృక్షా లన్నింటిలో ప్రకృష్టమైయున్న పారిజాతవృక్షాన్ని సత్యాదేవియొక్క శృంగారవనంలో పాదుకొల్పడం ఈ నాటకంలోని ప్రధానాంశం కాబట్టి, ఈ కథ నంతటినీ అంతఃపుర ఉద్యానవనాల్లో నిర్వహిస్తే, అది మిగుల సముచితంగా ఉంటుందని ఈ కవయిత్రి అభిప్రాయంగా చెప్పవచ్చు.

పోతన భాగవతంలోని, తిమ్మన పారిజాతాపహరణంలోని ఈ క్రింది పద్యాలుసైతం ఉద్యానవనాన్ని ప్రధాన కథారంగంగా కావించటంలో కవయిత్రికి స్ఫూర్తి నొసగాయి-

i) "ఆ రామలతో నెప్పుడుఁ
బోరాములు సాల నెఱపి పురుషోత్తముఁడున్
గారామునఁదిరిగెను సా
ధారామలతా సరోవిహారముల నృపా!"

- దశమస్కంధము, ఉత్తరభాగము, 225ప.

ii) "ఆరమణీలలామముల నందఱఁగూడి యదూద్వహుండు తత్
ద్వారవతీపురోపవన వాటికలన్, కృతకాద్రి సీమలన్
వారిధి తీరకుంజసదనంబులఁ, గేళి తరంగిణీ తటీ
కైరవిణీ సహాయ మణి కల్పితసౌధములన్ వసించుచున్."

--పారిజాతాపహరణము, 1 ఆశ్వా, 39 ప.

iii) సిద్ధేంద్రయోగి భామాకలాపంలోని 'సత్యభామ వనవిహారం' (శ్రీకృష్ణునికొరకు అన్వేషించటం) కూడా పైవిషయానికి ప్రేరకంగా పరిగణింపదగివుంది.

సత్యభామ కోపానికి కారణమైన పారిజాత కుసుమవృత్తాంతాన్ని ఆదిలో స్వీకరించిన ఈ కవయిత్రి, అటనుండి సగభాగం సిద్ధేంద్రుని భామాకలాపవు బాణీలో కొనసాగించటంలో సముచితమూ, ప్రజ్ఞావిలసితమూ అయిన రచనానైపుణి ప్రస్ఫుటంగా గోచరిస్తూవుంది.

సిద్ధేంద్రుని భామాకలాపానికే పారిజాతావహరణమనే నామాంతరం కూడా ఉంది.[4] ఈ భామాకలాప యక్షగానంలో

(i) సత్యభామ లఘు విచారం ii) ఘన విచారం (iii) వనవిహారం

(iv) రాయబారం (v) ఘనతర విచారం - కృష్ణ నిరాకరణ సందేశం

(vi) ఘనతమ విచారం -కృష్ణ నిరసనం (vii) భామా నిరసనం

(viii) సవతుల సంవాదం (ix) సత్యభామ తెగువ - దుర్భర విచారం

(x) ఉద్యానలీల (xi) సమాగమం అనేవి ప్రధాన విభాగాలుగా ఉన్నాయి.[5]

---

4. చూ. 'ఆంధ్రవాగ్గేయకారచరిత్రము,' బాలాంత్రపు రజనీకాంతరావు, పుటలు 182,199,200,201,207&208.

5. బందరు వాస్తవ్యులు శ్రీమాన్ మరింగంటి శేషాచార్యులుగారి భామాకలాపం(కాగితవు వ్రాతప్రతి) ఈ తులనాత్మక పరిశీలనకు ఆధారం. వారి కూతురు, తి.తి.దే. శ్రీ వేంకటేశ్వర సంగీత కళాశాలలో ఉపన్యాసకురాలుగా ఉండిన శ్రీమరింగంటి కాంచనమాలగారి సౌజన్యంవల్ల ఆ వ్రాతప్రతిని పరిశీలించే అవకాశం ఈ పరిష్కర్తకు - మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ రచనలపై సిద్ధాంత గ్రంథాన్ని రచిస్తూ వుండిన సమయంలో (1983కు పూర్వం) - లభించి వుండింది. శ్రీమాన్ శేషాచార్యులుగారు కూచిపూడి నివాసులు, సుప్రసిద్ధ భరతాచార్యులు అయిన బ్రహ్మశ్రీ వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రులుగారి వద్ద ఉండిన భామాకలాపం వ్రాతప్రతిని చూచి (అందలి హాస్యఘట్టాలను మాత్రం మినహాయించి) ఈ ప్రతిని వ్రాసికొన్నట్లు శ్రీ కాంచనమాలగారు ఈ పరిష్కర్తకు తెల్పియున్నారు.

భామాకలాపంలో లఘు విచారం, ఘన విచారం - ఇత్యాది విభజనతో చిలువలు పలువలుగా ఉన్న సత్యభామా విచారాన్ని సంక్షేపించి స్వతంత్రంగా రచించియుండటం విష్ణుపారిజాతంలోని రచనా విశేషాల్లో ఒకటి.విష్ణుపారిజాతంలో సత్యభామ రాయబారం భామాకలాపంలోలాగానే నాలుగు తడవలుగా సాగింది. అయితే రెండిటికీ భేదం ఉంది. సిద్ధేంద్రుని కృతిలో మొదటి పర్యాయం చెలికత్తె లేఖను గైకొని శ్రీకృష్ణుని వద్దకు వెళ్లుతుంది. ఆపె మరలివచ్చే లోపల చంద్ర మన్మథాది దూషణలు, నాయిక కల గనటం జరుగుతాయి. చెలికత్తె వచ్చి పారిజాత కుసుమ వృత్తాంతాన్ని వినిపింపగా సత్య మూర్ఛిల్లుతుంది. రెండవమారు చెలి వెళ్లి విషయాన్ని నాయకునకు నివేదించగా, ఆయన నాయిక వద్దకు వచ్చి, నిరాకరింపబడి వెళ్లిపోతాడు. మూడవ పర్యాయం నాయిక చెలికత్తెను వెంటబెట్టుకొని వెళ్లి, నాయకునితో వివాదపడి, రుక్మిణితో కలహించి వస్తుంది. నాల్గవ పర్యాయం నాయిక ప్రాణత్యాగానికి సిద్ధపడుతుండగా, చెలి పరుగెత్తిపోయి నాయకుణ్ణి పిలుచుకొని వస్తుంది.

వెంగమాంబ రచనలో తొలుత చెలికత్తె వెళ్లి పిలువగా, శ్రీకృష్ణుడు వచ్చి, సత్యభామచే తిరస్కృతుడై మరలిపోతాడు. సత్యభామ రెండవ పర్యాయం చెలికత్తె ద్వారా లేఖను పంపుతుంది. ఆ లేఖను చదివి, శ్రీకృష్ణుడు తాను రాకుండా, ప్రత్యుత్తరం వ్రాసి పంపుతాడు. మూడవ మారు చెలిని వెంటబెట్టుకొని నాయిక స్వయంగా వెళ్లి సంప్రార్థించినా, ఫలితంలేక మరలిపోతుంది..

అప్పుడామె చింతా పరవశయై నిద్రించినట్లు ఉన్నంతలో ఒక కల గంటుంది. ఆ కలను చెలికత్తెకు వివరిస్తూవుండగా ఎఱుకత(కొరవంజి) -యొకతె వచ్చి సత్యాదేవికి ఎఱుక చెప్పిపోతుంది. నాలుగవ పర్యాయం

సత్య సఖీ సమేతయై వెళ్లి శ్రీకృష్ణుణ్ణి పలు విధాల మాటలతో ఎత్తిపొడిచి, ఫలితం కానక, మరలిపోయి, తన మందిరంలో శ్రీకృష్ణ జపం చెయ్యటానికి పూనుకొంటుంది. సిద్ధేంద్రుని కృతిలోని రెండవ, ఒకటవ, మూడవ పర్యాయాలు క్రమంగా విష్ణుపారిజాతంలో ఒకటవ,రెండవ, నాలుగవ పర్యాయాలుగా మార్పునొందివుండటం గమనింపదగ్గది. రెండవ పర్యాయం చెలిద్వారా సత్యభామ పంపిన ఉత్తరానికి శ్రీ కృష్ణుడు ప్రత్యుత్తరం వ్రాసిపంపడం, అనంతరం ఎఱుకత వచ్చి యెఱుక చెప్పటం ఈ సందర్భంలో ఈకవయిత్రి నూతనంగా కల్పించినటువంటివి. సత్యభామ ప్రాణత్యాగానికి సిద్ధపడటం అనే నాలుగవ అంశాన్ని వెంగమాంబ స్వీకరింపలేదు. పారిజాత అపహరణ వృత్తాంతంతో కథను పొడిగించ సంకల్పించియుండటమే అందుకు హేతువు.

కలాపంలో సత్యభామ ఒక్క (మూడవ) పర్యాయం మాత్రమే నాయకుని వద్దకు వెళ్లివచ్చినట్లు ఉంది; ఈ యక్షగానంలో రెండు(మూడవ, నాల్గవ)పర్యాయాలు నాయిక స్వయంగా వెళ్లివచ్చింది. నాల్గవ మారుకూడా నాయకుడు రానందువల్ల సాత్రాజితి శ్రీకృష్ణజపం చేయనారంభించింది. ఇది తదుపరి కథ కొనసాగటానికి లంకెగా అమరివుంది.

విష్ణుపారిజాతంలో తరువాతి కథ అంతా పారిజాతవృక్షాన్ని తీసుకొని వచ్చే వృత్తాంతమే. భాగవతం(దశమస్కంధం)లో శ్రీకృష్ణుడు సత్యభామా సమేతంగా గరుడవాహనారూఢుడై వెళ్లి, నరకాసురుణ్ణి సంహరిస్తాడు. అనంతరం అతని మందిరంలోని అదితి కుండలాలను సేకరించి, వాటిని ఆ దేవమాతకు సమర్పించటానికి స్వర్గలోకానికి వేంచేస్తాడు. ఆ పనియైన పిమ్మట, నందనవనాన్ని దర్శించటానికి వెళ్తాడు. ఆ తరుణంలో సత్యభామ పారిజాత తరువును చూడటమూ, తన్మహిమకు

సత్యాదేవి ఆశ్చర్యచకితురాలై ఆ చెట్టు తనకు కావాలని కోరడమూ, ఆమె కోరిక తీర్చే నిమిత్తంగా శ్రీకృష్ణుడు వెంటనే ఆ కల్పతరువును అపహరించటమూ జరిగింది. అంటే, అంతకుముందు నారదముని పుష్పాన్ని తెచ్చి యిచ్చిన కథాంశము భాగవతంలో లేదన్నమాట. కాబట్టి, భాగవత కథలో శ్రీకృష్ణుడు తలవని తలంపుగా కోరిన సత్యభామ కోరిక నెరవేర్చడానికై అనుకోకుండా పారిజాత కల్పవృక్షాన్ని అపహరించడం సంభవించింది.

నంస్కృత' హరివంశానుసారంగా విరచితమైన ముక్కుతిమ్మనార్యుని పారిజాతాపహరణ ప్రబంధంలో నరకాసురవధ అయిన పిదప కొన్నాళ్లకు నారదుడు పారిజాతకుసుమాన్ని శ్రీకృష్ణునికి సమర్పించాడు. ఆ పుష్పాన్ని తనకివ్వలేదనే కారణంగా అలుకవహించిన సత్యభామను సమాధానపరచే నిమిత్తంగానే - అదితికి కుండలాలను సమర్పించే నెపంతో - శ్రీకృష్ణుడు సత్యాసహితుడై స్వర్గానికి విచ్చేసి, పారిజాత అపహరణం చెయ్యటం జరిగింది. అయితే, ఈ విష్ణుపారిజాత యక్షగానంలో తొలుత నారదుడు పుష్పాన్ని తెచ్చి ఇవ్వటమూ, తరువాత కొంత కాలానికి నరకుణ్ణి సంహరించటమూ వర్ణింపబడివున్నాయి. సుప్రసిద్ధ వాగ్గేయకారుడైన శ్రీశివనారాయణ తీర్థులు (క్రీ.శ.1580-1680) రచించిన పారిజాతాపహరణ యక్షగానంలోకూడా ఇలాగే ముందు నారదుడు పుష్పాన్ని తెచ్చి యివ్వడం, తరువాత శ్రీకృష్ణుడు నరకునిపై దండెత్తి వెళ్ళటం వర్ణింపబడ్డాయి. ఆ కృతి ఆరంభంలోని ఈ క్రింది కథాసంగ్రహశ్లోక పంక్తులు ఇందుకు అక్షర నిదర్శనాలు.

"..................................................

నారదాగమనం పశ్చాత్ పారిజాత సమర్పణం
తత: శ్రీకృష్ణసంవాదౌ రుక్మిణీ సత్యభామయోః

కృష్ణేనాపి కృతం సత్యభామాయా శ్చిత్తరంజనం
సత్యమయా వైనతేయేన గగనం గమనే పథిం
సత్యభామాం పురస్కృత్య నరకాసుర మంథనం
నందనోద్యాన గమనం పారిజాత సమర్పణమ్"

- ఆంధ్ర వాగ్గేయ కార చరిత్రము, 192-193 పుటలు

ఈ యక్షగాన కథానాయకుని పరాక్రమాతిశయాన్ని ప్రకాశింపచేయటానికై తీర్థులవారు, వెంగమాంబ తమతమ కృతుల్లో ప్రైరీతిని మార్పు గావించియున్నారు.

మోక్షదాయకమైన ఈ పౌరాణిక గాథను యక్షగాన రూపకాలుగా వెలయించి కృతకృత్యులయిన నారాయణతీర్థులు, సిద్ధేంద్రయోగి, తరిగొండవెంగమాంబ - ఈ ముప్వరు మహనీయుల కృత్యారంభంలోని ^రినామాంకిత కందాలు ఈ సందర్భంలో పరికింపదగివున్నాయి:

"భవ భయ తిమిరదివాకర
శివరామానందతీర్థశిష్యోత్తములౌ
శివనారాయణతీర్థులు
సవరణతోఁ బారిజాతచరిత రచించెన్ [6]
"జనులార! వినుఁడు హరికథ
వినువేడుక గలిగెనేని వీనులకొలఁదిన్
గొనుఁడీ! కర్ణామృతమును
ఘనుడౌ సిద్ధేంద్ర యోగి కవితారచనన్"[7]
"వర శేషాచలపతియగు
తరిగొండాధిపుని పరమధరణిని వెలయన్
సురపారిజాత తరు కథ
నరుదుగ నింజేటి వెంగమాంబ రచించెన్"

- విష్ణుపారిజాతం ప్రారంభ పద్యం.

---

6చూ. 'భారతి', సంపుటి(1925), సంచిక 7, పుట 14

7చూ. ఆంధ్రవాగ్గేయకార చరిత్రము, 204 & 205 పుటలు.

## సన్నివేశ పరికల్పన:

సులలితమైన నాటకీయతా లక్షణంతో శోభిల్లుతూవున్న ఈ యక్షగానం మొత్తం ఇరువది రెండు రమణీయ రంగాలు (Scenes)గా వింగడించడానికి అనువుగా అమరివుంది. ఆ విధంగా వింగడించటానికి ప్రతిరంగమూ మనోహరము లైన సంభాషణలతో రసోల్లా రాజిల్లుతూవుంది. శ్రీకృష్ణుడు వనపాలునితో సంభాషించడం, రుక్మిణ్యాదులతోనూ, సత్యభామతోనూ మాట్లాడటం, సత్యాశ్రీకృష్ణుల సంవాద ఘట్టాలు, ఎఱుకత సోదె చెప్పటం, శ్రీకృష్ణుడు పారిజాత తరువును అపహరించడం, ఇంద్రోపేంద్రుల యుద్ధదృశ్యాలు, హరిహరుల సమావేశం, సవతుల కలహం - ఇత్యాది సన్నివేశాలు ఈ విషయంగా పరిశీలింపదగివున్నాయి, సత్యభామకు సోదె చెప్పటానికి వచ్చిన 'పలుకుల సింగి' అనే పేరుగల కొరవంజి సన్నివేశంలో ఈ కవయిత్రి లోకజ్ఞత సహజంగా, సుందరంగా వ్యక్తీకరింపబడింది.

"పంకజేక్షణ! విను - బంగాళ మగధ
సింధు పుళింద కా - శ్మీరాదులైన
. . . . . . . . . . . . . . . . . . . . .
. . . . . . . . . . . . . . . . . . . . .
. . . . . . . . . . . . . . . . . . . . .
వివిధదేశంబుల - వింతగాఁదిరిగి
వివిధములైనట్టి - విద్యలచేత
పరఁగ నందఱి నోళ్ల - బడి విజృంభించి
యిరవుగా నే రచ్చ - కెక్కి యుండుదును
గాన మాయత్తయౌ - కలుముల సింగి
నానా విధంబుల - ననుఁ బరీక్షించు,

నే నున్న చోటుల - నిలువక తిరుగు,
తానున్న చోట్లకే - తరుణి నన్ బిలుచు,
నేను తానొక దిక్కు - నిలుచుట యరుదు,
పూని నిల్చిన మహా - ద్భుతముగా నుండు."

- విష్ణుపారిజాతము, పుటలు 120&121

**పాత్రచిత్రణ:**

పాత్రచిత్రణలో ఈ కవయిత్రి సిద్ధహస్తురాలనటానికి ఈ నాటకంలోని చిన్న, పెద్ద పాత్రలు అన్నీ సజీవ దృష్టాంతాలే! భామాకలాపంలో సమయానుకూలంగా మాధవి (చెలికత్తె)గా, మాధవుడు (విదూషకుడు)గా నటించే ఒకే పాత్ర ఈ యక్షగానంలో వక్రభాషిణి, వికటభాషణుడు - అనే వనపాలక దంపతులుగా రూపొందింది.

ఈ సహాయకపాత్ర లిర్వురూ సార్థక నామధేయులు, సరళస్వభావులు.

ఈ కథానాయకుడూ, ధీరలలితుడూ అయిన శ్రీకృష్ణదేవుని బహుప్రియాసదృశమైన దక్షిణనాయకత్వం ఇందులో సుస్పష్టరేఖలతో ఆవిష్కరింపబడింది. కథానాయిక యైన సత్యభామ కోపన అయినా, తిమ్మన, సిద్ధేంద్రుల కృతుల్లో ఉన్నంత తీవ్రస్వభావ కాదు. సవతి మచ్చరం ఉన్నప్పటికీ, ఇంచుక అమాయికగా, శృంగార వైరాగ్యరసాలు ముఖంలో దీపించే పతిదేవతగా, శ్రీకృష్ణజపం కావించే భక్తురాలుగా చిత్రింపబడింది. పట్టమహిషీ, ఆదిలక్ష్మియొక్క అవతారమూ అయిన రుక్మిణీదేవి సవతి మాత్సర్యం లేని ఉదాత్త నాయికగానూ, చెల్లెంద్రందరి మధ్య సయోధ్యను సాధించి, నాయకునకు మనశ్శాంతి చేకూర్చే ఉత్తమురాలుగానూ అద్వితీయంగా చిత్రింపబడింది. ఇలాగే, జాంబవత్యాది పాత్రలు సముచిత ప్రాముఖ్యంతో పోషింపబడి, వారి వారి మానసిక భావాలు చక్కగా ఆవిష్కరింపబడివున్నాయి. ఇందులో దివ్యాతి దివ్య పాత్రమైన పరమేశ్వరుని కమనీయ ఆకృతి కనులకు కట్టినట్లుగా పదమూడు ద్విపదలలో సాక్షాత్కరింపజేయబడింది (చూడు.పుటలు 5&6)

## నాటకీయత:

రచనలో నాటకీయతా గుణాన్ని నెలకొల్పటంలో సిద్ధహస్తురాలీ కవయిత్రీ శిరోమణి. ఈ మహాకవయిత్రి రచించిన యక్షగాన కృతులన్నీ ఇందుకు తార్కాణాలే. అందులోనూ తిరుమల ధరణిపై ప్రప్రథమంగా వెలయజేసిన ఈ కృతిలోని ప్రతి సన్నివేశమూ - ఇంతకు మునుపు పేర్కొన్నట్లుగా- సముచిత సంభాషణలతో విలసిల్లుతూ చక చకా సాగింది. సత్యభామ శ్రీకృష్ణుణ్ణి ఉపాలంభించటమూ, ఇంద్రోపేంద్రుల యుద్ధమూ లాంటి విపుల వర్ణనాఘట్టాల్లో సైతం సంవాదశిల్పం నిండారివుండటం కొనియాడదగిన విషయం. ఈ గ్రంథ పరిమితిని బట్టి, ఆధునిక కాలానుగుణ్యంగా ఇది శ్రవ్య కావ్య తరగతికి చెందిన నాటకంగా తోచినప్పటికీ, ఇందులో ప్రదర్శన సౌలభ్యానికి కొదువ లేదు.

## శైలి:

రాగతాళ యుక్తములయిన దరువులు, రేకులు, ద్విపదలు, కందార్థములు, ఏలలు మున్నుగాగల పలురీతుల దేశీయ ఛందస్సుల విపులమైన వైవిధ్యంతో, తత్సమాచ్ఛిక పదాల సముచిత సమ్మేళనంతో, శిష్టవ్యావహారికంలోని పలుకుబళ్ల పసందుతో ఇందలి నాటకీయ శైలి రసపరిప్లుతంగా శోభిల్లుతూవుంది. హాస్య, వీరరసములు ఈ యక్షగానంలో అంగరసాలై, ప్రధాన (అంగి)రసమైన దివ్యశృంగారాన్ని సొంపుగా పోషిస్తూవున్నందువల్ల ఈ కృతి రసవత్తరమగు దేశీయ దృశ్యకావ్యంగా రాణిస్తూవుంది.

## కృతి సందేశం:

ఈ యక్షగానంలో ప్రధానమైన కథ పారిజాత అపహరణ వృత్తాంతం. సూక్ష్మంగా పరిశీలిస్తే ఇందులో లీలామానుషరూపుడైన

శ్రీకృష్ణుడు తన పత్నుల్ని కలిసికోవటానికై పొందే తహ తహ ఒక వైపు చెరలాడగా, ఆ ప్రియ పత్నులు సర్వ సమర్పణ భావంతో ప్రాణనాథుణ్ణి చేరుకోవటానికి పడే ఆరాటం ఇంకో వైపున ప్రత్యక్షమౌతూవుంది.

ఇందులో పరస్పరానురక్తులయిన ఉత్తమస్త్రీ పురుషుల లౌకిక ప్రణయం వాచ్యంగా గోచరిస్తూవున్నప్పటికీ, భగవంతునకూ, ఆయన భక్తజనులకూ నడుమ దీపించే ఆధ్యాత్మికమైన అనుబంధం వ్యంగ్యంగా భాసిస్తూవుంది. ఈశ్వర సాక్షాత్కారానికై నిరంతరం తపిస్తూవుండే జీవాత్మలు ఆ పరమాత్ముని సాక్షాత్కారాన్ని పొందిన వెనువెంటనే బ్రహ్మానందాన్ని అందుకొన్నట్లుగా, సత్యభామాది పత్నులు శ్రీకృష్ణ సమాగమంతో పరమానందాన్ని పొందినారు.

మొత్తంమీద మానవ జీవితంయొక్క చరమలక్ష్యం పరమాత్మ సాక్షాత్కారమే - అనే ఉత్తమ సందేశం ఈ ఆధ్యాత్మిక శృంగార కావ్యం ద్వారా ధ్వనింపజేయబడుతూవుంది.

## సిద్ధేంద్రయోగి రచనపై ప్రభావం:

తరిగొండ వెంగమాంబ ఈ యక్షగానంలో కొంతవేరఖ భామాకలాపంలోని కథాసూత్రాన్ని స్వేచ్ఛగా అనుసరించింది. ఆ అనుసరణ ప్రభావం పరావర్తితమై సిద్ధేంద్రుని కృతిపై ప్రతిఫలించింది. అనగా విష్ణుపారిజాతంలోని దరువులూ, పద్యాలూ, చూర్ణికలూ మొదలయినవి కొన్ని భామాకలాపప్రతిలోనికి చేరి, తత్ప్రదర్శకులైన భాగవతులచే ప్రదర్శింపబడుతూవస్తున్నాయని సారాంశం. ఇది ఒక విచిత్రమయిన సారస్వత సన్నివేశం! ఈ విషయమై ఒకటి రెండు

ఉదాహరణలు:-

1) ఇతఃపూర్వం (ఈ పీఠికయొక్క ఐదవ అధోజ్ఞాపిక(foot-notes)లో పేర్కొన్న మరింగంటివారి భామాకలాపం (వ్రాతప్రతి) లో సత్యభామ శ్రీకృష్ణునకు లేఖవ్రాసే సందర్భంలో ఈ క్రింది వచనం, పద్యాలు ఉన్నాయి:

"సత్య: ఇక వెళ్లుచున్నావు గన్క నా స్వయముగా కొద్ది
ఉత్తరము వ్రాసి ఇస్తాను పట్టుకొని వెళ్లవే వోయమ్మా!
అనుచు తనకొనగోటితో నందముగను
పసిఁడి కేతకి రేకుపై పంక్తు లమరఁ
దన యభిప్రాయమెల్లను దనర వ్రాసి
అపుడె తన చెలికిచ్చి యిట్లనియె తరుణి
చెలియా! లిఖితమ్మును మా
జలజాక్షున కిచ్చి చాల సమ్మతిమీఱన్
పిలుచుక రమ్మన నది చని
యెలమిని పద్మాక్షుఁజేరి యిట్లని పలికెన్"

- మరింగంటివారి ప్రతి, 69,70 పుటలు

మీద ఉదాహరించిన రెండు పద్యాలూ విష్ణుపారిజాతంలో యథాతథంగా దర్శనమిస్తూ వున్నాయి. (చూ61&62పుటలు)

2)విష్ణుపారిజాతంలోని సత్యభామ లిఖితం (ద్విపద.... పుటలు) మరింగంటివారి వ్రాతప్రతిలో "తరిగొండవారి యుత్తరము" అనే శీర్షికతో తూచా తప్పక నెలకొని వుంది.

3)సత్యభామ శ్రీకృష్ణుణ్ణి ఉపాలంభించే ఘట్టంలో "వైరివార గజసింహ! తరిగొండ నారసింహ!" ' "చాలు నికపోవె నీప్రేమ సత్యభామ!" - అనే మకుటాలు గలిగి, ప్రశ్నోత్తరాల రూపేణ జాల్వారిన పదహారు సీస పద్యాలు (చూ.విష్ణుపారిజాతం62&64పుటలు) మరింగంటివారి వ్రాతప్రతిలో యథాతథంగా సాక్షాత్కరిస్తున్నాయి.

4)ఇవిగాక, విష్ణుపారిజాతంలో కనిపించని ఈ కవయిత్రి రచించిన మరికొన్ని దరువులు, కీర్తనలు మరింగంటివారి వ్రాతప్రతిలో కనబడుతున్నాయి. ఈ విషయాన్నే బందా కనకలింగేశ్వరరావుగారు

ఆంధ్రప్రదేశ్ సంగీతనాటక అకాడెమీవారు ప్రచురించిన 'భామాకలాపం' యొక్క ఉపోద్ఘాతంలో క్రింది విధంగా విశదీకరించారు:

"ఈనాడు మేము వెతుకగాసుమారునూరుప్రతులు లభించాయి. పాఠాంతరాలున్నాయి.......కూచిపూడిలో వేదాంతం పార్వతీశం మరొక ప్రతిని [illegible] బందరు మరింగటి శేషాచార్యుల వారివద్ద మరియొక ప్రతి ఉన్నది. తరిగొండ వెంగమాంబగారు ఇందు కొన్ని కీర్తనలను రచించారు. అందుకు నిదర్శనంగా వేంకటేశ్వర మకుటంతో కొన్ని దొరికాయి........."

- ఉపోద్ఘాతము, III పుట

మచ్చుకు ఈ క్రింది కీర్తన అట్టివాటిలో ఒకటి:

" మా వేంకటేశునకు మంగళం। మదభీష్టదాయికీ మంగళం।
సరసీజానేత్రునకు, వనమాలా గాత్రునకు ।
మరకతా భరణునకు మంగళం॥ ॥మా వేంకటేశునకు॥

మునిజనా పాలూనకూ। వనమాలా ధారునకూ।
మరుపారివారునకూ మంగళం ॥మా వేంకటేశునకు॥
ఉరగశైలవాసునకూ గరుడ వాహనునకూ
మరుని జనకునకూ మంగళం ॥మా వేంకటేశనకు॥

పైన ఉదాహరించిన మంగళ హారతి గీతం నేడు విష్ణుపారిజాతంలో కానరాదు. కాని, అది తరిగొండ వెంగమాంబ రచనే అని అందులోని వేంకటేశమకుటం, 'ఉరగశైలవాసునకూ' - ఇత్యాది పదాలు చెప్పక చెపుతున్నాయి. బహుశా పై గేయం ఈ కవయిత్రిరచించిన రుక్మిణీనాటకంలాంటి అలభ్య యక్షగానాల్లోనిదై వుంటుంది.

ఫలితార్థమేమంటే, సిద్ధేంద్రుని భామాకలాపాన్ని ఆదర్శంగా స్వీకరించి ఎందరో రచయితలు 'భామకలాపాల'ను, 'పారిజాతాలను' రచించినప్పటికీ, వాటిల్లో ఏ ఒక్కటీ వెంగమాంబ రచించిన విష్ణుపారి జాతంలాగా తన ప్రభావాన్ని ప్రసరింపజేయలేదు. ఇందుకు

ఈ యక్షగాన నాటకంలో ప్రతిఫలించియున్న ఈ కవయిత్రీ శిరోమణియొక్క కవితా మహత్త్వమే అది కారణం.

విష్ణుపారిజాతాన్నీ, భామాకలాపం వ్రాతప్రతినీ సరిపోల్చిచూడటంవల్ల ఇంతవరకు వెల్లడయిన పోలికల ననుసరించి ఒకానొక అపూర్వ విషయం తెలియవచ్చింది. అదేమంటే, సిద్ధేంద్రయోగివర్యుని భామాకలాప రచనను-పెక్కుప్రతుల సహాయంతో-పునరుద్ధరింప సంకల్పించే పరిశోధకులకు తరిగొండ వెంగమాంబ రచించిన విష్ణుపారిజాతం అవశ్యంగా సంప్రదించవలసిన 'సత్కృతి' అనే వాస్తవం!

## విష్ణుపారిజాతరచనా కాలంనాటి తిరుమల:

విష్ణుపారిజాతం వెంగమాంబ తరిగొండను వీడి తిరుమల క్షేత్రం చేరిన పిదప రచించిన మొట్టమొదటి కృతి. ఈ కృతి రచనా సంకల్పం ఆమెకు అంతకు మునుపే ఉండినట్లు, తిరుమలకు వచ్చీ రాగానే భక్త్యావేశంతో ఆశువుగా ఆమె పల్కిన "శృంగారరాయని చెలువుమీఱిన కొండ' - అనే సీసపద్యాన్ని బట్టి ఊహింపవీలవుతున్నది. ఈ పద్యంలో గల-

"పుష్పజాతుల విష్ణుఁ బూజింపఁగల కొండ
కల్పవృక్షము లైదు కలుగు కొండ"

అనే పాదం ఈ ఊహను బలపరుస్తున్నది. ఆమె రచనా సంకల్పం పరిస్థితులు అనుకూలింపగానే అక్షరరూపాన్ని ధరించి, ఈ యక్షగాన ప్రబంధంగా అవతరించింది!

వెంగమాంబ ఇంటిదేవుడైన తరిగొండ లక్ష్మీనృసింహుణ్ణే ఇష్టదైవమైన తిరుమల వేంకటరమణునిలో సందర్శించి, ఆ అభేద భావనను ఈ యక్షగాన కథలోని నాయకుడయిన శ్రీకృష్ణునితో సొంపుగా సమన్వయించింది. ఈ సమన్వయ దృక్పథం మనకు ఈ రచనలో ఎంతో ఉదాత్తంగా, అడుగడుగునా అత్యంత ఆహ్లాదకరంగా సాక్షాత్కరిస్తూవుంది.

వెంగమాంబ జీవితగాథ ననుసరించీ, ఆమె రచనలలో లభించే ఆధారాలను బట్టీ క్రీ.శ.1755వ సంవత్సరం ప్రాంతంలో ఆమె తిరుమల క్షేత్రాన్ని చేరుకొన్నట్లు విశ్వసింపవచ్చు. అటుపిమ్మట కొంతకాలానికే-అనగా క్రీ.శ.1760కి ముందే-ఈ కృతిని రచించినదని నిశ్చయింప వీలు కలదు. ఆ సమయంలో తిరుమల దేవాలయాన్నీ, తత్పరిసర పవిత్రప్రదేశాలనూ తనివితీరా భక్తితో దర్శించిన ఈ కవయిత్రీమతల్లియొక్క ఈ ప్రథమ రచనలో అలనాటి విశేషాలు కొన్ని అలవోకగా ప్రతిబింబించి వున్నాయి.

శ్రీకృష్ణుడు శృంగారవనంలో తననుగూర్చి అన్వేషిస్తూ వున్న రుక్మిణ్యాది వధూమణుల యెదుటికి వస్తాడు. అప్పుడు ఆ వధూమణులు స్వామిని భక్తిప్రపత్తులతో స్తుతిస్తారు. ఆ ఘట్టంలో ఒక చూర్ణిక రచింపబడివుంది. అందలి నాలుగవ పేరాలో అనేక ఫలవృక్షాలు, పూలతీగలు, పొదరిండ్లు - వీటితో పరివేష్టింపబడియున్న శేషాచలమూ, అందలి ఆలయంలో నెలకొనివున్న వేంకటేశ్వరుడూ (శ్రీ కృష్ణునితో అభిన్నంగానే) సంబోధింపబడివున్నాడు.(చూ. విష్ణుపారిజాతము, చూర్ణిక, పుట24.).

అలాగే, సత్యభామ శ్రీకృష్ణుణ్ణి ప్రస్తుతించిన రెండుచూర్ణికల్లోనూ తిరుమల దేవాలయ దృశ్యాలు పరమరమణీయంగా వర్ణింపబడివున్నాయి. (చూ. విష్ణుపారిజాతము, చూర్ణిక, 7 &8 పేరాలు, పుట69,మరియు చూర్ణిక 5వ పేరా, పుట100).

ఈ కథా నాయికయైన సత్యభామ తాను నిదురిస్తూవుండగా తనను వంచించి వెళ్లినాడనీ, ఇచ్చిన మాట ప్రకారం తనకు పారిజాత తరువును తెచ్చి యివ్వలేదనీ, భక్తి యుక్తులతో తాను ప్రార్థించినా రాలేదనీ శ్రీ కృష్ణునితో వివాదపడుతుంది. సుదీర్ఘంగా సాగిన ఆ వివాదంలో దరువులు, ద్విపదలు మొదలయిన వాటితో పాటు 24 సీస పద్యాలు

చోటు చేసికొన్నాయి. వీటిలో 12 పద్యాలు కోపనయైన సత్యభామ శ్రీకృష్ణుణ్ణి ఆక్షేపిస్తూ పలికిన నిందావాక్యాలతో నిండివున్నాయి. "శేషాద్రినిలయ! వైరి, వార గజసింహ! తరిగొండ నారసింహ!" - అనేది వీటి మకుటం. అందుకు సమాధానాలుగా స్వామి పల్కిన 12 సీస పద్యాలల్లో "చాలు నికఁ బోవె! నీ ప్రేమ సత్యభామ!"- అనే పాదం మకుటంగా అమరివుంది.

సత్యభామ శ్రీ కృష్ణునితో వాదిస్తూ పలికిన 12 సీస పద్యాల్లో ఐదింటియందు తిరుపతి వేంకటేశ్వరుణ్ణి నేరుగా, సూటిగా ఉపాలంభించిన పల్కులు చోటుచేసికొనివున్నాయి[8]. సత్యభామ పల్కిన ఆ నిందావాక్యాలనుబట్టి కవయిత్రి కాలంనాటి - తిరుమల క్షేత్రానికి సంబంధించిన - కొన్ని ఆలయ సంప్రదాయాలు, మరికొన్ని చారిత్రక, సామాజిక విశేషాలు వెల్లడవుతున్నాయి.

"మొండిలెక్కలు వేయుచు, బండ కూడు
కుడువఁదలఁచెదవేమొ? నీగొల్లబుద్ధి
తెలిసివచ్చెను శేషాద్రి నిలయ! వైరి
వారగజసింహ! తరిగొండ నారసింహ!'

-విష్ణుపారిజాతము.170వ సంఖ్యగల సీస పద్యము

పై పద్యపంక్తుల్లోని సత్యభామ యెత్తిపొడుపులో వేంకటేశ్వరుడు ముడుపుగట్టి మ్రొక్కుకొన్న భక్తులవద్దనుండి-వాళ్ల ఆలస్యానికి సహింపక-వడ్డీకి వడ్డీ వసూలు చేసేవాడనీ, గురువారంనాడు తిరుప్పావడ నివేదన దర్భంలో బండమీద గొప్పగా రాశి పోసిన నైవేద్యాన్ని ఆరగించేవాడనీ ఆక్షేపింపబడినాడు.

---

8చూ.విష్ణుపారిజాతము,170,172,174,176,178 సంఖ్యలుగల సీస పద్యాలు

"వండిన కూడమ్మి వడ్డికాసులు గూర్చ
నేర్చె నన్నను లజ్జ నీకు లేదు,
తురకల రవుతౌచు వెఱచి వారికి రూక
నెఱి నిచ్చెనన లజ్జ నీకు లేదు"

- విష్ణుపారిజాతము, 172 ప.

మీద నుదాహరించిన పద్యపాదాలనుబట్టి ఆ కాలంలో తిరుమల దేవాలయంలో ప్రసాదాల విక్రయం విరివిగా సాగుతూవుండేదనీ, (వేంకటేశ్వరుడు కుబేరునికి చెల్లించవలసిన ఋణం క్రింద) ఈప్రాంత పాలకుడై యుండిన అర్కాటు నవాబుకు దేవస్థానం కప్పం చెల్లిస్తూవుండిందనే చారిత్రకాంశం యథార్థమేననీ విదితమౌతున్నది.

అయితే పై ఆక్షేపణలకు ఈ భక్త కవయిత్రి స్వామివారిచే (శ్రీకృష్ణునిచే) పలికించిన సమాధానాలు సైతం ఈ సన్నివేశంలో అహ్లాదకరంగానే అలరారుతూవున్నాయి:

"నా ప్రసాదము మీద నరులకెల్లను భక్తి
నిలుపఁ దత్క్రయమెల్ల నేనె గొందు,
అలయించి వడ్డికాసులు, మొదల్ గొని, భక్త
భరము దురుష్కుల పాలు చేతు"

-విష్ణుపారిజాతము, 173 ప.

అనగా, తిరుమల ఆలయంలో ప్రసాదాలను అమ్మి డబ్బు గడించటం ప్రజానీకంలో ఆ ప్రసాదాలపై భక్తి గౌరవాలను పెంపొందించటానికేననీ, అలాగే భక్తజనులనుండి వడ్డీతో వసూలు గావించిన ద్రవ్యాన్ని తురకలకు (నవాబుకు) కప్పంగా చెల్లించడంలో, ఆ కప్పంతోపాటు పాపాలనుకూడా బదలాయించి, భక్తులను పాపాలనుండి విముక్తుల్ని చేయటానికేననీ వెంగమాంబ స్వామిచే పల్కించింది. ఇలాగ పల్కించడంలో ఉత్కృష్టమైన సమన్వయ దృక్పథమూ, ఉదాత్తమైన కవితా చమత్కృతీ లెస్సగా గోచరిస్తూవున్నాయి.

"విను విప్రులకు శూద్రు లెంగిలి నీళ్లను
అంపులు చేసి త్రావింపగలవు
చద్దికుండల కూడు పెద్ద నైష్ఠికులచే
బెదరుఁ జూవుచుఁ దినిపింపఁగలవు
చెలరేగి పరుల బిడ్డల పెండ్లి నీవాడి
పిఱికి దాసళ్ల కొప్పింపఁగలవు"

-విష్ణుపారిజాతము,174 ప.

సత్యభామ పల్కిన పై నిందావాక్యాలకు స్వామివారి సమాధానం ఈ క్రింది రీతిగా ఉంది:

"వరతొట్టి తీర్థ మందఱికి నేఁద్రావించు
టాత్మభేదంబు లేదనెడి కొఱకె,
చద్దికుండలలోని సాద మందఱి కిచ్చు
టల కర్మవాసన లణఁచుకొఱకె,
పెండ్లాల దాసరి వాండ్ల కొప్పించుట
కలియుగంబున లక్ష్మి వెలయుకొఱకె."

-విష్ణుపారిజాతము,175 ప.

తిరుమల శ్రీవేంకటేశ్వరస్వామివారి ఆలయంలో విమాన ప్రదక్షిణమార్గంలో అన్నమాచార్య సంకీర్తన భాండారానికి ఎదురుగా తొట్టితీర్థమనే పుణ్యతీర్థం ఉంది.

శ్రీవారి పాదాలనుండి జాలువారే అభిషేక నిర్మల జలం ఇందులో చేరుతుంది. సంస్కృత వేంకటాచల మాహాత్మ్యంలోని స్కందపురాణ భాగంలో ఈ తొట్టి తీర్థ (కటాహతీర్థ)మహిమ గొప్పగా కొనియాడబడింది. వెంగమాంబ కాలంలో ఈ తొట్టితీర్థంలోని జలాలను-వారు వీరనక-ఆబాలగోపాలం అందరూ భక్తి ప్రపత్తులతో సేవిస్తూవుండేవారు. అందువల్లే

వాటిని సత్యభామ "శూద్రుల యెంగిలినీళ్లు"గా పేర్కొన్నది. అందుకు సమాధానంగా కవయిత్రి స్వామివారిచే పలికించిన "ఆత్మభేదంబు లేదనెడికొఱకె"-అనే మాట కటాహతీర్థంయొక్క మాహాత్మ్యంతోపాటు పరమయోగినియైన వెంగమాంబయొక్క సర్వసమభావనతో కూడిన.

ఉదారదృక్పథాన్ని చక్కగా చాటుతూవుంది.

"శ్రీహరి పాదతీర్థంబే చెడని మందు"[9]అని అన్నమాచార్యులు ఆలాపించిన అధ్యాత్మ సంకీర్తన బహుశః ఇలాంటి శ్రీవారి "శ్రీపాదతీర్థం"యొక్క ప్రభావాన్నే లెస్సగా ప్రశంసిస్తూవుందని చెప్పవచ్చు. క్రీ.శ.19వశతాబ్ది ఉత్తరార్థంలో "కాక్స్"-అనే ఆంగ్లేయ ఉద్యోగిరచించిన North Arcot District Manualలో కూడా ఈ తీర్థంయొక్క ప్రభావం

ఉట్టంకింపబడింది. (క్రీ.శ.1911లో చిత్తూరు జిల్లా ఏర్పడేంతవరకూ తిరుమలక్షేత్రం, తత్పరిసరప్రాంతాలు ఉత్తరార్కాడు జిల్లాలో చేరివుండేవి). ఆ కాలంలో తిరుమలలో పాములు విశేషంగా విచ్చలవిడిగా సంచరిస్తూవుండేవి. పొరపాటున ఎప్పుడైనా ఎవరినైనా కాటువేస్తే, వెంటనే ఆ సమీపస్థులు గుళ్లోకి పరుగెత్తి వెళ్లి ఈ తీర్థజలాన్ని తెచ్చి ఆసర్పదష్టునిచే త్రావింపజేసేవారు. అంతేగాక, ఆ తీర్థాన్ని పాము కఱచినచోట బాగా అలదేవారు. వెనువెంటనే, సర్పదష్టుడైన ఆ వ్యక్తి కోలుకొనేవాడు. ఈ విషయాన్ని కాక్స్ దొర తన రచనలో ఆసక్తితో నమోదు చేసియున్నాడు.[10] శ్రీస్వామివారి యెడల చెక్కుచెదరని భక్తి విశ్వాసాలు గల్గియుండిన ఆనాటి సమాజంలో ఆ తీర్థం సైతం అంతటి మహిమా నిరూపకంగా, ప్రభావశాలిగా పనిచేస్తూవుండేది.

---

9. చూ.'శ్రీతాళ్లపాక అన్నమాచార్యుల జీవిత చరిత్రము 'TTD Reprint(2001) శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారి పీఠిక, 32&33 పుటలు

10. ఈDistrict Manual ను 30ఏండ్ల క్రితంSVUORI.Libraryలో ఈ పరిష్కర్త చూచియున్నాడు. ప్రస్తుతం ఆ గ్రంథం అలభ్యమైనందున అందలి ఆంగ్ల వాక్యాలను ఇచ్చట ఉదాహరించటానికి వీలు కాలేదు -పరిష్కర్త.

మట్టి(చద్ది) కుండలలో స్వామివారికి నైవేద్యం సమర్పించడం **అనేది తిరుమల దేవాలయంలో తరతరాలనుండి** సంప్రదాయంగా వస్తూవున్న సముదాచారం. శ్రీవారికి నివేదితమైన ఆ ప్రసాదాన్ని గొప్పగొప్ప నిష్ఠాగరిష్ఠులతో పాటు యావన్మంది భక్తజనులూ కన్నులకద్దుకుని పరమపావనంగా స్వీకరిస్తారు. ఈ ప్రసాదం వెనుకటి జన్మల్లో కావించిన కర్మలవల్ల సంక్రమించిన ఆ యా కర్మ వాసనల్ని నివారించేటటువంటి ప్రభావం కలిగినదని వెంగమాంబ స్వామి నోట సొంపుగా పలికించింది!

ఇక,

"చెలరేఁగి పరుల బిడ్డలఁ బెండ్లి నీవాడి
పిఱికి దాసళ్ల కొప్పింపఁగలవు" (174ప.)

అని సత్యభామ పల్కిన అధిక్షేప వాక్యమూ, అందులకు సమాధానంగా శ్రీకృష్ణుడు పలికిన -

"పెండ్లాల దాసరివాండ్ల కొప్పించుట
కలియుగంబున లక్ష్మి వెలయుకొఱకె" (175ప.)

అనే ప్రత్యుత్తరమూ - ఈ రెండూ కలిసి ఆకాలంలో తిరుమల క్షేత్రంలో నెలకొనివుండిన విచిత్రమైన విశ్వాసయుక్తమైన ఒకానొక సాంఘికాచారాన్ని సూచిస్తూవున్నాయి.

అదేమంటే, భక్తజనుల్లో కొంతమంది తమ కూతుళ్లను వేంకటేశ్వరస్వామి వారికి పత్నులనుగా సమర్పిస్తూవుండేవారు. ఈ పత్నీస్వీకరణోత్సవం సంవత్సరంలో ఒకానొక నిర్దిష్ట సమయంలో జరిగేది. అలా సమర్పించబడిన కన్యకలకు స్వామివారి ఉత్సవమూర్తితో పద్ధతి ప్రకారం మంగళసూత్ర ధారణపూర్వకంగా పెండ్లితంతు జరిపించేవారు. అలాగ శ్రీవారిని పరిణయమాడిన ఆ వధువులకు "కలియుగ లక్ష్ములు" అనేపేరు ఆనాడు వ్యవహారంలో ఉండేది. ఈ కలియుగలక్ష్ములు శ్రీవారిగుడియందలి వేర్వేరు

సేవలు, ఉత్సవాలు మొదలైన కైంకర్యాల్లో పాలుపంచుకొంటూ వుండేవారని భావించవచ్చు.

ఆవిధంగా వేంకటేశ్వరుణ్ణి పెండ్లాడిన వధువులు ఆలయంలో కొంతకాలంపాటు శ్రీవారిసేవ కావించి, చరితార్థులై, అనంతరం విష్ణుభక్తి సంప్రదాయాన్ని అనుసరించి మనుగడ సాగిస్తూవుండే ఒకానొక వ్యక్తిని (దాసరిని) పతిగా చేపట్టి, తదనుగుణంగా సాంసారిక జీవితంలో స్థిరపడుతుండేవారనీ, అలా స్వామివారిని నిరంతరం సేవించే కలియుగ లక్ష్ముల కుటుంబాలు కొన్ని ఆ కాలంలో తిరుమల, తిరుపతులలో నెలకొనివుండేవనీ నిశ్చయంగా తెలియవస్తున్నది.

తరిగొండవెంగమాంబకు పూర్వం క్రీ.శ.17వ శతాబ్ది ఉత్తరార్థంలో విలసిల్లిన భక్తకవీశ్వరుడైన వరకవి నల్లగాల్వ సీతాపతి భక్త్యావేశంతో ఆశు వుగా వచించిన "వేంకటాచల విహార శతకం"లో కూడా రెండు చోట్ల ఈ "కలియుగలక్ష్మి"ప్రస్తావన ఉండటం ఈసందర్భంలో ఉదాహరింప దగివుంది.[11]

i) "వైఖానసుల యిండ్ల వాకిండ్ల (జక్కవ
చ్చి నమాజు పండువుల్ సేయునపుడు

తే.గీ. మలసి కలియుగ లక్షుమమ్మల కుచాగ్ర
శాటికాగ్రహముకుఁ జేయి సాచునపుడు
గాని కనిపించుకో నీతి గాదు నీకు
శత్రుసంహార! వేంకటాచల విహార!"

- వేంకటాచల విహార శతకము, 39 ప.

---

11చూ. 'శ్రీ వేంకటేశ్వర లఘుకృతులు, తి.తి.దే.ప్రచురణ(1948), పరిష్కర్త:శ్రీవేటూరిప్రభాకరశాస్త్రి

ii) "సీ. సంజీవరాయని సరిగజూడఁగ రాదు
ఉదరి సన్నిధివీథి నుమియరాదు
తఱి మట్లవారి గోపురము దాటఁగరాదు
బుగ్గలోపలఁ గాళ్లు పులుమరాదు
నెఱి జియ్యరు మఠాలు నిక్కి చూడఁగరాదు
కలియుగ లక్ష్మినిఁ గలయరాదు"
- వేంకటాచల విహార శతకము.94 ప.

పైన పేర్కొన్న ఆధారాలను బట్టి క్రీ.శ.17,18 శతాబ్దులలో తిరుమల క్షేత్రంలో ఈ "కలియుగలక్ష్మి సంప్రదాయం"కొనసాగుతుండేదని వెల్లడౌతున్నది.

సత్యాదేవి శ్రీ కృష్ణుణ్ణి ఉద్దేశించి ఏకరువు పెట్టిన ఆక్షేపణల్లో ఈ క్రింది పద్యంలోనివి మఱికొన్ని:

"సీ. తావిచ్చినట్టి స్వతంత్రుని నొకమూల
నుంచి, సర్వము నాక్రమించినావు,
మొనసి రూకల నీక మొగముఁ జూపనటంచుఁ
బరమభక్తులనైనఁ దఱుమఁగలవు,
అందఱితో మాట్లాడినటుండి, యె
వ్వరి మాటలకుఁ జిక్క కుఱుకఁ గలవు,
దొరనని యొకచోట మెఱసినట్లనె యుండి
దేశదేశంబులు దిరుగ ఁగలవు"
- విష్ణుపారిజాతము, 176 ప.

పై పద్యంలోని మొదటి పాదం ఆది వరాహస్వామి శ్రీనివాసునికి శేషాద్రిపై చోటొసగిన పౌరాణిక సత్యాన్ని ప్రకటిస్తూవుంది. రెండవ పాదం

స్వామివారు తగిన ద్రవ్యం చెల్లించకపోతే దర్శనమీయరనే వైనాన్ని తెల్లడిస్తున్నది. మూడవ పాదం వేంకటేశ్వరస్వామివారి మానవాతీతమైన శక్త్యాన్ని చాటుతూవుంది. అటుపై, నాలుగవ పాదం సకల దేశాల్లో విస్తరించిన అర్చామూర్తుల పరివ్యాప్తిని ప్రబోధిస్తూవుంది.

పై వాక్యాలకు శ్రీ స్వామివారు పలికిన ఈ క్రింది సీసపద్యంలోని సత్యసమ్మతాలయిన సమాధానాలు కూడా ఈ సందర్భంలో పరికింపదగివున్నాయి:

"తావిచ్చు దొరకు ముందఱ భోజనము బెట్టి
యవల నే భుజియింతు, నందుకేమి?
ఇలను దాసులకు మిక్కిలి భక్తిఁ బుట్టింప
నళికించి రక్షింతు, నందుకేమి?
శుద్ధాత్ములకు ఫలసూచనంబులు చేసి
యామాటలకు జిక్క నందుకేమి?
ఒకచోట దొరనవుచుండి నే నొకలీల
నవనిపై దృష్టింతు, నందుకేమి?
- విష్ణుపారిజాతము, 177 ప

కథానాయికయైన సత్యభామ శ్రీకృష్ణునిలో వేంకటేశ్వరుణ్ణి ఉపలక్షించి పలికిన వ్యాజోక్తులలో ఈ క్రింది పద్యం చిట్టచివరిది.

"సీ. దొరనని మురిసేవు, తొడరి విద్యావంతు
లెంత వేడిన ధనం బియ్యంలేవు,
పరమభక్తులనైనఁ, బరిచారకులచేత
తొప్పింతు, వన్నమిప్పింపలేవు,
తీర్థవాసులు పొంచి తిరిపమెత్తు దుగాండ్లు
గుత్తగొందువు, వారి కిత్తువనవు,
కలిగిన వారినే చేఘనముఁ జేతువుగాని
చెలఁగి దీనుల నీవు చేరనీవు,

తే.గీ పేదలేవరైన ధనికుల బిచ్చమెత్తఁ
బోఁదలంచినఁ బోనీక పోరి యదియు
నీవె గొందువు; శేషాద్రినిలయ! వైరి
వార గజసింహ! తరిగొండ నారసింహ!"

-విష్ణుపారిజాతము, 178 ప.

సత్యభామ ఆరోపించిన పై పద్యంలోని ఆరోపణల కన్నిటి: వెంగమాంబాకవయిత్రి స్వామివారిచే పలికించిన ఈ దిగువ పద్యంలో ప్రత్యుత్తరాలన్నీ శ్రీవేంకటేశ్వరుని అవతారతత్త్వాన్నీ మహత్త్వాన్నీ విశిష్టం ప్రతిపాదిస్తూవున్నాయి:

"సీ. అధిక విద్యావంతు లాశ్రయించిన మెచ్చి
నాశంబులేని ధనంబు నిత్తు,
భటులచే తొప్పించి పరమభక్తుల క్షాంతి
గని యన్న మిప్పించి గారవింతు,
పరుష పాపమును భూసురముఖాంతరముగా
దెప్పించి, యజ్ఞుల కొప్పగింతు.
ధనికుల హెచ్చించి ధనము లార్జింతుఁ, బే
దలను తగ్గించి సత్పదము నిత్తు,

తే.గీ. కలసి నాయుక్తి దెలియక కంటకంబు
లైన మాటలు నీ వంటివైన గాని,
ఇందుచేఁ గీర్తి నొందితి వింక నేమి?
చాలు నిఁకఁబోవె నీ ప్రేమ సత్యభామ!"

- విష్ణుపారిజాతము, 179 ప.

పైన ఉదాహరించిన 178వ పద్యంలోని "తీర్థవాసులు పొంచి తిరిపమెత్తు దుగాండ్లు గుత్త గొందువు, వారి కిత్తు ననవు" - అనే

ూడవపాదం ఇక్కడ ప్రత్యేకించి పరామర్శింపదగివుంది. స్వామి పుష్కరిణిలో పుణ్యస్నానాలు చేసే యాత్రికులకు సంకల్పాలు చెప్పి, ారినుండి దుగ్గాండ్లు (దుగ+కానులు - అనగా ఆ పేరుగల చిల్లర డబ్బులు) యాచించే తీర్థవాసుల (తిరుమలలో నివసించే పురోహితుల) యొక్క స్వల్పమైన రాబడిపైనకూడా నీవు గుత్త వసూలు చేస్తూవున్నావు. ౖదా! - అని సత్యభామ ఆక్షేపణ. అంటే ఆకాలంలో సైతం పురోహితుల ఆదాయంపై దేవాలయానికి ఒకరకమైన అదుపు(Control)ఉండేదని తెలియవస్తున్నది. అందుకు అనుగుణంగా స్వామి పల్కిన సమాధానం సైతం యుక్తియుక్తంగానే ఉండటం గమనింపదగ్గది..

పుష్కరిణిలో స్నానమాడే పరుష(యాత్రికుల)నుండి పురోహితులు 'దుగ్గాండ్లు' - అనే దక్షిణలను వసూలు చేయగా, ఆదక్షిణలతోపాటుగా వారలపాపాలుకూడాపురోహితులకుసంక్రమిస్తాయి. స్వామివారు(దేవస్థానం) ఆ డబ్బులను ఆ భూసురులనుండి వసూలుచేసి, అజ్ఞులకు(విషయం తెలియని అజ్ఞానులైన తురకలకు - అనగా ఆర్కాటునవాబుకు)కప్పంరూపేణ చెల్లించడంద్వారా పరుష జనుల పాపాలనుకూడా వాళ్లకు బదలాయిస్తూవుంటాడని యుక్తి యుక్తంగా ధ్వనింపజేసింది

సత్యభామ శ్రీకృష్ణునితో వాదించే ఈ సుదీర్ఘమైన ఘట్టంలో రెండుచోట్ల వెంగమాంబ తరిగొండ దేవాలయంలోని సత్య ప్రమాణాలను గూర్చి కూడా భంగ్యంతరం గా ధ్వనింపజేసింది:

1) "నీ పక్షపాతమే - నేఁడింత చేసె
తరిగొండ హరి! - యిట్లు ధర్మంబు దీర్చ
నెఱవాది వైతివి - నీకేమి కొదువ?
చాలు జాల్ పొ'మ్మని - సవతుల ఁజూచి

2) 'సతి! నీకు నే బారి - జాతవృక్షమును
హితవుతో దెచ్చి నే -నిచ్చెద ' ననుచు

బలికి బొంకితి, వింత - పాపంబు గలదె?
తరిగొండ నరహరే - ధర్మజ్ఞు డనెడి
నరుల నిశ్చయమెల్ల - నగు బాట్లు గాదె?
మేలాయెఁ జా'లని - మెండొడ్డి పలికి
యా లేమ తన చెలి - కప్పు డిట్లనియె"

-విష్ణుపారిజాతము,72 &74పుటలు

మొత్తంమీద తరిగొండ వెంగమాంబ ఇలవేల్పునూ, ఇష్టదైవాన్నీ కథానుగుణంగా నిందా వ్యాజంతో వ్యంగ్య ధోరణిలో నోరార కొనియాడటంలో క్రీ.శ.18వ శతాబ్ది మధ్యకాలంనాటి తిరుమలయందలి విశేషాలు కొన్ని ఈ కృతిలో కమనీయంగా ప్రతిబింబించివున్నాయి.

## పూర్వ ముద్రణ:

ఈ యక్షగానం తొలుత ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ (హైదరాబాదు) వారిచే 1965లో ప్రచురింపబడింది. సంపాదకురాలు శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు. అకాడమీవారి ప్రచురణకు ఆధారం తిరుపతి శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధన సంస్థ గ్రంథాలయంలో ఉన్న RNo.1056(paper)-అనే సంఖ్యగల విష్ణు పారిజాతం కాగితపు వ్రాతప్రతి. అకాడమీవారి ముద్రణలో అచ్చు తప్పులు, ఛందోవ్యత్యాసాలు మొదలయినవి అనేకంగా చోటు చేసికొనివున్నాయి. అయినా, అదివరకు అజ్ఞాతంగా, అముద్రితంగా నున్న ఈ అమూల్యకృతిని అఖిల భారత రచయిత్రుల సమావేశాల సందర్భాన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వెలువరించడం మిగుల ముదావహమైన సంగతి.

పైన పేర్కొన్న RNo.1056(paper)- అనే వ్రాతప్రతికి ఆధారమైన మూలప్రతి కీ.శే. మానవల్లి రామకృష్ణ కవిగారి వద్ద ఉండింది. ఆ మూలప్రతి లేఖకుడు గరిడిమిట్ట గంగాధరప్ప. ఈయన తరిగొండ

వెంగమాంబగారికి మునిమనుమడు. అనగా ఆమెకు దత్తుతో చేరిన దౌహిత్రుల సంతతికి చెందినవాడు. సదరు మూలప్రతి లేఖనాన్ని అతడు క్రీ.శ.1896వ సంవత్సరం జులై నెల 16వ తేదికి పూర్తిగావించియున్నాడు.[12]

తరువాతి కాలంలో మానవల్లి వారు సేకరించుకొని యుండిన సదరు మూలప్రతిని చూచియే మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో పనిచేస్తూవుండిన లేఖకులు క్రీ.శ.1935 - 1936 సంవత్సరాల్లో RNo.1056(paper)-అనే సంఖ్యగల వ్రాతప్రతిని తయారు చేసియున్నారు.[13] ఆ విధంగా మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయంలో ఉండిన ఈ వ్రాతప్రతి 1958 లో ఆంధ్రప్రభుత్వపు వాటాగా పంపబడిన పెక్కు వ్రాత ప్రతులతో పాటుగా వచ్చి శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధనసంస్థగ్రంథాలయం చేరింది.

ఈ వ్రాతప్రతియే - ఇంతకు ముందు తెలిపినట్లుగా - ఆం.ప్ర.సా. అకాడమీ వారి ప్రచురణకు ఆధారమయ్యింది.

## ప్రకృత పరిష్కరణ:

వెంగమాంబ మునిమనుమడైన గరిడిమిట్ట గంగాధరప్ప క్రీ.శ.1896లో వ్రాసినదీ, తరువాతి కాలంలో మానవల్లివారు సేకరించియుండినదీ అయిన విష్ణుపారిజాతపు మూలప్రతి - మానవల్లి వారి సౌజన్యంవల్ల - శ్రీవేటూరిప్రభాకరశాస్త్రిగారి సేకరణలోనికి వచ్చింది.

సహృదయులూ, శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారి ఆత్మజులూ అయిన వేటూరి ఆనందమూర్తిగారు సదరు మూలప్రతియొక్క నకలు (జిరాక్సు) ప్రతిని సుగృహీతనామధేయులూ, తి.తి.దే. శ్రీకార్యనిర్వహణాధికారీ అయిన శ్రీమాన్ కె.వి.రమణాచార్య ఐ.ఏ.ఎస్., గారికి పంపించారు. శ్రీకార్యనిర్వహణాధికారిగారికి ఆచార్య ఆనందమూర్తిగారు వ్రాసిన ఉత్తరమందలి ముఖ్యవాక్యాలు ఈ సందర్భంలో విశదీకరణనిమిత్తమై ఈ దిగువ ఉట్టంకింపబడినాయి:

---

12చూ ఈ గ్రంథం చివర184వ పుటలో గల వ్రాయసకాని వక్కణ.

13 చూ. A Triennial Catalogue of the Telugu Manuscripts in the G.O.M.Library, Madras, Vol.VI(1949), పుటలు 2261,226

# సమర్పణ

మాతృశ్రీ తరిగొండవెంగమాంబ గారి సాహిత్య సదస్సు - సమావేశములు ఇటీవల జూన్ 14,15 తేదీలలో హైదరాబాదులో ఘనముగా, విజయవంతముగా జరిగినవి. పాలువంచుకొని పరమానందము చెందితిని.

ఈ సందర్భమున **తి.తి.దేవస్థానముల** పాలకమండలి అధ్యక్షులను, శ్రీకార్యనిర్వహణాధికారులను, సంబంధిత అధికారులను హృదయపూర్వకముగా అభినందిస్తున్నాను. పరితోషసూచకముగా శ్రీ ప్రభాకర పరిశోధక మండలి హైదరాబాదువారి గ్రంథాలయమునగల వెంగమాంబగారి అపూర్వమైన వ్రాతప్రతినకలును (శ్రీ ప్రభాకరశాస్త్రిగారి సేకరము) వెంగమాంబ ప్రాజెక్టు వారికి కానుకగా అందజేస్తున్నాను. ఈ వ్రాతప్రతిలో వెంగమాంబగారి "పారిజాతాపహరణము" అనే నామాంతరము గల విష్ణుపారిజాతము, "స్వామి పెండ్లి" అనే నామాంతరం గల శ్రీ రమాపరిణయము అను రెండు కృతులున్నవి. స్వీకరింప ప్రార్థన.

విధేయుడు

వేటూరి ఆనందమూర్తి

26.06.07

Veturi Prabhakarasastri Memorial Trust,
Managing Trustee.

---

ఆచార్య ఆనందమూర్తిగారు పంపిన సదరు మూలప్రతి నకలు(జిరాక్సుకాపీ)కార్యనిర్వహణాధికారివారికార్యాలయంనుండి "శ్వేత" సంచాలకులూ, తరిగొండవెంగమాంబ ప్రాజెక్టు డైరెక్టరూ అయిన సహృదయులు శ్రీ"భూమన్" గారికి అందజేయబడింది. ప్రకృత పరిష్కరణకార్యంలో సదరు జిరాక్సు ప్రతి చక్కగా ఉపయోగపడింది. ఈ మూలప్రతి ఆధారంతో, పూర్వ ముద్రణలో దొరలిన పలురీతుల దొసగులు ప్రకృష్టంగా చక్కదిద్దబడినాయి.

రమణీయ దేశిరచనయైన ఈ యక్షగాన స్వరూపంలో ప్రధానమైనది గేయభాగం. ఇందులో దరువులు, ఏలలు మొదలైన పలురీతుల పాటలు చాలవరకు దీర్ఘాక్షరాలతో తీగెసాగిన తీరున వ్రాయబడివున్నాయి. అటువంటి దీర్ఘాలను అర్థావగతికి అనుకూలంగా, - ఆ గేయపు నడకకు అనుగుణంగానే - సవరించటం జరిగింది. మొత్తంమీద ఇలాంటి స్వల్ప సవరణలు ఈ కవయిత్రి ప్రయోగించిన భాషాస్వరూపంయొక్క పరిధిని అతిక్రమించకుండానే కడు మెలకువతో కావింపబడినాయి.

గేయభాగం కాక, తక్కిన దానిలో ఎక్కువగా ద్విపద, అచ్చుటచ్చుట కందం, తేటగీతి, ఆటవెలది, సీసం, ఉత్పలమాల, చూర్ణిక మొదలైనవి నెలకొల్పబడివున్నాయి. ఒకే లేఖినినుండి వెలువడివున్నా, పద్యాల్లోని భాష గేయాల్లోని భాషకన్నా అధికంగా యతి, గణ,ప్రాసాది ఛందోనియమాలకు ఒదిగివుండటంవల్ల, ఆ రెండిటి భాషా స్వరూపంలో ఇంచుక తేడా గోచరించటం స్వాభావికమే. ఈ సత్యాన్ని దృష్టిలో ఉంచుకొనియే ఇందులో పరిష్కరణకార్యం కొనసాగింపబడింది.

ముఖ్యంగా ఇందలి భాష పాత్రోచితమైన పలురకాల వైవిధ్యాలతో విలసిల్లుతూవున్నందువల్ల, దాని స్వరూపంయొక్క అవగాహనకు ఆటంకం కలుగని తీరున ఈ కృతి పరిష్కరణ జాగరూకతతో నిర్వహింపబడింది.

అడుగడుగున అనువుగా అమర్చబడిన అనేకరకాల విరామ చిహ్నాలతో, ఆ యా కథాఘట్టాలను నిర్దేశించే ఉపశీర్షికల (Subheadings) తో, సంభాషణలు సాగుతూవున్న సన్నివేశాల్లో - స్పష్టతకై - చేర్చిన ఆయా పాత్రల నామ నిర్దేశాలతో, వలసినచోట అధోజ్ఞాపికల (foot notes)తో ఈ యక్షగానకృతి మొత్తంమీద ఈ కవయిత్రీ హృదయానికి సన్నిహితమైన సహజ సుందరాకృతిని సంతరించుకొనేట్లుగా దిద్ది తీర్చబడిందని విన్నపము.

# కృతజ్ఞతాంజలి

మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ వాఙ్మయ పరిష్కరణ ప్రాజెక్టును నెలకొల్పటంలోనూ, దానికి శాశ్వత స్థితిని ప్రసాదించటంలోనూ ఆదినుండీ మూలవిరాట్టుగా విలసిల్లుతూవున్న సహృదయ వతంసులు, సుగృహీత నామధేయులు, పరిపాలన దక్షులు తిరుమల తిరుపతి దేవస్థాన పాలకమండలి అధ్యక్షవర్యులు శ్రీభూమన కరుణాకరరెడ్డి మహోదయులకు, తిరుమల తిరుపతి దేవస్థాన పాలకమండలి సభ్యులెల్లరకు నా అనేక ధన్యవాదములు.

శ్రీవారి ప్రతినిధులు స్మితపూర్వభాషులు, మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ వాఙ్మయ పరిష్కరణ ప్రాజెక్టుకు చిరస్థాయి యయిన అభ్యుదయాన్నీ, సమగ్రతనూ ప్రసాదిస్తూవున్న సహృదయతంసులు తి.తి.దే. శ్రీకార్యనిర్వహణాధికారివర్యులు, పరిపాలనాదక్షులు, సుగృహీత నామధేయులు శ్రీ కె.వి. రమణాచారి, ఐ.ఏ.యస్., మహోదయులకు నా అనేక ధన్యవాదములు.

తి.తి.దే. సంయుక్త కార్యనిర్వహణాధికారి, సౌజన్యహృదయులు శ్రీ ఎ.వి. ధర్మారెడ్డి గారికి నా అనేక ధన్యవాదములు.

మాతృశ్రీ తరిగొండ వెంగమాంబ వాఙ్మయ పరిష్కరణ ప్రాజెక్టుయొక్క సర్వతోముఖమైన వికాసానికి తమ వ్యక్తిత్వ లక్షణమైన ఉద్యమస్ఫూర్తిని సమన్వయించి ఉత్సాహ, ప్రభు, మంత్రశక్తి పూరితమైన దక్షతతో ముందుకు నడిపిస్తూ వున్న తి.తి.దే. "శ్వేత" సంచాలకులు, "భూమన్"గా సుగృహీతనామధేయులైన శ్రీ భూమన్ సుబ్రహ్మణ్య రెడ్డి మహోదయులకు నా అనేక హృదయపూర్వక ధన్యవాదములు.

తి.తి.దే. పౌరసంబంధాధికారివర్యులు, సరసహృదయులు శ్రీయుతులు కె. రామ్‌పుల్లారెడ్డిగారికి నా అనేక కృతజ్ఞతాభివాదములు.

"విష్ణుపారిజాత"మూల ప్రతియొక్క జిరాక్స్ కాపీని ఈ వాఙ్మయప్రాజెక్టుకు బహూకరించిన సుగృహీతనామధేయులు ఆచార్య వేటూరి ఆనందమూర్తిగారికి అనేక ధన్యవాదములు.

"శ్వేత" కేంద్రగ్రంథాలయం లైబ్రేరియన్ సోదరీమణి శ్రీమతి ఎన్. లీలావతి గారికి, వారి సహాయోద్యోగులయిన మిత్రబృందమందరికీ- "శ్వేత"సంస్థ కార్యాలయం సూపరిండెండెంట్ శ్రీ వి.దామోదరం గారికి, శ్రీదీనదయాళ్(యు.డి.సి.)గారికి వారి సహోద్యోగిబృందమందరికీ, ముఖ్యముగా సహృదయమిత్రుడు శ్రీ జి. సురేశ్ కుమార్ (యు.డి.సి.) గారికి నా అనేక కృతజ్ఞతాభివందనములు.

శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యపరిశోధనసంస్థ డైరెక్టర్ ఆచార్య వి.వెంకటరమణారెడ్డిగారికి, వారి సహోద్యోగులకు అనేక కృతజ్ఞతాభినందనములు.

ఈ పుస్తకమును ముచ్చటగా ముద్రించిన తిరుమల తిరుపతి దేవస్థాన ముద్రణాలయ అధికారులకు నా కృతజ్ఞతాభివందనములు.

మాతృశ్రీ తరిగొండ వెంగమాంబా మహాకవయిత్రియొక్క ఆరాధ్యదైవమయిన "శ్రీ తరిగొండ శేషకుధరాధక్షు"నకు నా భక్తి పూర్వక ప్రసూనాంజలి.

కె. జె. కృష్ణమూర్తి

# విషయ సూచిక

# విష్ణుపారిజాతము

# యక్షగానము

క. వర శేషాచలపతి యగు
తరిగొండాధిపుని పరమ ధరణిని వెలయన్
సురపారిజాత తరుకథ
నరుదుగ నింజేటి వెంగమాంబ రచించెన్. 1

వ. తత్కథోపక్ర మప్రకారంబు మతిన్నెట్లనిన. 2

## *ఇష్టదేవతా స్తుతి*

### *దరువు. నాటరాగం*

శ్రీరుక్మిణీలోల! - శృంగార సుఖలీల!
కారుణ్యరసమూల! - కనకరుచిచేలా!
సూరిజననుత శీల! - సురుచిర గుణజాల!
ఘోరదనుజ విఫాల! - గోపాల బాలా! ॥ జయ జయా ॥ ౧

పరిపూర్ణ విజ్ఞాన! - భావ దివ్యధ్యాన!
పరవశాత్మాధీన! - భక్త సంతానా!
సుర మునీంద్ర నిధాన! - శోభితాహి శయాన!
పరమాంబర స్థాన! - బ్రహ్మాభిధానా! ॥ జయ జయా ॥ ౨

వరద! తరిగొండపుర - వాస! శేషగిరీశ!
వరనీల సంకాశ! - వనధిజాధీశా!
సరసాత్మ! జగదీశ! - సాధుహృదయ నివేశ!
ద్విరదరిపు మదనాశ! - దేవదేవేశా! ॥ జయ జయా ॥ 3

### *దరువు. మధ్యమావతి రాగం - ఆది తాళం*

నందాత్మజ! తే- నమో నమో, సా
నంద హృదయ! తే- నమో నమో ॥ పల్లవి ॥

నారాయణ! పూర్ణ సుధాకర వద
- నా! మాధవ! తే నమో నమో
నారద, సనక, సనందననుత పద
- నళినయుగళ! తే నమో నమో ॥ నందాత్మజ! ॥ ౧

సమరవిభీషణ! సజ్జన పోషణ!
- విమల చరిత! తే నమో నమో
కమనీయాంగ! వికారవిరహిత! వి
- నమదుద్ధర! తే నమో నమో
॥ నందాత్మజ! ॥ ౨

వరతరిగొండ నివాస! పరాత్పర!
- నరమృగవర! తే నమో నమో
గురుతర పన్నగ గిరి నాయక! బహు
- నరపూజిత! తే నమో నమో
॥ నందాత్మజ ॥ 3

ద్విపద. అని యిష్టదేవత - నమర నుతించి,
గొనకొని పరమ స - ద్గురునకు మ్రొక్కి,

శ్రీ విఘ్ననాథుని - క్షేత్ర పాలకుని,
శ్రీవాణిని, హయ-గ్రీవునిఁ దలఁచి,

యటమీఁదఁ దరిగొండ - హరి నాత్మయందు
దిటముగా నుంచి భ- క్తినిఁ బూజ చేసి,

## *సమర్పణము*

శ్రీశ్రీనివాసుఁడై - శేషాద్రి శిఖర
మాశ్రయించిన జగ - దంతరాత్మునకు

శరణాగతత్రాణ - సంరంభుఁడగుచు
ధరణిపై వెలయు సుం-దర విగ్రహునకు

అలమేలుమంగ చి-త్తాబ్జంబునందు
నిలిచి, సత్కృప నేలు - నిర్మలాత్మునకు

నాదినారాయణుఁ - డైన దేవునకు
వేదవేద్యునకు శ్రీ - వేంకటేంద్రునకు

జనులెన్నఁదగు పారి - జాతాపహరణ
మనియెడు సత్కృతి - నతి ముదంబెసఁగ

శృంగారముగ విర-చించి, యింజేటి
వెంగమాంబిక మోక్ష - విభవంబుకొఱకుఁ

బరమభక్తిని సమ-ర్పణ మొప్పఁజేసెఁ
గరమొప్పఁ దత్కథా - క్రమమెట్ల ననిన..

## * కథాక్రమము *

వినరయ్య! కవులార! -విద్వాంసులార!
ఘనయోగిచంద్రాగ్ర - గణ్యుండనంగ

సురుచిరాత్మకుఁడైన - శుకయోగి దెలుపఁ
జిరభక్తితోఁబరీ - క్షిన్నరేంద్రుండు

సలలీత విమల సు - స్వాంతుఁడై చెలఁగి
యలఘు భాగవతంబు - నాలింపుచుండి

'అల పారిజాతాప - హరణ వృత్తాంత
మెలమి సాంగంబుగా - వెతిఁగింపు' మనిన

శుకయోగి యభిమన్యు - సుతుని వీక్షించి
యకలంక కరుణ ని-ట్లని చెప్పఁదొడఁగె:

'విను రాజచంద్ర! యీ - విధమెల్లఁ దెలియ,
ననిమిషమునిచంద్రుఁ - డమరావతికినిఁ

జని, పారిజాతపు-ష్పముఁ గొని తెచ్చి
కనకాంబరునకు మేల్ - కాన్కగా నిచ్చెఁ,

బనిఁబూని కృష్ణుఁడా - పారిజాతమును
నెనరు మీ అంగ రుక్మి-ణీదేవి కొసఁగె;

నందుకుఁ బద్మాక్షు - నా సత్యభామ
పొందక కోపించి - పొమ్మన్న, శౌరి

'సతి! నీకు నేఁ బారి-జాతవృక్షమును
హితవుమీఱఁగఁదెచ్చి - యిచ్చెద' ననుచు

సమ్మతపఱచి యా - జలజాక్షి నెనసి,
నెమ్మది నందుండె - నీరజాక్షుండు.

## *దరువు. త్రిపుట తాళం*

మేలిమిగఁ బద్మోదరుని రతి-కేళిఁదేల్చి, యా హరి
జాలములలోఁ జిక్కియుండెను - సత్యభామా ౧

చెలఁగి సురభూజమ్ముఁ దెమ్మని - చెప్పమఱచీ, కృష్ణుని
సలలితోక్తుల నలరియుండెను - సత్యభామా ౨

పరఁగ శ్రీతరిగొండధామునిఁ - బన్నగాద్రీ నిలయుని
సరసములకేఁ జొక్కియుండెను - సత్యభామా 3

## *శ్రీకృష్ణుఁడు శృంగారవనమునకు విచ్చేయుట*
## సావేరి రాగము

ద్విపద. ఈరీతిఁ బద్మాక్షు - నెనసి యా లేమ
భూరిరతి శ్రమం-బునఁ జొక్కి, నిదురఁ

జెందియుండఁగ, లేపి-చెప్పక శౌరి
యందుండ, కవల మ-హా వైభవమున

బంగరు శాలువ - పార్శ్వ భాగములఁ
జుంగులు జాఱఁ, బ్ర-సూనమాలికలు,

బహురుచిర మయూర - బర్హిదామములు
మహనీయ నవరత్న - మకుటంబు నొరసి

పొంకంబుగా భుజం-బులపై నటింపఁ,
బంకజ, తులసి కో, - త్పల హారములును

పరిమళ గంధలే - పనముచేఁ జాల
సిరి గుల్కు బొజ్జపైఁ - జిందులు ద్రొక్కఁ,

గంకణ కుండల - గ్రైవేయ హార
కింకిణీ మేఖలా - కేయూర కటక

కౌస్తుభ వనమాలి - కా ముద్రికలును
సిస్తై ప్రకాశింపఁ, - జిన్ని పాదముల

గజ్జె లందెలు ఘల్లు - ఘల్లని మ్రోయ,
ముజ్జగంబులఁ జాల - మోహింపఁజేయు

పరిపూర్ణ చంద్రబిం - బ నిభాననమున
సరసమై దరహాస - చంద్రిక వెలుఁగ

విమల సద్భ్రూల తా - విక్షేపణములు
రమణీమణుల కను - రాగంబు నెరప,

దిద్దిన కస్తూరి - తిలకంబు నుదుట
ముద్దులు గులుకఁగా, - మురళి చేపట్టి

బహురాగ సరణులఁ - బలికించుకొనుచు,
రహిమీఱ శృంగార - రసఖని యగుచు

నలువొప్పఁ దరిగొండ - నరసింహుఁడనఁగ
విలసిల్లు తిరుమల - వేంకటేశ్వరుఁడు

వలనొప్ప శృంగార - వనములోఁ జేరి,
అలరి తద్వనపాలుఁ - డైనటువంటి

వికట భాషణుని నా - వేళ వీక్షించి
యకలంక కరుణ ని - ట్లనియె వేడుకను:

## * వనపాలకునితో వినోదోక్తులు *
## దరువు, ఆదితాళం

శ్రీకృ: వికటభాషణా! ఓరి - వికటభాషణా! ॥ పల్లవి ॥

ముదము మీఱ శ్రీరుక్మిణి - మొదలైన పరిపూర్ణ చంద్ర
వదనలఁ బిలువరా! యిందు - వారితో నే విహరించేను
॥ వికటభాషణా! ॥ ౧

'వనజనయనుఁడుశృంగార-వనములోనిలచియున్నాఁడు
పెనుపొంద మిమ్మందఱినిఁ - బిలుచుకొరమ్మన్నాఁడనరా!
॥ వికటభాషణా! ॥ ౨

'వరశేషాద్రి నిలయుఁడైన తరిగొండ - నరహరి మిమ్ముఁ
గరుణించి రమ్మన్నాఁ'డని - గ్రక్కునఁ దోడ్కొని రారా!
॥ వికటభాషణా! ॥ 3

వనపాలుఁడు:

క. అన విని యా వనపాలుఁడు
వనజాక్షునిఁ జూచి 'వికటవాక్యంబుల నే
నిను నవ్వింపం బలికెద
కనకాంబర! తప్పు నొప్పుగాఁ జూడకయా!' 3

శ్రీకృ: క. అనఁగా హరి వనపాలునిఁ
గనుఁగొని 'నా కిది వినోదకాలము గనుకన్
గొనకొని నీ వికటోక్తుల
ననురాగముగాని విందు' నన, వాఁడనియెన్. 4

వనపా: తే.గీ. దండదాసరి యగువాని తప్పులన్ని
దండమునఁ దీఱుఁ గనుక, ముందరనె నీకు
దండములను సమర్పించి, తప్పు లొప్పు
లైన వికటోక్తు లడిగెద నాదరింపు. 5

శ్రీకృ: తే.గీ. అడుగఁదగు మాట లిపుడు నన్నడుగరోరి!
వనపా: స్వామి! నీవెవ్వ? రది తెల్పు సమ్మతముగ,
శ్రీకృ: ఏను కృష్ణుండ, నన్ను నీ వెఱుఁగవటర?
వనపా: ఇపుడు కృష్ణుండవగు పూర్వ మెవఁడవయ్య? 6

## * శ్రీకృష్ణుని పూర్వ వృత్తాంతము *

శ్రీకృ: ద్విపద. వినరోరి! నా పూర్వ - వృత్తాంతమెల్ల
ననువొందఁ జెప్పెద - నాది కాలమున

అగణితంబగు సచ్చి - దానంద పూర్ణ
మగు నిర్గుణ బ్రహ్మ - మగుచు నేనుంటి;

నాయం దనాదియై - నలువొప్పుచున్న
మాయతో నెనసి యా - మహదాదులైన

భూతజాలంబులఁ - బుట్టింపఁదలఁచి
ఖ్యాతిగా నా నాభి - కమలంబునందు

మున్నుగాఁ ఘన చతు - ర్ముఖునిఁగల్పించి,
పన్నుగా నతనిచే - బహువిధ సృష్టిఁ

జేయించి, యటఁ జిక్కి - చిక్కక లోక
నాయకత్వంబున - నటియింపుచుందు;

దుష్టరాక్షసులను - దునుమాడి పరమ
శిష్టులనెల్ల ర - క్షింప భూస్థలిని

అరుదుగా యుగయుగం - బందుజన్మింతు;
నిరవుగా వినరోరి! - యింతకు మున్ను

గురుతర పాఠీన, - కూర్మ, వరాహ,
నరమృగేశ్వర, వామ - న, కుఠారపాణి,

రఘురామ, బలరామ - రమ్య రూపముల
నఘముక్తులైన యిం - ద్రాదులు పొగడ

ధరియించి, యట వినో - దంబుగా నేఁడు
సరవిఁ గృష్ణుండన - జనియించినాఁడ,

ఇన్ని చెప్పఁ గనేల? - నిపుడు కృష్ణుండను.
'మున్ను నీ వెవఁ?'డని - ముచ్చట మీఱ

నలఘుమూలముఁ బట్టి - యడిగితి వీవు
నలువొప్పఁ బూర్వంబు - నారాయణుఁడను,

చెలువొంద నదిగాక - శేషాద్రియందు
విలసిల్లుచున్న శ్రీ - వేంకటేంద్రుఁడను;

ధరణిలో నిప్పుడు - తరిగొండపురిని
స్థిరమైన శ్రీనార - సింహదేవుఁడను.

వనపా: తే.గీ. అనిన వాఁడిట్టులనియె 'నో యంబుజాక్ష!
మొనసి నీ విన్ని యవతారములు ధరించి
యేమి పని చేసితివి? తెల్పు మిప్పు' డనిన
నిందిరాధీశ్వరుఁడు నవ్వి యిట్టులనియె. 7

శ్రీకృ: తే.గీ. అమర వినరోరి! సోమకప్రముఖులైన
దానవులఁ ద్రుంచి, వేద శాస్త్రముల ధరను
నిలిపి, బ్రహ్మాదులగు భక్త నికరములను
పాలనముఁ జేసినాఁడరా! లాలనమున. 8

## దరువు. ఆదితాళం

వనపా: ఎందుండి వచ్చితి విటకు కృష్ణదేవా? నీ వా
చందాము దెలుపవయ్య! కృష్ణదేవా! ౧

శ్రీకృ: సత్యభామ నగరినుండి వికటభాషణా! యిటకు
చరియింప వచ్చినారా! వికటభాషణా! ౨

వనపా: సత్యభామ యెటువంటిది? కృష్ణదేవా! నీవా
చక్కఁదనముఁ దెలుపవయ్య! కృష్ణదేవా! 3

శ్రీకృ: ఆ భామ చక్కఁదనము వికటభాషణా!
చెప్పేనంటె అలవిగాదు వికట భాషణా! ౪

వనపా: తరిగొండేశ! వేంకటేశ! కృష్ణదేవా! చెప్పఁ
దరమైనంత చెప్పవయ్య! కృష్ణదేవా! ౫

## * సత్యభామిని చక్కఁదనము *

శ్రీకృ: తే.గీ. నిక్కమగు సత్యభామిని చక్కఁదనము
చెప్పలేఁ డింతయని యాదిశేషుఁడైన,
నేను తరిగొండ నరహరిన్ గానఁ దెలిసి
చెప్పెదను కొంత కొంత సంక్షేపముగను. 9

తే.గీ. మున్ను తరిగొండ హరినగు నన్నుఁ గూర్చి
చిరతపముఁ జేసినట్టి విశేషమునను
కోటి కారుమెఱుంగులు గూడియున్న
చందమున వెల్గుచుండురా! సత్యభామ. 10

వనపా:తే.గీ. 'తామరసనేత్ర! మీ సత్యభామ చక్కఁ
దనము వింటిని, ఇంక విదర్భ రాజ
తనయ మొదలైన సతుల సౌందర్యములను
తెలుపు'మన్నను హరి నవ్వి పలికె నిట్లు: 11

శ్రీకృ: ద్విపద. తప్పక వారి సౌం-దర్యముల్ తెలిసి
చెప్ప శక్యంబౌనె - శేషాహికైన?

చక్కఁదనములందు - సరసంబులందు
నొక్క రొక్కరికన్న - నుత్తమోత్తములు

గాన, నే నట్టి చ-క్కఁ దనంబు లెన్న
లేను; నీ విచటి కా - లేమలనెల్ల

వేవేగఁ దోడ్తేర! - వేడుకమీఱ
'వావిరి నేఁ బిల్వ - వత్తురో, రారొ?'

అని సంశయింపకు, - మటకు నీ వరిగి,
కనకాంగుల కునమ-స్కారముల్ చేసి,

రూఢిగా 'మీ కుమా రుఁ డ' నంచుఁ బలికి,
'గూఢంబుగా వచ్చి - గోపాలుఁ డిపుడు

నా వనమ్మున నిల్చి - నను మిమ్ముఁ బిలువ
నీ వేళఁ బంపినాఁ - డిది నిక్క'మనిన

వనితలు ననుఁ జూచు - వాంఛతో నిటకుఁ
దనర నీకన్నముం - దరనె వచ్చెదరు;

శంకింపవలవదు, - సకలలోకముల
వేంకటేశ్వరుఁ డన - విఖ్యాతిఁ బొంది

భూమిలోఁ దరిగొండ - పురధాముఁ డైన
నామాట నిజమంచు - నమ్మిపోరోరి!

క. పొమ్మనఁ గాఁ జని వాఁ డపు
డమ్మగువలఁ జేరి మ్రొక్కి, హరి దెలిపిన వా
క్యమ్ములు వినిపింపఁగ, వా
రమ్మాధవుఁ జేరుటకు మహాత్వరితముగాన్. 12

## * రుక్మిణ్యాది వధూమణుల రాక *

ద్విపద. అందఱు పయనంబు - లయి గుంపుగూడి
యందంబులగు భూష - ణాంబరావళులు,

చందన, సుమదామ - చయములు దాల్చి,
యందెల మ్రోఁత మి - న్నంది ఘోషింప

నరుదుగాఁ దరిగొండ - హరియైన శేష
గిరివాసుఁడైన శ్రీ-కృష్ణుఁడున్నట్టి

వనమున కత్యంత - వైభవంబెసఁగ
వనితాలలామలు - వచ్చి, యచ్చోట

నందనందనునిఁ గా - నక భయంబంది,
యందున్న చెలులతో - నప్పు డిట్లనిరి.

## *దరువు. ఆహిరి రాగం – ఆది తాళం*

**రుక్మిణ్యాది**
**వధూమణులు:** మనలఁ బిలువనంపిన శ్రీ-మాధవు,డెందున్నాఁడో?
ఓ కొమ్మలారా!నేఁడీ
వనపాలుని మాట నమ్మి - వచ్చితి మింకెట్లనే?
ఓ కొమ్మలారా! ౧

ఇవ్వనములో ఘనుఁడు-నవ్వులాటకు దాగెనేమో
ఓ కొమ్మలారా! మల్లె
పువ్వుల పొదరిండ్లకుఁ - బోయి లెస్సాశోధింపరే!
ఓ కొమ్మలారా! ౨

ఉరగశైలాధీశుఁడైనా - తరిగొండవాసునిఁదేరే!
ఓ కొమ్మలారా! మీకు
సరిలేని యడ్డిగెల బణ్ణా - సరము లిచ్చీమన్నించేమే!
ఓ కొమ్మలారా! 3

క. అని వారు చెలులఁ బేర్కొని
వనమాలినిఁ జూపుఁడనెడు వాక్యము లెల్లన్
విని వచ్చి, సరకుసేయక
వనపాలుని భార్య పలికె వక్రోక్తులుగాన్. 13

## * వనపాలిక –వక్రభాషిణి *

### *దరువు. అటతాళం*

**వనపాలిక:** ఎవ్వరే మాతోట - కిటు వచ్చినారూ? ॥ పల్లవి ॥
పువ్వుల పొదలన్ని - పుణుకుచున్నారూ ॥ఉపపల్లవి ॥

**విడిబడి యిందందు - విహరిస్తుండారూ**
**తొడిబడి చెట్లన్ని - తొక్కుచున్నారూ** ॥ ఎవ్వరే ॥ ౧

గుట్టుగా పండ్లన్ని - గోయుచున్నారూ
దిట్టలై బిరబిర - తింటూవున్నారూ ॥ ఎవ్వరే ॥ ౨

**తరిగొండహరి నిందు - తలపుఁచున్నారూ**
**మతిమతీ గలిబిలి - మాటలాడేరూ** ॥ ఎవ్వరే ॥ 3

వ. అనిన విని వారందఱు దానితో నిట్లనుచున్నారు:

**రుక్మిణ్యాదులు:** అవునే! అమ్మయ్యా!

**వనపాలిక :** ఏమే? వో దుమ్మయ్యా!

**రుక్మిణీదేవి :** నీ వెవరే అక్కయ్యా?

**వనపాలిక :** నన్ను వక్రభాషిణియందురే గిక్కయ్యా!

**రుక్మిణీదేవి :** ఇక్కడికి యేల వచ్చినావే భామా?

**వనపాలిక :** నాతోటంతా మీరు తొక్కితోమ్మాడుచున్నారుగనుక,
మీతో కొట్లాటకు వచ్చినానే! దోమా!

**రుక్మిణీదేవి:** నీవు కొట్లాటకు వచ్చుటే గాని,మేము నీతో
కొట్లాడే వారము గామే! కొమ్మా!

**వనపాలిక:** యింత గంభీరముగాశాంతవచనములు
చెప్పుచుండే పెద్దమనిషివి నీ వెవరు? నీ
తల్లిదండ్రి, తోడఁబుట్టువులు, నీ
మగఁ డెవరు? నీ పేరేమి? విశదంబుగాఁదెలుపుము.

వ.అనిన దానితో రుక్మిణీదేవి యిట్లనుచున్నది: 14

## *రుక్మిణీదేవి వృత్తాంతము*

రుక్మిణీదేవి:

ద్విపద. అమర నా వృత్తాంత -మంతయువినుము
రమణ భీష్మక మహా - రాజు మా తండ్రి,

వాసికెక్కిన పతి - వ్రత యని ధరను
శాసింపఁదఁగు గుణ - శాలిని తల్లి,

రుక్మి, రుక్మధరుండు, - రుక్మ బాహుండు,
రుక్మకేశుండును, - రుక్మనేత్రుఁడును

అనెడువా రయ్యేవు - రన్నలు నాకు,
జననుత వేంకటా - చలవాసుఁడనఁగఁ

బొలుపొందు తరిగొండ - పురనాయకుండు
సులలిత వసుదేవ - సుతుఁడు కృష్ణుండు

పరమాత్ముఁడైన నా - ప్రాణవల్లభుఁడు;
తెలుఁ గొప్ప రుక్మిణీ - దేవి నా పేరు.

వ. అనిన విని నవ్వి చెలి యిట్లనుచున్నది: 15

వనపాలిక:

తే.గీ. జలజలోచన! వేంకటేశ్వరుని పేరు,
చెలఁగి తరిగొండ హరిపేరుఁ జెప్పి,యవల
విభుఁడు శ్రీకృష్ణుఁడంటివి వింతగాను
నెలత! యెవరమ్మ ముగురిలో నీవిభుండు? 16

### దరువు. అట తాళం

రుక్మిణి: చాల గుంభనగాను - సందేహింతువేమె వక్రభాషిణీ? యిట్లా
గేలి చేసినఁబలి-కేదానఁగాను నే వక్ర భాషిణీ! ౧

ఇంతి! నా పతికి న - నంతనామములే వక్ర భాషిణీ! నీకు
వింతైన దెన్నడు - వినని దోషముచేత వక్రభాషిణీ! ౨

ఉరగాద్రిపతియన్నఁ-దరిగొండాధిపుఁడన్నవక్రభాషిణీ!ఁరెండు
నఱమర లేదె కృ - ష్ణాభిధానమునకు వక్ర భాషిణీ! 3

వ. అనిన విని సమ్మతించి, జాంబవతినిఁ జూచి 'నీ తల్లిదండ్రు
ఎవ్వరు? నీ మగండెవ్వడు? నీ పేరేమి?' యని యడిగిన వక్ర భాషిణీతో
జాంబవతి యిట్లనుచున్నది: 17

## *జాంబవతి వృత్తాంతము*

**జాంబవతి:**

ద్విపద. భామిని! మా తండ్రి - బ్రహ్మాంశజుండు
రామ కార్య ధు - రంధర ప్రభావుండు

పటుభక్తి యుక్తుండు - భల్లూక విభుఁడు
చటుల బలాఢ్యుండు - జాంబవంతుండు,

కరమొప్ప మా తల్లి - ఘనపుష్పగంధి,
తరిగొండ హరియైన - దండశూక్రాద్రి

నిలయుండు కృష్ణుండు - నెలఁత! నా విభుఁడు,
వలనొప్ప శ్రీజాంబ - వతి యంద్రు నన్ను.

**నపాలిక:అ.వె.** తల్లి పుష్పగంధి, తండ్రి భల్లూకమే
ఈడు జోడు చూడ వేడుకయ్యెఁ
గాని, యెలుఁగుగొడ్డు గన్న కూతురిని ని
న్నెట్లు తెచ్చెఁ గృష్ణుఁ డిందువదన? 18

**జాంబవతి:** సీ. వినుమది సత్యభామిని పినతండ్రి ప్ర
సేనుఁడన్ వాఁడు నా చిన్ననాఁడు

వరశమంతకమణి ధరియించి మే మున్న
యడవికి రాఁగ, సింహంబు వానిఁ
జంపి యమ్మణిఁగొని చనుత్రోవ, నెడతాఁకి
జాంబవంతుఁడు మృగేశ్వరునిఁద్రుంచి,
యురుమణిఁ దెచ్చి నే నూఁగు తోట్లకుఁ గట్టె;
నా మణికై కృష్ణుఁడటకు వచ్చి

తే.గీ. ప్రబలి మాతండ్రితోఁ బోరి బలమణంచె.
నంత శ్రీహరియని జాంబవంతుం డెఱిఁగి
వెలయు మణితోడ నన్నిచ్చి వీడుకొల్ప,
మెచ్చి తరిగొండ హరి నాఁడు దెచ్చె నన్ను. 19

వ. అనిన విని సంతసించి, వక్రభాషిణి కాళిందింజూచి 'నీవెవరు? నీ తల్లిదండ్రు లెవరు? నీ మగఁడెవరు? నీ పేరేమి?' యనినఁ,గాళింది దానితో నిట్లను చున్నది: 20

## *కాళింది వృత్తాంతము*

కాళింది: ద్విపద. వెలఁదిరో వినవె! నా - వృత్తాంతమెల్ల
నలిన బాంధవుఁ డీల - న్ననుఁ గన్న తండ్రి,

అతివరో! నాకు ఛా - యాదేవి తల్లి,
అతులిత తరిగొండ - హరియైన శేష

గిరివాసుఁడగు బాల - కృష్ణుండు విభుఁడు
కరమొప్ప నా పేరు - కాళింది యండ్రు.

వ. అనిన విని సంతసించి, 'నీవు సూర్యకన్యకవైనప్పుడునిన్నుఁ గృష్ణుఁ డెట్లు పెండ్లియాడె?'ననిన, దానితో గాళింది మఱి న్నిట్లను చున్నది.: 21

కాళింది: సీ. నా చిన్ననాఁడు నే నారాయణునిఁ బెండ్లి
యాడఁగోరిన, భానుఁడవ్విధంబుఁ

దెలిసి, కాళిందిలో దివ్యమందిరమును
గల్పించి, ననుఁజూచి 'కన్య! నీవు
ఈ మందిరంబులో నిందిరాధిపుఁ గూర్చి
తపమాచరింపు, మా దనుజవైరి
వచ్చి నిన్నిచ్చట వరియించునంగ, నేఁ
జెలఁగి తపంబందుఁ జేయుచుండ

తే.గీ. నపుడు తరిగొండ నరసింహుఁడైన శేష
నగనివాసుఁడు చనుదెంచి నన్ను మెచ్చి,
తోడుకొనివచ్చి తగఁ బెండ్లియాడె నిచట,
ఇంతి! నా పెండ్లి యగు చంద మిట్లనమ్మ! 22

వ. అనిన విని, మిత్రవిందను జూచి 'నీ వృత్తాంతంబుఁ
జెప్పు'మనిన, దానితో మిత్రవింద యిట్లను చున్నది. 23

## *మిత్రవింద వృత్తాంతము*

మిత్రవింద:ద్విపద. సరసభావమున నా - చందంబు వినవె!
సురుచిరాత్మకుఁడైన - సుమతి మా తండ్రి,

సలలిత హృదయ రా - జాదేవి తల్లి,
నలువొప్ప నా చిన్న - నాఁడు నా కొఱకు

తొడరి విందానువిం - దులు స్వయంవరము
కడిమిమైఁ జాటింపఁ - గా సంతసించి,

ఆ స్వయంవరమున - కహిశైల విభుఁడు
భాస్వరతరిగొండ - పతి వచ్చి, సకల

నరనాయకుల గెల్చి - ననుఁ గొనితెచ్చి,
అఱ లేక తా వివా - హంబుఁ జేసికొని,

హితవు రెట్టింప న - న్నేలుచునుండు;
నతివరో! మిత్ర విం - దందురే! నన్ను.

వ. అనిన విని సంతసించి, నాగ్నజితినిఁజూచి' నీవెవరు?నీతల్లిదండ్రు లెవరు? నీపేరేమి? నీ వృత్తాంతంబుఁ జెప్పు' మనిన దానితో నాగ్నజితి యిట్లనుచున్నది: 2

## *నాగ్నజితి వృత్తాంతము*

నాగ్నజితి:ద్విపద. చెలియరో! విను నగ్న - జిత్తు మా తండ్రి,
సలలిత విమల సు - స్వాంత మా తల్లి,

నరులెన్న మా తండ్రి - నా చిన్ననాఁడు
'పరభయంకర వృష - భముల నేడిటిని

నొక మూటఁ గట్టిన - యురు బలాఢ్యునకు
శుకవాణియైన నా - సుత నిత్తు' ననుచు

వసుధలో నొక స్వయం - వరము చాటించె;
నసమానులగు రాజు - లందుకై వచ్చి

వృషభంబులను బట్ట - వెఱచి, రా వెనుక
విషమాస్త్ర గురుఁడైన - వేంకటకృష్ణ

దేవుండు తరిగొండ - దేవుఁడై వచ్చి,
భూవరు లంద ఱ - ప్పుడు సిగ్గు పడఁగ

నేడు కోడెలకుఁదా - నేడు రూపముల
వాఁడిగా ధరియించి - వాటిఁ గట్టిడ్చి

నలువొప్ప నచ్చోట - ననుం బెండ్లియాడి,
చెలఁగి తెచ్చెను; నాగ్న - జితియె నా పేరు.

వ. అనిన విని, భద్రను జూచి 'నీవృత్తాంతంబుంజెప్పు'మనిన,దానితో భద్ర యిట్లనుచున్నది: 25

## *భద్ర వృత్తాంతము*

భద్ర: ద్విపద. కలకంఠి! నాకుఁ గే - కయరాజు తండ్రి,
వలనొప్ప సతి కళా - వతి కన్నతల్లి,

మాధవునకు మేన - మఱఁదల నగుట
చే ధరాధిపుల గె - ల్చి ముదంబు మీఱ

ననుఁ దెచ్చి తరిగొండ - నరసింహదేవుఁ
డన నొప్పు శేషాచ - లాధీశ్వరుండు

నవయౌవనంబున - ననుఁ బెండ్లియాడె;
నవనిలో నను భద్ర - యందు రోయమ్మ!

వ. అనిన విని, లక్షణను జూచి 'నిన్ను హరిపెండ్లి యాడిన విధంబు సాంగంబుగాఁ జెప్పు'మనిన, దానితో లక్షణయిట్లనుచున్నది: 26

## *లక్షణ వృత్తాంతము*

లక్షణ:ద్విపద. వెరవొప్పఁ జెప్పెద - వినవమ్మ! నాకుఁ
జిరపుణ్యుఁడగు బృహ - త్సేనుండు తండ్రి,

ధారుణిన్ వెలయు ను - ద్దామ మా తల్లి,
నారీలలామ ! నే - నా చిన్ననాఁడు

కమలాక్షుఁడే పతి - గావలె ననుచుఁ
గమనీయమతిని సం - కల్పించియుంటి;

నా నిశ్చయంబెల్ల - నా తండ్రి తెలిసి
తా నొక్క మత్స్య యం - త్రంబుఁ గల్పించి,

'పరఁగ నీయంత్రంబు - పడవేయు ఘనున
కిరవొంద నా బిడ్డ - నిచ్చెద' ననిన,

నా వార్త విని రాజు - లందఱు వచ్చి
భావించి యంత్రమున్ - పడవేయలేక

యరిగి, రా వెనుక శే - షాద్రీశుఁడైన
తరిగొండహరి దాని - ధరఁ గూలనేసి,

నరులెల్ల వినుతింప - ననుఁ బెండ్లియాడె;
నరుదుగా లక్షణ - యందురే! నన్ను.

వ. అనిన విని సంతసించి, రాధను జూచి 'నీ వృత్తాంతంబుఁ
జెప్పు' మనిన, దానితో రాధ యిట్లనుచున్నది: 27

## *రాధ వృత్తాంతము*

రాధిక:ద్విపద. వివరించి చెప్పెద - వినవె! నా చంద
మవని సదానందుఁ - డతివ! మా తండ్రి,

సుందరి మా తల్లి - సుజ్ఞానహృదయ,
నందుండు మా యన్న, - నా కూర్మివదినె

శ్రీయశోదాదేవి, - సీరి యల్లుండు,
పాయక శేషాద్రి - పైఁ బ్రకాశించు

తరిగొండ హరి నాకుఁ - దగిన మిత్రుండు;
హరిణాక్షి! రాధిక - యంద్రు నా పేరు.

వనపాలిక: తే.గీ. నీ మగని పేరు చెప్పవె నీలవేణి!

రాధిక: నా మగని పేరెఱుంగనె! నళినపాణి!

వనపాలిక: పెండ్లియాడితివో? లేక ప్రేమ నేల్కొనెనొ?

రాధిక: పెండ్లియాడితినే! వాని పేరెఱుంగ. 28

వ. అనిన విని వక్రభాషిణి హాసంబుఁజేసి, క్రమ్మఱ రుక్మిణీదేవినిఁ జూచి 'నీ పెండ్లియైన వృత్తాంతంబు సాంగంబుగాఁ దెలుపు' మనిన, దానితో రుక్మిణీదేవియిట్లనుచున్నది: 29

# *రుక్మిణీ పరిణయ గాథ*

రుక్మిణీదేవి:

ద్విపద. నాతిరో! నాచిన్న - నాఁడు మాధవుని
ఖ్యాతిగా మనమందుఁ - గామించి యుంటి,

నా తండ్రి యా రీతి - నందాత్మజునకుఁ
బ్రీతితో నన్నిచ్చి - పెండ్లిఁజేయుటకు

గట్టిగా మదిని సం - కల్పించియుండె;
నట్టి చందము రుక్మి - యనెడు మా యన్న

విని, తండ్రి యత్నంబు - వికలంబుఁజేసి
చెనఁటియైనటువంటి - చేదీశ్వరునకు

*నను౯ బెండ్లిచేయ ని - ర్ణయము చేసినను

అది విని భయమంది - 'హరికి నా వార్త
కొదుకక చెప్పి తో - డ్కొనిర'మ్మటంచు

తడయక భూసురో - త్తమునిఁ బంపితిని;
కడువేగ నతఁడేగి - కంజోదరునకు

వినిపింప, విని హెచ్చి - వీరుఁడై వచ్చి,
మొనసి జరాసంధ - ముఖ్యుల గెలిచి,

ననుఁ గొని తెచ్చి ప - న్నగశైల వాసుఁ
డననొప్పు తరిగొండ - హరి పెండ్లియాడె;

నా పెండ్లియగుటిట్లు, - నా ప్రాణవిభునిఁ
జూపవే! యనఁగ, నా - సుదతి యిట్లనియె:

---

* ఇక్కడ 'న'కారప్రాసగల ఒక పాదం లుప్తమయింది. ఐనా కథాగమనంలో వెలితిలేదు.

వ. 'అమ్మా! వో రుక్మిణీదేవీ! సవతులనందఱినిఁ దోడ్కొని యా వనంబు విడిచి, యీ వనంబునకు వచ్చితిరైనా, శ్రీకృష్ణునిఁ జూపె ననిన,విని వచ్చి, దానితో వారందఱు నిట్లనుచున్నారు: 31

## దరువు. ఆదితాళం

రుక్మిణ్యాదులు:శ్రీకాంతుండేఁడే? వోయమ్మా! మా
చెలువునిఁ దేవే వో కొమ్మా! ॥ పల్లవి ॥

ముదమున నివ్వన - మున నున్నాఁడని
వదలని వేడ్కను - వచ్చితి మిప్పుడ ॥ శ్రీకాంతుఁ ॥

మానిని! నందకు - మారునిఁ జూచిన
గాని మనము లి - క్కడ తాళవు,మా ॥శ్రీకాంతుఁ ॥

కొంకక శ్రీ తరి - గొండ నృహరియగు
వేంకట కృష్ణుని - వేఁగూడెద మా ॥ శ్రీకాంతుఁ ॥

వ. అనిన విని వక్రభాషిణి వికవికా నవ్వి 'శ్రీకృష్ణుండుయెక్కడ జూచినా నా కన్నులకు కనిపించుతూ వున్నాడు. మీ దగ్గఅవుండి మీకు కనిపింపక వున్నాఁడు. అదృశ్య కరణి మొదలైన యింద్రజాల మహేంద్రజాలములు నేర్చినాఁడు గనుక అంతర్ధానుఁ డైనాఁడేమో, మీరు లెస్సగా ప్రార్థన చేసి పిలిచితే ప్రత్యక్షం బయ్యీని'. అనిన విని వారందఱు యిట్లని ప్రార్థింపుచున్నారు: 31

## *పత్నులు శ్రీకృష్ణుని భక్తితోఁ బ్రార్థించుట*

## దరువు

రుక్మిణ్యాదులు: పాహి పాహి ॥ పల్లవి ॥

పాహి పాహి సరోజలోచన! - పాహికలుషవిమోచనా!
పాహి నిగమాగమ వివేచన! - పాహి ఘనశుభసూచనా!
॥ పాహి ॥ ౧

పాహి శ్రీలలనా పరిగ్రహ! - పాహి సుందర విగ్రహ!
పాహి ఘోరసురారి నిగ్రహ! పాహి దీనానుగ్రహ!
॥ పాహి ॥ ౨

**పాహి వరశేషాచలేశ్వర! - పాహి నతవాణీశ్వరా!**
**పాహి జిత దుర్మానవేశ్వర! - పాహి తరిగొండేశ్వరా!**
**॥ పాహీ ॥ 3**

వ. అని వినుతించిన, విని హరి ప్రసన్నుండై తన వధూమణులతో నిట్లనుచున్నాడు: 32

## *దరువు. ఆదితాళం*

శ్రీకృ: రావే! శ్రీరుక్మిణి! రావే! - రావే! జాంబవతీ! రావే!
రావే! కాళిందీ! రావే! - రావే! మిత్రవిందా! రావే!
రావే! నాగ్నజితీ! రావే! - రావే! ఓ భద్రా! రావే!
రావే! శ్రీలక్షణ! రావే! - రావే! ఓ రాధా! రావే!॥పల్లవి॥

పన్నుగ మిమ్మును - నిన్నటినుండియు
కన్నులఁ గట్టిన - కైవడి నుండెను
॥ రావే! శ్రీరుక్మిణి! రావే! ॥ ౧

మీతోఁ గూడని - నా తాపముచే
రాతిరెల్ల శివ - రాత్రిగ జరిగెను
॥ రావే! శ్రీరుక్మిణి! రావే! ॥ ౨

మదనాస్త్రావళు - లెదలో నాటెను
సుదతులార! దయఁ - జూడరె! యింకను
॥ రావే! శ్రీరుక్మిణి! రావే! ॥ 3

ముద్దియలార! ని-బద్ధిగ పద్దులు
వద్దిఁక, ముద్దుల - సుద్దులు చెప్పుచు
॥రావే! శ్రీ రుక్మిణి! రావే ॥ ౪

'తరిగొండాధీ - శ్వర! ఘనతర ఫణి
గిరివర! ర'మ్మని - కరుణింపరె! నను
॥ రావే! శ్రీరుక్మిణి! రావే ॥ ౫

క. అని యిటు పిలిచిన, భామలు
కనకాంబరు దివ్యపదయుగము తమ కనులన్
దనరార నొత్తుకొనుచును
మనములు రంజిల్ల ననిరి మఱి యిట్లనుచున్. 33

## చూర్ణిక

**రుక్మిణ్యాదులు:**

శ్రీ మదచంచల జ్ఞానైశ్వర్య శక్తి బల తేజో వీర్యముఖ్యానంతగుణ గణాభిరామా! నీల తోయద ఘనశ్యామా! ౧

కాలప్రధానాంత: కరణా ద్యనాదిషట్కవినిర్మితాఖిలబ్రహ్మాండ భాండసమహ పరిపూరితోదరా! నీలాంబర సహోదరా! ౨

అవిద్యామాలిన్య కలిత రాగద్వేషాసూయాప్రముఖ షోడశ వికార విరహిత జ్ఞానప్రకాశాతిశయ పరమభాగవతజనమనోంబుజ రాజహంసా! విదళిత మహారోష కంసా! 3

నిరంతర కిసలయపత్ర కోరక కుసుమ ఫల భరితకదళీ నారికేళ పనసాశ్వత్థ పిచుమంద వకుళ వట కుటజ కురంటక కోవిదార మాలూర జంబీర హింతాల సాల రసాల పాటలీ పారిజాత పున్నాగముఖానేక తరు తృణ గుల్మ లతావృత శేషధరణీధరాగ్ర నివాసా! మంగాముఖోల్లాస దరహాసా! 4

బహుజన్మ భక్తి జ్ఞాన వైరాగ్యాభ్యాన నంస్కార పరిపాక చరమశరీరధర వారసంచితా గామినీ ప్రారబ్ధ మదద్విరదాళి సింహా! తరిగొండ లక్ష్మీ నృసింహా! రక్ష మాం రక్ష మాం రక్ష మామ్. 5

## దరువు

నందనందన! కృష్ణా! వందనం ॥ పల్లవి ॥

కుందరదన! శరదిందువదన! శ్రీ
నందనందన! కృష్ణా! వందనం ॥ ఉప పల్లవి ॥

మందరోద్ధారా! - మౌళిమందారా!
సుందరాకార! ధీర! - సూరి విచారా!॥ నందనందన! ॥ ౧

పరిపూర్ణ కామా! - భండన భీమా!
సరసజలద శ్యామా! -జగదభిరామా!॥ నందనందన! ॥౨

వరచిదాకాశా! - వనధినివేశా!
చిరతరిగొండాధీశా! - శ్రీవేంకటేశా!॥ నందనందన!॥3

క. అని వందనములు చేసిన
తన భార్యామణులనెల్ల దరహాసముతో
ననురాగ మెసఁగఁ గనుఁగొని,
మొనసి కరాబ్జములు పట్టి మొగి నిట్లనియెన్. 34

## *సుందరులతో శౌరి శృంగార వన విహారము*

### దరువు. అటతాళం

శ్రీ కృ: ఖ్యాతీగ యీశృంగార - వనము లెస్స
జూతాము రారే! సుందారులారా! ॥ ౧ ॥

జోడైన పొన్నాల - నీడాల కోలాట
లాడుదామే! - చేడియలారా! ॥ ౨ ॥

భోగాముగా పూల - తీగేల యుయ్యాల
లూఁగుదామే! - ఓ చెలులారా! ॥ 3 ॥

మించూలవలె ఏక - సించు పువ్వుల కొమ్మ
లొంచుదామే! - ఓ చెలులారా! ॥ ౪ ॥

ఈ చెట్లఁ దుమ్మెద - లెగయఁ బువ్వుల పొద
లూఁచుదామే! - ఓ చెలులారా! ॥ ౫ ॥

ముద్దైన శుక పిక - ములకెల్ల పలుకూలు
దిద్దుదామే! ము - ద్దియలారా! ॥ ౬ ॥
చక్కెరవలె నుండే - సరసంపు ఫలమూలు
మెక్కుదామే! మృగ - మధ్యలారా! ॥ ౭ ॥

ఇయ్యెడ 'శ్రీవేంక - టేశా! ర'మ్మని ముద్దు
లియ్యారె! ఓ యెల - నాగలారా! ॥ ౮॥

బాగైన తరిగొండ - పతినైన నను డాసి
కౌఁగిలీరే! కల - కంఠులారా! ॥ ౯॥

## దరువు. ఆది తాళం

రావే! రుక్మిణి! రా జాంబవతీ! రావే! కాళిందీ!
రావే! మిత్రవింద! రా నాగ్నజితీ! రావే! భద్రా!
రావే! లక్షణ ! రావే ! ఓరాధా ! ॥ పల్లవి ॥

పొన్నల నీడకు - పోదాము రారే!
కుసుమములిన్నియుఁ - గోతాము రారే!
జోడుగ ఖగములఁ - జూతాము రారే!
రహి ఫలచయముల - రాల్తమురారే!
॥రావే!రుక్మిణి!॥ ౧

పలుకు చిలుకలను - పట్టుదము రారే!
రోలంబములను - తోలుదాము రారే!
కోవెలగమివలెఁ - గూతాము రారే!
నగి హంసలవలె - నడుతము రారే!
॥ రావే!రుక్మిణి!॥ ౨

అమర నెమళ్లరీతి - నాడుదాము రారే!
జాజి పువ్వులు వెదc - జల్లుదాము రారే!
నన్ను 'శ్రీనివాసా!' యని - నవ్వి ముద్దులివ్వరే!
'తరిగొండేశా!' రమ్మని - దయను నన్నుc గూడరే!
॥ రావే! రుక్మిణి! ॥ 3

## *రాధాదేవి హర్షోక్తులు*

ద్విపద. అని శౌరి పల్కcగా, - హర్షించి రాధ
పనిcబూని రుక్మిణి - ప్రముఖాంగనలను

గనుcగొని 'వింటిరే - కామినులార?
మనసిజ జనకుండు - మనల లాలించి

వనవిహారము చేయ - వాంఛించినాcడు
జనునుత వేంకటా - చలవాసుcడైన

తరిగొండహరికి మో - దంబు రెట్టింప
నరమరల్ వీడి యిం - దాటలాడుదము.

## దరువు. అటతాళం

రాధాదేవి: హరి! కృష్ణా! హరి! కృష్ణ! - హరి! కృష్ణ! హరి! కృష్ణా!
హరి! కృష్ణా! యని సరస - మాడుదామా?॥ పల్లవి॥

ఈవేళాదనుకా నీ - వెందూ దాcగితివోయి?
గోవిందా!యని జడలాc -గొట్టూదమా?
॥హరి!కృష్ణా!॥ ౧

తప్పుc జేసితివాని - రొప్పుచు దండించి
పుప్పొడి పైనిండా - గుప్పుదమా?
॥ హరి!కృష్ణా! ॥ ౨

మల్లేలు మొల్లాలు - కొల్లాలుగాఁదెచ్చి
నల్లాని సామిపైఁ - జల్లూదమా?
॥ హరి!కృష్ణా! ॥ 3

దవ్వాదవ్వాలనుండి - పువ్వాల బంతూలు
రువ్వాచుఁ బకపక - నవ్వాదమా?
॥ హరి!కృష్ణా! ॥ ౪

లాలించి బేలించి - గేలించి తేలించి
మేలుమోవీతేనె - గ్రోలూదమా?
॥ హరి!కృష్ణా! ॥ ౫

మక్కూవఁజేయూచుఁ - జిక్కించుకొని, వీని
చెక్కిళ్లు మునిపంట - నొక్కూదమా?
॥ హరి!కృష్ణా! ॥ ౬

ఎమ్మేలు చేయక - రమ్మురమ్మని వీనిఁ
గొమ్మాపొలిండ్లాను - గుమ్మూదమా?
॥ హరి!కృష్ణా! ॥ ౭

వేడూకగా హరికి - వీడేము లందిచ్చి
జోడూజోడూగఁ గవ - గూడూదమా?
॥ హరి!కృష్ణా! ॥ ౮

తరిగొండాధిప! శేషా - గిరివాసా! శరణాని
మురియూచు మురియూచు! మ్రొక్కూదమా?
॥హరి!కృష్ణా!॥ ౯

## దరువు

గిరిధామూనిఁగూడరే! - గిరిగిట్లందఱాడరే! ౧

గోవిందూనిఁ గూడరే! - కోలాట లందఱాడరే! ౨

గోపాలునిఁ గూడరే! - గుడుగుడుగుంటామాడరే! 3

అచ్యుతునిఁ గూడరే! - అమ్మన్నా లిందాడరే! ౪

కంజాక్షునిఁ గూడరే! - కన్నాముచ్చిల్లాడరే! ౫

శ్రీనివాసునిఁ గూడరే! - పూని పదములు పాడరే! ౬

తరిగొండేశునిఁ గూడరే! - తిరిగీ గొబ్బిళ్ళాడరే! ౭

## గొబ్బిళ్ల పాట

గొబ్బిళ్లో! గొబ్బిళ్లో! ॥ పల్లవి ॥

శ్రీకృష్ణుఁడాట్లాడి - యలసియున్నాఁడు చూడరే!
॥ గొబ్బిళ్లో! ॥ ౧

ఆటాలు చాలించి వచ్చి - హరికి సేవ చేయరే!
॥ గొబ్బిళ్లో! ॥ ౨

విరులా పఱుపు పఱచి చక్ర - ధరు నిచ్చోట నుంచరే!
॥ గొబ్బిళ్లో! ॥ 3

చిఱు చెమటా లారేటట్ల - చిగురు టాకుల విసరరే!
॥ గొబ్బిళ్లో! ॥ ౪

బడలికెల్లాఁ దీఱ మోవి - పానకము లియ్యరే!
॥ గొబ్బిళ్లో! ॥ ౫

విరిబంతూలు కనులా నొత్తి - వీడెము లందియ్యరే!
॥ గొబ్బిళ్లో! ॥ ౬

మెత్తగాఁ బాద పద్మాము - లొత్తి సేద దేర్చరే!
॥ గొబ్బిళ్లో! ॥ ౭

హరినీ నడుమ నుంచి యంద - రిఱుగడల నిలువరే!
॥ గొబ్బిళ్లో! ॥ ౮

వీణెలు మీఁటీ పాటలు - నాణెముగఁ బాడరే!

॥ గొబ్బిళ్లో! ॥ ౯

శ్రీనివాసునీ కౌఁగిటఁజేర్చి - ముద్దు లియ్యారే!

॥ గొబ్బిళ్లో! ॥ ౧౦

తరిగొండాధిపతిమీఁద నం - దఱు నేలలు పాడరే!

॥ గొబ్బిళ్లో ॥ ౧౧

## ఏలలు

**కొమ్మలందఱు:** ముందూగా మమ్మందారిని - పొందూగాఁ బిలువనంపీ
యెందూ దాఁగి నీ వుంటివోయీ? వో కృష్ణదేవా!
- యేమి మామాటా వింటివోయీ? ౧

**కృష్ణదేవుఁడు:** ఇవ్వానాములోనా నన్నూ మీ -రేమీ యందురో యనుచూ
నవ్వూలాకు దాఁగియుంటినే! ఓ కొమ్మలారా!
- నన్నూ మీ రన్నాదీ వింటినే! ౨

**కొమ్మలందఱు:** పన్నాగాద్రినిలయా! మేమూ-నిన్నేమానీయున్నాఁగానీ
మన్నించీ దాయాఁజూడవోయీ! వో కృష్ణదేవా!
-మదినీ కలఁకా వుంచవద్దోయీ! 3

**కృష్ణదేవుఁడు:** సమ్మాతీగా తారిగొండా - సామీనై వాత్సల్యమూన
మిమ్మూ చాలా మన్నించినానే! ఓ కొమ్మాలారా!
- మీకూ భయమూ లింకేలానే? ౪

క. అని పలికి కృష్ణుఁ డిచ్చటఁ
గనకాంగులఁ గూడి వేడ్కగాఁ గొలువుండెన్;
తనరార సత్యభామిని
దనుజారినిఁ గాన కచటఁ దత్తరమొందెన్. 35

## *సత్యభామ యేతెంచుట*
## సావేరి

ద్విపద. అంత దిగ్గున లేచి - యా సత్యభామ
వింతగాఁ దన మదిన్ - వెనుక నూహించి,

సరగునఁ బన్నీట - జలకంబు లాడి,
సిరి గుల్కు సరిగంచు - చీర గట్టుకొని,

రహినిఁ జందురుకావి - ఱవికొప్పుఁ దొడిగి,
బహురత్న విలసితా - భరణముల్ దాల్చి,

లలి మించుఁ బైఁడి బి - ళ్లల జడ నిండ
విలసితముగ మంచి - విరి సరుల్ చుట్టి,

సారమై వాసించు - చందనం బలఁది,
తీరుగాఁ గస్తూరి - తిలకంబు దిద్ది,

కన్నుల వగ గుల్కు - కాటుక దీర్చి,
పన్నగేశ్వర శైల - పతిని మాధవుని

నలువొప్పఁ దరిగొండ - నరమృగేశ్వరుని
వెలయఁగా నందందు - వెదకుచు నపుడు

ఘల్లు ఘల్లని కాళ్ల - గజ్జెలు మ్రోయ
పల్లవాధర సత్య - భామ యేతెంచె.

తే.గీ. వచ్చి తనకేళివనములో వాసుదేవు
నంత వెదకుచునుండఁగా నంతలోను
వనముఁ బోషించుచుండినవాని భార్య
యెదుట నిలిచిన, దానితో నిట్టులనియె: 36

## దరువు. ఆదితాళం

సత్యభామ: శ్రీవెలయా ముద్దుకృష్ణా - దేవునీ చూడలేదటవే?
వో మందాయానా!
నిదురా పోవఁగా నన్నూ - చొక్కించి పోయినాఁడేనేమి
సేతూ? వో మందాయానా! ౧

ఎన్నాళ్లాకో సెలవూగానూ - నిన్నా మాయింటీకి వచ్చె
వో మందాయానా!
తిరుగా, నన్నూ మోసాపుచ్చి అల్లా - వెన్నూఁడెచటీ
కరిగి నాఁడో? వో మందాయానా! ౨

శ్రీ తరిగొండాధీశుఁడైనా - శ్రీనివాసూనిఁ జూపటవే!
వో మందాయానా!
వాని నీతరిఁ జూచీనఁ గాని - నే తాళలే నెట్లానే?
వో మందాయానా! 3

వ. అని యడిగిన, (వనపాలికయగు) వక్రభాషిణి సత్యభామను జూచి చూడని చందంబుననుండి, చిందులు ద్రొక్కుచుఁ దనలోఁ దానిట్లనుచున్నది 37

## *వక్రభాషిణి చిందులు*

వక్రభాషిణి: హెచ్చి మా తోట్లోకి - వొచ్చినో రోరే?
పచ్చి మిరప్పొళ్లో - జొ చ్చినో రోరే? ౧

కోరి కాయలు, పండ్లు - కోసినో రోరే?
యెఱగెడ్లు, తెలగెడ్లు - పెరికినో రోరే? ౨

కొయిగూర, గోంగూర - కోసినోరోరే?
యీ చింతకాయ లిం - దేరినో రేరే? 3

తెగువగా చవుటుప్పు - తెచ్చినో రోరే?
వోశమ్మ! పులగూర - వండినో రోరే? ౪

మెత్తగా యీ కూర - మింగినోరోరే?
తొడరి ముల్లంగెడ్లు తొవ్వినోరోరే? ౫

నలగొట్టి గఱగఱా - నమిలినో రోరే?
యెద్దులవలె పరువు - లెత్తేవా రోరే? ౬

తొడిబడి చెట్లన్ని - తొక్కేవా రోరే?
శ్రీ తరిగొండా నర - శిమ్మన్నా రోరే? ౭

వ. అనియిట్లు ఎగిరెగిరి గంతులు వేయుచున్న వక్రభాషిణి నుద్దేశించి సత్యభామ యిట్లనుచున్నది.: 38

## *సత్యభామ - వక్రభాషిణి*

సత్యభామ: అవునే! అమ్మయ్యా!

వక్రభాషిణి: యేమే! వో దుమ్మయ్యా!

సత్య: నీ వెవరవో అక్కయ్యా?

వక్ర: నేను యెవరైతేనేమి? నన్ను యెవరనేటందుకు నీవు యెవరే నక్కయ్యా?

సత్య: నీ పేరు యేమని పిలుతురే? కొమ్మా! వో కొమ్మా!

వక్ర: నన్ను కలహకంటకి యందురే! తుమ్మా! వో తుమ్మా!

సత్య: నేను యెంతో ఘనంబుగా నిన్ను 'కొమ్మా!' యంటే, నీవు నన్ను 'తుమ్మా!' యందురటవే! భామా! వో భామా!

వక్ర: నీవు నా తోటంతా తొక్కి, పచ్చి మిరప్పండ్లు,యెఱగెడ్లు, తెలగెడ్లు, కొయిగూర, గోంగూర,చింత కాయలు, ముల్లంగెడ్లు మొదలయినవి కోసి, కూర వండుకతిన్నావు గనుక, కోపముచేత నేను అట్లా అంటుండానే!
దోమా! వో దోమా!

వత్య: యిట్లా వెఱ్ఱి మాటలనక, నే నడిగిన మాటకు
చక్కగా ఉత్తరంబుఁ జెప్పితే, నీ కేమైనా యిచ్చేనే!
తల్లీ! వో తల్లీ!

వక్ర: అయితే నన్ను యేమి అడుగవలెనో అడగవే!
అనిన దానితో సత్యభామ మఱిన్ నిట్లనుచున్నది: 3

### దరువు. ఆదితాళం

వత్య: కృష్ణునిఁ జూడలేదే మమ్మా? ॥ పల్లవి ॥

ఓరామా! మా కృష్ణునిఁ జూడలేదేమమ్మా?
॥ ఉప పల్లవి ॥

వక్ర: కృష్ణుని చిహ్నము లేమమ్మా? వో భామా!
మీ, కృష్ణుని చిహ్నము లేమమ్మా? ॥ కృష్ణుని ॥ ౧

వత్య: నల్లాని మేనివాఁ డోయమ్మా! కృష్ణుఁడు
చల్లాని చూపులవాఁడమ్మా! ॥ కృష్ణుని ॥ ౨

వక్ర: యింకా యే గురుతులా వాడమ్మా? మీ కృష్ణుని
పొంకాములన్నీ దెలుపావమ్మా! ॥ కృష్ణుని ॥ 3

వత్య: నవ్వూమోమూ వాఁడోయమ్మా! యేవేళ
వేణు, నాదాముఁ జేయుచుండునమ్మా!॥ కృష్ణుని ॥౪

వక్ర: యెంతో సంతోషామాయె నమ్మా! మీ కృష్ణుఁడు
ఎప్పూ డెందుండు తెలుపవమ్మా! ॥ కృష్ణుని ॥ ౫

వత్య: శ్రీ తరిగొండా నుండునమ్మా! యేవేళ
ఘన, శేషాద్రిపై నటించు నమ్మా! ॥ కృష్ణుని ॥ ౬

## *వక్రభాషిణి వికటోక్తులు*

ద్విపద. అని సత్యభామ నె - య్యంబుతో నిట్లు
వినిపింప, విని చెలి - వికటోక్తి ననియె:

'నల్లని వారును - నవ్వేడివారు
చల్లని చూపుల - శాంత మానసులు

ఒనర పిల్లంగోవు - లూఁదేటివారు
ఘన తరిగొండలోఁ - గా నుండువారు

అలర శేషాద్రిపై - నాడెడివారు
నిలలో ననేకు, లం - దెవ్వరో యితఁడు?

నాకెట్లు దెలుసు? ని - ర్ణయముగా నతని
ప్రాకట చిహ్నముల్ - పట్టుగాఁ దెలుపు'

మని యిట్లు వికటోక్తి - నడుగఁగా నగుచు
విని సత్యభామ యా - వెలఁది కిట్లనియె.

క అక్రమములుగా సారెకు
వక్రములగు మాటలాడవల దిటు, మకరిన్
విక్రమము మీఱఁ ద్రుంచిన
చక్రధరుం డతఁడె వికచసారసపాణీ! 40

వక్ర: క. వక్రంపు మంటి పెళ్లల
నీక్రమమునఁ ద్రొక్కి కుండ లేర్పఱచి, ధరన్
విక్రయముఁ జేసి బ్రదికెడి
చక్రధరుండటవె! వాఁడు సారసనయనా? 41

సత్య: తే.గీ. వసుధలో వీఁడు కుమ్మరవాఁడు గనుక
గ్రాసమునకై కులాల చక్రము ధరించె,
నందుచేఁ జక్రధరుఁడు వీఁడనఁగఁ దగునె?
వాఁడు శంఖంబుఁ దాల్చిన వాఁడె చెలియ! 42

వక్ర: తే.గీ. పూని సంక్రాంతి జంగంబు కానుకలకు
జనుచు నిల్లిల్లు దూరుచు శంఖ మచట
పరఁగ పూరించి వచ్చు భంభంభ మనుచు
నట్టి శంఖధరుండటె యతివ! యితఁడు? 43

సత్య: తే.గీ. ఇంతి! యిట్టి యపార్థంబు లిపుడు చేసి
పాపములఁ బొందనేటికే? భక్తి గలిగి
తెలివితో విను కస్తూరి తిలక మతఁడు
నిటలమునఁ దాల్చి, వగగుల్కు నీటుకాఁడె! 44

వక్ర: ఆ.వె. పరఁగ గారడీఁడు గుఱుతుగా నల్లని
తిలకమెపుడు నుదుటఁ దీర్చియుండు
గారడంపువిద్య లారూఢిగాఁ జూపు
నట్టి విద్యవాఁడె యబల! వీఁడు? 45

సత్య: తే.గీ. కాంత! విను వాఁడు నల్లని కావు నుదుటఁ
దిలకముగఁ దీర్చుకొనఁగానె దేవదేవుఁ
డైన కృష్ణునితో సాటి యనఁగఁ దగునె?
బర్హిబర్హకిరీటుఁడే భామ! యితఁడు. 46

వక్ర: ఆ.వె. బర్హిబర్హమనఁగ భావింప నెమలీఁకె,
లమర నవియె శిరమునందుఁ దాల్చి
చెలఁగుచున్నవాఁడు చెంచువాఁబడు ధాత్రి;
నితఁడు నట్టివాఁడె యిందువదన? 47

సత్య: తే.గీ. ఎన్ని చెప్పిన, వికటోక్తు లీ విధమునఁ
జెప్పుచున్నావు, నీకు నేఁ జెప్పలేను;
సకియ! నీ మందెమేళంబు చాలుపోవె!
యనిన విని, చాల నగుచు నిట్లనియె చెలియ: 48

వక్ర: తే.గీ. తరళలోచన! నీ తల్లి దండ్రు, లత్త
మామలును, బావమఱఁదులు, మగఁడు నెవరు?
నీదు పేరేమి తెలుపు సమాదరమున,
ననిన సత్యభామ యా యతివ కనియె: 49

## *సత్యభామ వృత్తాంతము*

సత్య: ద్విపద. కమలాక్షి! వినవె! నా - క్రమమెల్లఁ దెలియ
నమర సత్రాజిత్తుఁ - డతివ! మా తండ్రి,

పన్నుగా నిరతంబుఁ - బతి భక్తిచేత
వన్నె కెక్కిన సత్య - వతియె మా తల్లి,

ధీరాత్ముఁడగు వసు - దేవుండు మామ,
కీరవాణిరొ! దేవ - కీదేవి యత్త,

అలరారు హలపాణి - యగు తొల్లు బావ,
సలలితాత్మకుఁడైన - సాత్యకి మఱఁది,

వనిత! రుక్మిణి, జాంబ - వతియుఁ, గాళింది,

యల మిత్రవిందయు, - నా నాగ్నజితియు,
లలితురాలగు భద్ర, - లక్షణ యనెడి

వేసాలమారులు - వింత గత్తెలును
నా సాటి సవతు లె - న్నంగ నేడ్గురును,

పట్టుగాఁ దరిగొండ - పతి పాదయుగమె
పట్టి వీడని సత్య - భామ నా పేరు.

## *వనపాలిక హాస్యోక్తులు*

వక్ర: తే.గీ. అనఁగ నది నవ్వు కొనుచుఁ 'బద్మాక్షి! యిపుడు
వెలయ నందఱి వరుసలు వింటిఁ, జక్రి
యేమి కావలె? నది తెల్పు మింకఁ' ననిన
సిగ్గుతో నిట్లు పలికె నా చిగురుఁబోణి. 50

సత్య: తే.గీ. అతివ! నా తల్లిదండ్రుల కల్లుఁడతఁడు,
వనిత! మాయత్తకును మామకును సుతుండు,
మఱియు బావకుఁ దమ్ముఁడు, మఱఁది కన్న
గాఁగ, నాకేమి కావలె బాగఁజూడు. 51

వక్ర: తే.గీ. అతఁడు నీ తల్లిదండ్రుల కల్లుఁడేతె
అక్కకో చెల్లెకో మగఁడనఁగవచ్చు,
నత్తమామలకును సూనుఁడైన బావ,
మఱఁదియో రెంటిలో నొక మాట నిజమె! 52

సత్య: తే.గీ. 'వినవె! మా బావకన్నను వెనుకవాఁడు,
మొనసి భావింప మఱఁదికి ముందువాఁడు
గాన నాకేమి వరుసొ నిక్కముగఁ దెలియు'
మనిన ఫక్కున నవ్వి యిట్లనియె చెలియ: 53

వక్ర: ఆ.వె. బావవెనుకవాఁడు భావింప మఱఁదియౌ,
మఱఁది ముందువాఁడు నరయ బావ
---------------------------- గాన,
బావొ? మఱఁదొ? సత్యభామ చెపుమ! 54

సత్య: ఆ.వె. మగువ! బావగాఁడు, మఱఁదియునున్ గాఁడు,
పడఁతి! యిద్దఱికిని నడిమివాఁడు;
తెలిసికొనవె సూక్ష్మ మెలనాఁగ! వాఁడు నా
కేమి వరుస యైన, దిప్పుడైన. 55

ప్ర: ఆ.వె. 'నడిమివాఁడటన్న నాకేమి దెలుసునే?
యున్న మాట దెల్పకున్న రీతి'
ననిన సత్యభామ యళుకుచు బెళుకుచు
నెలమి సిగ్గుతోడ నిట్టు లనియె. 56

సత్య: తే.గీ. సిగ్గుచే నది నీకు నేఁ జెప్పలేక
మఱుఁగుగా నెన్ని చెప్పిన నెఱుఁగలేవు;
వనిత! నా సవతులకెల్ల వాఁడు మగఁడు,
చెలియ! నా కేమి గావలెఁ? దెలిసికొనవె! 57

ప్ర: తే.గీ. మానినీమణి! నీవిట్లు మఱుఁగు మాట
లెన్ని చెప్పినఁ దెలియలే నించుకైనఁ,
గాన చెప్పక తీఱ;దా కమలనయనుఁ
డేమి కావలెఁ దెల్పు జాగేల బాల? 58

## *దరువు. అటతాళం*

సత్య: ఎట్లా చెప్పుదునే? యీ మాట నే - నెట్లా చెప్పుదునే?
॥ పల్లవి ॥

ఎట్లా చెప్పుదునే? ఓ యింతి! యీ మాట యీ
పట్లా నా నోటనే పలికింపఁదలఁచీతి
॥ వెట్లాచెప్పుదునే?॥ ॥ఉప పల్లవి ॥

తెప్పూన నూహించి - తిన్నాగానే నేను
చెప్పూదామంటేను - సిగ్గయ్యీ, నీ మాట
॥ ఎట్లా చెప్పుదునే? ॥ ౧

జవ్వాని! నే నీతో - నివ్వాటిల్లఁగఁ దెల్ప
నెవ్వారైనను వింటే - నవ్విపొయ్యేరు, నే
॥ నెట్లా చెప్పుదునే? ॥ ౨

తరిగొండాధిపుఁడైన - వరశేషాగిరివాసుఁ
డరయాఁగ నాకేమి - వరుసైన విధముఁనే
నెట్లాచెప్పుదునే? ॥ 3

వక్ర: క. ఈ తీరున సిగ్గేటికి?
ఆతఁడు నీ కేమి వరుసయైన విధంబున్
నాతో మాత్రము దెల్పుము
నీతోడెవ్వరికిఁ జెప్పనే వనజాక్షీ! 5

సత్య: క. గుట్టుగఁ జెప్పెద నొక గుటి
పట్టుగ నది దెలిసికొనుము, బాల్యమునందే
చుట్టములు సమ్మతింపఁగ
గట్టిగ నామెడను బొట్టు గట్టినవాఁడే! 6

వక్ర: తే.గీ. 'బొట్టు గట్టిన వాఁడైతె పొలఁతి! నీకు
ఏమి గావలె'నన సత్యభామ నవ్వి
సత్య: 'ఎన్ని చెప్పినఁగాని నీ వెఱుఁగలేవు
మందమతి! విను మతఁడు నా మగఁడె చెలియ!' 6

## దరువు. ఆదితాళం

వక్ర: అయితే సంతోషమాయె నమ్మా! యీ మాట నీ
వప్పుడే జెప్పారాదేమమ్మా?

సత్య: సిగ్గునఁ జెప్పానైతినమ్మా! నీవిట్ల నా
సిగ్గెల్ల విడిపించితివమ్మా!

వక్ర: ఎన్ని చిక్కులఁ బెడితివమ్మా? యీ మాటఁ జెప్ప
నిన్ని గావలెనటవమ్మా?

సత్య: ఏమైనాఁ జెప్పావచ్చు నమ్మా! మగఁడానే మాట
యెంతైనాఁ జెప్పఁగూడదమ్మా!

వక్ర: వరశేషాచల వాసుఁడమ్మా! తరిగొండ నార
హరియే మగఁడాయె సిగ్గేమమ్మా?

సత్య: క. ఇచ్చటి కంబుజనాభుని
మచ్చికతో వెదక వచ్చి మఱిమఱి నీతో
ముచ్చటలాడన్ తీఱదు
చెచ్చెర హరిజాడఁ దెలియఁజెప్పవె చెలియా! 62

సుక: తే.గీ. పొలఁతి! హరిజాడ యేమి చెప్పుదునె? యిపుడు
వాసికెక్కిన శృంగారవనముఁ జేరి
చెలఁగి రుక్మిణీ మొదలైన జలజముఖులఁ
గూడి క్రీడించుచున్నాఁడె కువలయాక్షి! 63

సత్య: ఆ.వె. చెలియ! వాఁడు నాతోఁ జెప్పకపోఁడని
నమ్మి నిదురఁబోవ, నన్ను డించి
యచటి కరిగె; నింత యల్పుఁడౌ టెఱుఁగక
మోసపోతిఁ గదవెఁ ముద్దుగుమ్మ! 64

## దరువు. ఆదితాళం

ఏమందునమ్మా? ఓ యమ్మా! వానీ -
నేమందునమ్మా?యమ్మా! ॥పల్లవి॥

ఏమందునె వాఁడిటు నిర్దయుఁడై
ఆ మగువల కడ కరిగిన నీతికి ॥ ఏమందు నమ్మా?
॥ ఉప పల్లవి ॥

కటకట వాఁడిటు కుటిలాత్మకుఁడై
మటుమాయలు చేయుట విడువఁడు నే
॥నేమందునమ్మా?॥ ౧

కలకాలము మందులమారులనే
వలచి వలచి నా చెలిమే మఱచుట
॥కేమందునమ్మా?॥ ౨

ఇన్నాళ్లచటనె పన్నుగ నుండెను
నిన్ననె వచ్చెను, నేఁడే జరుగుట
॥కేమందునమ్మా?॥ 3

కాంతామణి! శ్రీకాంతుని మును నే
నింతటి వాఁడని యెఱుఁగక నమ్మితి
॥నేమందునమ్మా?॥ ౪

కరుణ విడిచి వేంకటపతియగు శ్రీ
తరిగొండాధీశ్వరుఁడిటు చేయుట
॥కేమందునమ్మా?॥ ౫

ఉ. నిబ్బరమైన మోహమున నిన్ననె నాకడఁజేరి చాల న
న్నుబ్బురమెంతొ చేసి, యలుకంతయుఁ దీఱిచి,పారిజాతమున్
గొబ్బునఁ దెచ్చియిత్తునని కూడినవాఁ, డది తేక యూరకే
దబ్బఱలాడిపోయె; నిఁకఁ దామరసాక్షుని నమ్మవచ్చునే? 65

## దరువు. అటతాళం

ఇంత దబ్బఱ గాఁడైతే - యేమి సేతునే? నా
చింత దీఱ నింక నేమి - చేసి చూతునే? ౧

పారిజాత మిచ్చేనని - పలికి బొంకెనే! వాఁ
డా రుక్మిణికి వెఱచి చెప్పే - టపుడె జంకెనే! ౨

పలికె నానా భావ, మపుడె - తెలుసుకొంటినే! వాఁ
డలిగి మళ్లిపొయ్యీనని - యనక యుంటినే! 3

కాంత! వాని కుటిల మపుడె - కానిపించెనే! నే
నెంత సైరించినా చల - మింత మించెనే! ౪

ఇంక తరిగొండహరిని - యేమనందునే? శ్రీ
వేంకటేంద్రుని నేనెట్లా - వేడుకొందునే? ౫

వక్ర: తే.గీ. అనినఁ జెలి యిట్టు లనియె నో యంబుజాక్షి!
'పారిజాతంబు నీకేలఁ బంకజాక్షుఁ
డిత్తు నని పల్కెఁ దత్క్రమంబెల్లఁ దెలుపు'
మనఁగ విని సత్యభామ యిట్లనియె మగుడి: 66

# *సత్యభామకు శ్రీకృష్ణుఁడొసఁగిన వాగ్దానము*

సత్య: ద్విపద. విమలాంగి! వినవె! యా-వృత్తాంత మిపుడు
క్రమముగాఁ జెప్పెదఁ -గాని, యా మొన్న

కలహప్రియుఁడు సాధు - గర్వి నారదుఁడు
చలపట్టి నా పాలి - శత్రువుఁడగుచుఁ

బారిజాతముఁ దెచ్చి - పద్మాక్షు కిచ్చె,
నా రుక్మిణికిఁ గృష్ణుఁ - డా పుష్పమొసఁగె;

నేనందు కలుకఁబూ - నిన చంద మెఱిఁగి,
తానె నా కన్న ముం - దఱ నల్కఁ జేసి,

యా నందసుతుఁడు భా - ర్యావళి వినఁగ
నా నా విధంబుల - ననుఁ దూలనాడె,

నా రోషమున దేహ - మతని కర్పింపఁ
గోరి యా భరణ దు - కూలముల్ రోసి,

మెట్టెలు, బుగడలు మెడలోన నతఁడు
కట్టిన బొట్టు ము - క్కర మాత్ర ముంచి,

యన్ని సొమ్ములు దీసి - యావల వేసి,
చిన్న పోవుచు మైల - చీర కట్టుకొని,

చురుకుగా నుదుటఁ - గస్తురి పట్టుఁ బెట్టి,
కరఁగుచు నొకమూల - గాఁ బూరి చవికెఁ

గట్టించి, దానిలోఁ - గా నుల్కత్రాళ్ల
మట్టుగా నల్లిన - మంచంబు మీఁదఁ

బనిఁబూని యెవరైనఁ - బ్రాయోపవేశ
మనువందఁ జేసిన - యటు పవ్వళించి,

యమర సర్వంబుఁ బ - ద్మాక్షు కర్పించి
రమణి! నేను విరక్తు - రాలనై యుంటి;

నప్పుడు శ్రీకృష్ణుఁ - డా చంద మెఱిఁగి,
తెప్పున రుక్మిణీ - దేవిని విడిచి,

నా చెంగటికి వచ్చి - నా యున్న యునికిఁ
జూచి, జాలినిఁ బొందు - చును మేను నిమిరి,

కన్నీటి చారలుఁ, - గస్తూరి పట్టుఁ
బన్నీటఁ గడిగి, యా - పాణిపద్మముల

లాలించి, నన్ను మె - ల్లనె లేవనెత్తి,
నీ లాలకంబుల - నేర్పుగా దువ్వి,

జడవేసి, యటఁ బూల - సరములు చుట్టి,
చిడిముడి పడి 'మైల - చీర యే'? లనుచు

నొప్పుగా సరిగెపు - వ్వల చీరఁ గట్టి,
యప్పు డా భరణంబు - లన్నియుఁ బెట్టి,

కులుకుగా నుదుటఁ గుం - కుమరేఖ దిద్ది,
కలికి కన్నులఁ దానె - కాటుక దిద్ది,

కుచకుంభముల నిండఁ - గుంకుమఁ బూసి
'యిచట నుండ సహింప, -దింతి! ర'మ్మనుచు

మన్నించి కేళికా - మందిరమ్మునకు
నన్నుఁ దోడ్కొని పోయి - నానా క్రమముల

భావజుకేళికిఁ- బ్రార్థింప, నతని
నే విడనాడఁగా - నెనరుతోఁ జక్రి

'యింతి! నీ వలిగిన - హేతు వే?' మనినఁ
'బంతంబుతో నీవు - పారిజాతంబు

మొనపి రుక్మిణి కిచ్చి - ముచ్చువై వచ్చి
ఘనముగా నే మెఱుం -గని వాని వలెనె

'ఇపుడు నీ వలిగివ - దేమి, యే?'మనిన
కపటాత్మ! నిను నమ్మఁ - గావచ్చు నటర?'

అనుచు నేఁ గోపించి - యటు ముఖంబైనఁ,
గని పకపక నవ్వి - కనకాంబరుండు

'అలివేణి! నీ వింత - యలుగఁగా వలెనె?
పొలఁతి! రుక్మిణి కొక్క - పుష్ప మిచ్చితిని,

నీవు గావలెనంటె - నెళవుగాఁ దెచ్చి
వేవేగ నే సుర - వృక్ష మిచ్చెదను;

కంతుని బారి కె -క్కడఁ దాళలేను
కాంతాలలామ! నీ - కౌఁగిలి'మ్మనిన

మాటఁ దప్పఁడటంచు - మదినెంచి కపట
నాటకుఁడగు హరిన్ - నమ్మి కూడితిని,

అప్పటి కా మాట - లాడి నన్ గూడి,
యిప్పు డిందుండ న - హింప కాశేష

ధరణీ ధరేంద్రుఁ డా -తరిగొండ నృహరి
కరుణ నా యెడ లేక - కపటంబుఁ జేసి,

దొరకొని నేను ని - ద్దురఁ బోవుచున్న
తఱి లేపి చెప్ప, కా - తరుణులకడకుఁ

బోయినాఁడేమొ? తె - ప్పున నీవుఁ బోయి
తోయజాక్షుని వేగఁ - దోడ్కొని రావె!

## దరువు. ఆదితాళం

వక్ర: తరుణి! నేనీ నవతూల నం - దణిని ధిక్కరించి, యిటకు
హరినిఁ దెచ్చితే యేమిచ్చే - వంబుజేక్షణా? ౧

వత్య: పన్నాగ నే నిపుడు దాల్చి - యున్న చీర, రవికె, సొమ్ము
లన్నీ యిచ్చేఁగాని, తేవే! - చిన్ని కృష్ణునీ ౨

వక్ర: అయితే తారిగొండనార - హరియైన శేషాద్రిపతిని
ప్రియము మీఱ నేనెట్లైన - పిలిచి వచ్చేనే! 3

## *దరువు

వత్య: పోయిరావే! కృష్ణుని కడకూ - పోయిరావే! ॥పల్లవి॥

పోయిరావే! యిపుడు - జాగేలను?
తోయధి శయనునిఁ - దోడ్కొని రావే! ॥పోయిరావే!॥ ౧

వక్ర: పోదునటవే? కృష్ణునిఁ బిలువా - పోదునటవే? ॥ పల్లవి॥
పోదునటవే? గొ - బ్బునఁ బద్మాక్షుని
సాదర హృదయుని - శౌరినిఁ బిలువా ॥పోదునటవే॥? ౨

వత్య: ఆలస్యముఁ జేయక యిచటికి వన
మాలినిఁ దెచ్చిన - మంచిదె చెలియా! ॥పోయిరావే!॥ 3

వక్ర: మందర ధరునిఁ బు - రందర వినుతుని
నందసుతుని గో - విందునిఁ బిలువా ॥పోదునటవే?॥ ౪

---

ఈ సంవాద దరువులో ఉభయపాత్రల సంభాషణకు తగినట్లుగా రెండు వేర్వేరు పల్లవులు నెలకొల్పబడియున్నవి.

సత్య: ధీరుని జలధిగ - భీరుని జగదా
ధారుని నిగమ వి - హారునిఁ బిలువా ॥పోయిరావే॥ ౫

వక్ర: ఖ్యాతిగ శ్రీ వేం - కట గిరివాసుని
శ్రీ తరిగొండ నృ - సింహునిఁ బిలువా ॥పోదునటవే?॥ ౬

సత్య: తే.గీ. తోయజేక్షణ! తడవేల? పోయిరావె!
వక్ర: పోయి హరిఁ జూచి యేమందుఁ బువ్వుఁబోణి?
సత్య: అతనితో సత్యభామ నన్నంపె ననవె!
వక్ర: మంచి, దట్లని యేమందు మగుడి నేను? 67

సత్య: ద్విపద. 'వినవె! చెప్పెద నది - విశదంబుగాను
పనిఁబూని శ్రీకృష్ణు - పాలికిఁ బోయి

అకలంక భక్తితో - నంజలిఁ జేసి
ముకుళిత హస్తవై - ముందఱ నిలిచి

'శ్రీమానినీలోల! - చెలఁగి మా సత్య
భామతో నీవు చె -ప్పక వచ్చినావు

గనుక నిన్నందెందుఁ - గానక, కేళి
వనములో వెదుకంగ - వచ్చె'నేఁడనుము

'తనరారఁ బారిజా - తముఁ దెచ్చియిత్తు
నని బొంకి వచ్చినా -వట! యిదే?' మనుము

'అరయ నీ వంటి మ - హాదైవమునకుఁ
బరఁగ దబ్బఱలాడఁ - బాడిగా'దనుము

'ప్రియముతోఁ బిలువనం -పెను సత్యభామ
రయమున నిఁక లేచి - రమ్ము నీ' వనుము

'సురపారిజాతంబుఁ - జూచినఁ గాని
యఱచేత నే నన్న - మంట' నటంచుఁ

తెలఁగి ప్రతిజ్ఞఁ జే-సిన దివ్య తనుము
వెలఁది! ఘాఁటి మాట - విని యాక్షణమున

*వనపాలిక భక్తితో శ్రీకృష్ణునిఁ బిలిచి వచ్చుట*

నిమిష మెందుండఁడు, - నీవెంట వచ్చు
నమలాంగి! పోయిర ' - మ్మని పూలచెండ్లు

హరికిఁ గానుక యిచ్చి - యంపఁగా నరిగి,
యరయ రుక్మిణి మొద -లగు వధూమణులఁ

జొక్కింపుచున్న కృ - ష్ణునిఁ జేరి చెలియ
మ్రొక్కి, కరంబులు - మొగిచి 'శేషాద్రి

నాయక! తరిగొండ -నరసింహదేవ!
నా యెడ దయయుంచు - నందకుమార!'

యని సన్నుతించి, నె - య్యంబు రెట్టింప
నెనలేని భక్తితో- నిట్లని పలికె.

వక్ర:ఉ.దండము వాసుదేవ! హరి! దండము సూర్యశశాంకలోచనా।
దండము కౌస్తుభాభరణ! దండము ఘోరసురారిభీషణా।
దండము రుక్మిణీరమణ! దండము శ్రీ తరిగొండ మందిరా।
దండము వేంకటాద్రివర! దండము కృష్ణ! ముకుంద!మాధవా।68

శ్రీకృష్ణుఁడు:
క. దీవించితి నే సుందరి
దీవించితి నే మృగాక్షి! తిరముగ దయతో
దీవించితి నే గుణవతి!
దీవించితి నెపుడు నీకు దీర్ఘాయువుగాన్. 69

వక్ర: తే.గీ. స్వామి! గోవింద! మాధవ! సత్యభామ
నిన్నుఁ దోడ్కొని రమ్మని నన్నుఁ బంపె
శ్రీకృ: వెలది! యేమిటి కది నన్నుఁ బిలువనంపె?
నా విధంబెల్లఁ దెలుపు మో యబల! యిపుడు. 70

వక్ర: ఆ.వె. పారిజాతవృక్ష మా రమణికి నీవు
తెచ్చి యొసఁగ, కిటకు వచ్చినావు;
'కాన నీవు రాక గంగామృతముఁ గ్రోల'
ననుచు నీతోఁ జెప్పుమనియె నన్ను. 71

## *శ్రీకృష్ణుని రాక*

తే.గీ. అనిన రుక్మిణి మొదలైన యబ్జముఖులఁ
జూచి కృష్ణుఁడు నగుచు 'నో సుదతులార!
సత్యభామకు సురపారిజాత తరువుఁ
దెచ్చి యిచ్చెదనని పల్కి, వచ్చితిటకు. 72

తే.గీ. అందుకై నన్నుఁ బిలిచిరమ్మనుచు దీని
నంపినది సత్యభామ నెయ్యంబుమీఱ,
నటకు మిము వీడిపోను కాల్గాడ, విపుడు
పోదునో! యుందునో? తెల్పుఁ డేది యైన.' 73

రుక్మిణ్యాదులు:
ఆ.వె. ఆపెకడకె మగుడి యరిగెదనంటె నీ
కడ్డమెవ్వ రిచట నంబుజాక్ష?
ఇంతపనికి మమ్ము నిందఱిన్ రమ్మని
యిటకుఁ బిలువనంపనేల కృష్ణ? 74

శ్రీకృ: ఆ.వె. కొమ్మలార! మీరు కోపంబు చేయకుఁ,
డచటి కరిగి దాని నాదరించి,
చెప్పి, దానిమీఁదఁ దప్పెమో, పిచటికి
క్షణములోన వత్తు సకియలార! 75

రుక్మిణ్యాదులు:
ఆ.వె. ఇచట మమ్ము నుంచి యచటికిఁజని దాని
మాయలోనఁ జిక్కి మమ్ము మఱచి
యుండ, కెదురు చూచుచుండుదు మటుగాన
పోయి వేగ రమ్ము తోయజాక్ష! 76

క. అని కాంతలు సెలవిచ్చినఁ
గనకాంబరధరుఁడు తీవ్రగతి నతివేడ్కన్
వెనరొప్ప సత్యభామిని
ఘనతర సదనంబుఁ జేరెఁ గౌతుక మెసఁగన్. 77

క. వచ్చిన కృష్ణునిఁ గనుఁగొని
చెచ్చెర నా సత్యభామ చిడిముడి పడుచున్
మచ్చికను బలుకకుండిన,
ముచ్చట నతఁ డిట్టు లనియె మోహముమీఱన్: 78

## *సత్యా కృష్ణుల సంవాదము*

శ్రీకృ: ఆ.వె. ఏమె ముద్దుగుమ్మ! యిన్నాళ్లవలె నీవు
నవ్వి మాటలాడ, వివ్విధమున
కోపమేల వచ్చెఁ? గులుకు బంగరు బొమ్మ!
సరస సుగుణ ధామ! సత్యభామ! 79

సత్య: తే.గీ. నిన్న ఘనపారిజాతంబు నీకుఁ దెచ్చి
యిత్తునని, నేటి కా మాటలెల్ల మఱచి,
నన్నుఁ జొక్కించి యచటికిఁ జన్నయపుడె
చాల ముదమయ్యె; నిఁక కోపమేల? కృష్ణ! 80

## *కంద దరువులు. ఆటతాళం*

శ్రీకృ: కంద. విలసిత నిర్జర భూజము
పొలుపలరఁగ నీకుఁ దేకపోయితినటవే?
కలఁకఁబడి నమ్మఁజాలక
యలికుల నిభవేణి! యంత యలుగుదురఁటవే!

దరువు. అలుగూదురటవే? సారెకు నన్ని - ట్లళికింతు రఁటవే?
కలికి! చిలుకల కొలికి! - మొలకనవ్వులు గులుక
పలుకు పలుకుకుఁ దేనె - లొలుకఁ బలుకక,యంత
యలుగూదురటవే? సారెకు నన్నిట్లళికింతురఁటవే?॥ ౧

సత్య: కంద. అళికించుటకును, కన్నులు
బెళికించుట, కలసి సొలసి బేలించుటకున్
కులుకులు, తళుకులు చూపను
కలకంఠులు నీకుఁ జాలఁ గలరటుపోరా!

దరువు. కలరాటు పోరా! నన్నుండి సు-ఖంబేమి లేరా!
వలచి వలచి, నిన్ను - వలపించుకొనునట్టి
మొలక నవ్వుల ముద్దు - మోహనాంగులు నీకు
॥కలరాటు పోరా! నన్నుండి సుఖంబేమి లేరా!॥ ౨

శ్రీకృ:కంద. ఎందఱు కామిను లుండిన
నందఱు నీ సాటివారలని యెపుడైనన్
డెందమునఁ దలఁప; నూరక
యిందీవరనయన! కోపమెందుకు లేవే!

దరువు. ఎందూకు లేవే! దయతో నన్నూ - పొందూదు రావే!
మందస్మితానన! - మాటిమాటికి నన్ను
నిందించి విడనాడ - నీతిగా, దీ కోప
॥మెందూకు లేవే? దయతో నన్నూ- పొందూదూ రావే!3

సత్య: కంద. 'పొందుదు రా ర'మ్మనుచును
నందాత్మజ! నన్నుఁ బిలువ న్యాయముగా, దా
సుందరులఁ బిలువు, మాపని
కందఱు నిన్నెనసియుందు రందిఁక పోరా!

దరువు. రందీఁక పోరా! నా యెడమోహ-మెందూకు లేరా?
కందర్పకేళికి - కలకంఠు లీ వేళ
కెందరో నీరాక - కెదురు చూచుచునుందు
॥రందీఁక పోరా! నా యెడ మోహమెందూకులేరా?॥౪

శ్రీకృ:కంద. మరుఁడేయు పుష్పశరములు
చుఱుకుఁ జుఱుక్కున నురమున నూటిగ నాటఁన్
తరళత్వ మధికమాయెను
మఱి మఱి నన్నే చఁదగదె మరువపుమొలకా! ౫

## దరువు

మరువపు మొలకా! కౌఁగిలీవే!- మన్మథు చిలుకా!
తరిగొండపుర నార - హరియైన శ్రీశేష
గిరివాసుఁ డగు నన్ను కరుణించుచును మేలి
॥మరువపు మొలకా! కౌఁగిలీవే!- మన్మథు చిలుకా! ౬

సత్య: కం. హరి! నే నిద్దుర బోయెడు
తఱి లేపక, చెప్ప కటకుఁ దరలిన యపుడే
గుఱుతుగఁ దెలిసితి నీ గుణ,
మఱమర లిఁకఁదీఱ నేర వరుగర! కృష్ణా!

దరువు. అరుగార! కృష్ణా! నా పై నీకు - మరులేల కృష్ణా?
తరిగొండాధిప! శేష - గిరివాస! నీమాయ
లెఱుఁ గాక కవగూడి - యింతైతి నచ్చాటి,
॥కరుగార! కృష్ణా! నా పై నీకు - మరులేల కృష్ణా?॥ ౭

శ్రీకృ: కం. అచ్చటి కరుగర! యనుచును
విచ్చనవిడిఁదూలనాడి విడిచెదవైతే,
ఇచ్చట నాపని యేమిఁక?
నచ్చటికే పోదునఁటవె యళికులవేణీ? 81

## దరువు

సత్య: ఇంతగా బెదిరించే - వేరా! కృష్ణా? యిదేర! కృష్ణా?
వింత మాటలాకు నే - వెఱ తూనే కృష్ణా? ౧

శ్రీకృ: ఇంతీ! నే వచ్చిన - దిందుకే నటవే? ఇందుకేనటవే?
చింతా యేమ ట్లైతే - సెలవిస్తి వటవే? ౨

సత్య: అప్పుడు నాసెలవూన-నరిగితివఁటరా?నీవరిగితివఁటరా?
యిప్పుడు నా సెల వడిగేదిది-యేటి నటనరా? 3

శ్రీకృ: అప్పుడే నపరాధి-నైతినే బాలా! నే నైతినే బాలా!
ఇప్పుడా మాటాలు-చెప్పేదే మేలా? ౪

సత్య: ఈ తప్పు మఱచేనా-యిందిరాధీశా? వో యిందిరాధీశా!
శ్రీ తారిగొండేశా! శ్రీ వేంకటేశా! ౫

శ్రీకృ: తే.గీ. ఎంత వేడినఁ గాని నీకింత కరుణ
రాకపోయెను, దోషంబు నాకు లేదు,
నీమనసు, పోయివచ్చెద నిక్కముగను
చాల నాయెడ దయయుచు సత్యభామ! 82

## *శ్రీకృష్ణుఁడలిగి పోవుట-సత్యభామ సంతాపము*

క. అని పల్కి యలిగి కృష్ణుఁడు
వనమున వసియించి యున్న వనితల కడకున్
చని, వారి నెనసి వేడ్కను
గొనకొని సుఖలీల నిష్టగోష్ఠిగ నుండెన్. 83

ద్విపద. హరి యల్గిపోవుట - కా సత్య భామ
పరితాపమునఁ బొంది - బహుభీతి జెందిఁ

చెలి నొక్కదానినిఁ - జీరి యిట్లనియె:
'నెలనాఁగ! శ్రీకృష్ణుఁ - డీచటికి వచ్చి

గౌఁగిలిమ్మని - నానా విధముల ననుఁ
మొనసి ప్రా ర్థింప నే - మూర్ఖంబుఁ జేసి,

యా దయా పరమూర్తి - నా ధర్మవర్తి
నా దీనమందారు - నక్కటా! నేను

విడనాడి పొమ్మన్న - విరసంబు చేతఁ
జిడిముడిపడి, మోము - చిన్న చేసికొని

పోయినప్పటినుండి- బుగులు పుట్టినది,
కాయంబు మితిలేని - కంపమొందినది,

మనములో బలు జాలి - మాలి మించినది,
కనుల బాష్పంబులు - గార సాగినవి,

ఏనేమి సేయుదు? - నిఁకఁ దాళ లేను
గాన, నెట్టైన వేం - కటగిరీశ్వరుని

నను నేలు తరిగొండ - నరసింహు నిటకు
గొనకొని నీవు తో - డ్కొని రావె! చెలియ!'

చెలి: క. వచ్చిన హరి నటు పొమ్మని
చెచ్చెర ననుఁ బిలువు మనిన ఛీ పొమ్మనకన్
మచ్చిక నప్పటి విధమున
వచ్చునటే సత్యభామ? వర గుణ ధామా! 84

క. అని చెలి పలుకఁగ, ఖేదము
మనమునఁ బెనఁగొన, మదన మార్గణతతికిన్
తనలో నులుకుచు, నళుకుచు
ఘనతరతాపమున దానిఁ గని యిట్లనియెన్: 85

## దరువు. ఆదితాళం

సత్య: నే తాళలేనే వోయమ్మా! కృష్ణా
నీ వేళఁ దేవే వోయమ్మా! ॥పల్లవి॥

కలకంఠము, లళి - బలములు, చిలుకలు,
కలువల దొరయును - గారించుట కిఁక ॥నే తాళలేనే!॥

నిగుడుచు మలయా - నిలుఁడును, మరుఁడును
పగవారై నను - బాధించుట కిఁక ॥నే తాళలేనే॥

ఖ్యాతిగ ఘన వేం - కటగిరి వాసుని
శ్రీతరిగొండ నృ - సింహునిఁజూడక ॥నే తాళలేనే!॥

ఉ. తాళని వీరుఁడై పదరి దర్పకుఁ డాగ్రహవృత్తిఁ జూపుచున్‌
తాలిమి లేక వచ్చి పటు దారుణ బాణము లేయసాగె, నీ
వేళ సరోజలోచనుని వేడుకగాఁగవగూడ కుండినన్‌
తాళవశంబె యీ విరహ - తాపము దీఱునె మానినీమణీ? 86

చెలి:ఉ. తాళ వశంబు గాదనుచుఁ దల్లటపొందెద విప్పుడార్తి, నా
వేళ దయార్ద్ర చిత్తమున వేడిన నించుక సడ్డసేయకన్‌
తాలిమి లేని మాటలని తక్కక పొమ్మనినావు గావునన్‌
హేళి శశాంక నేత్రుఁడిట కెందుకు వచ్చునె యింక భామినీ?87

సత్య: క. తరిగొండాధీశ్వరుఁడగు
నరహరి యే రీతినైన నా నేరములన్‌
మఱచి యిటు రాకయుండినఁ
దరుణీమణి! నిమిష మింకఁ దాళఁగలేనే! 88

## దరువు. అట తాళం

తాళలేనే! వో యమ్మా! అమ్మా!
నే తాళలేనే! వో యమ్మా! ॥పల్లవి॥ ౧

తాళఁగలేనే! యీ - వేళ కృష్ణుఁ డు వచ్చి
కేళి సల్పఁగ నాతో -కేడించియుంటినే॥తాళలేనే!॥ ౨
నీ వెట్టైనను - దేవుని ఇచటికి
వేవేగఁ దోడ్తెచ్చి - కావవే! నన్నింక ॥తాళలేనే॥ 3

వెన్నుఁడిదేమో నా - కన్నులఁ గట్టిన
ట్లున్నాఁడు చూడక - యెన్నివిధములా నే ॥తాళలేనే!॥౪

తరిగొండాధిపుఁడైన - వరశేషాచలపతి
నఱఁ జేసి పొమ్మంటి - నతడింక రాక నే ॥తాళలేనే!॥ ౫

చెలి: క. ప్రేమంబున లాలించిన,
వేమఱుఁ బొమ్మనుచు హరిని విడనాడితి; విం
కా మహితాత్ముని రమ్మని
యేమని నేఁ బిలిచి వత్తు నిందునిభాస్యా!? 89

## దరువు. అట తాళం

నత్య: ఏమిసేతు, నేమిసేతునే? అమ్మయ్య! నే
నేమిసేతు, నేమిసేతునే? ॥పల్లవి॥

ఏమిసేతు, నేమిసేతు? -స్వామి నింకెప్పుడు జూతు?
కామిని! వలపెట్లు దాతు? - కాముని నే నెట్లు గెల్తు?
॥ఏమి సేతు॥ ఉపపల్లవి॥

ఏల వానిఁ బొమ్మంటినే? - యేమన్నా గానీ
యెడఁ బాయఁడని యుంటినే!
తాలిమిలే కలిగి శ్రీ - గోపాలుఁ*డచటి కరిగెనే! ని
జాలిమాలి చేత చాల - బేలనైతి తాళఁ జాల
॥నేమి సేతు॥ ౧

అక్కసు వీడక యుంటినే! కావున వానిఁ
గక్కసించి పొమ్మంటినే!
ఇక్కువ దెలియనైతి - మక్కువ చేయక పోతి
ఎక్కువ పోనాడితి - మ్రొక్కక నే మోసపోతి
॥నేమి సేతు॥ ౨

ఇంతగా చలము హెచ్చెనే! నా బుద్ధికి నేఁ
డెంతటి మోసము వచ్చెనే?సంతసమున
తరిగొండ - సామియైన వేంకటేశు
నంతరంగమునకుఁ బిల్చి - యఱకొఱ దీర్చక పోతి
॥నేమి సేతు॥ 3

* అచటికి+అరిగెనే! +అని - అని పదవిభాగము

చెలి: తే.గీ. వెలఁది! విను చల్లలమ్మిన వెనుక నుట్ల
దిక్కుఁ జూచిన గతి గృష్ణు దక్కఱగను
వచ్చినపుడు పోనాడి, మెచ్చి మగుడి
పిలిచినంతనె వచ్చునే బిసరుహాక్షి? 90

## దరువు. ఆది తాళం

సత్య: సఖీ! సఖుని తోడితే గదే! ॥పల్లవి॥

బాలకీ! కలక వీడి రాఁగదే! ॥ఉపపల్లవి॥

ధళధళమని వె - న్నెల గాయా
చిలుకలు కలకల - రవములు జేయా
చెలువలరఁగ నల - కలకంఠంబులు
నళిబలములు మన - మళుకఁగఁ గూసెను ॥సఖీ!॥ ౧

మందపవనుఁ డిం - దతిగా మెలఁగా
శిఖిబృందమ్ముల - నాట్యము చెలఁగా
సందడి చేయుచు - కందర్పుఁడు నర
విందశరమ్ముల - నెదఁ దగఁ జొనిపెను ॥సఖీ!॥ ౨

మరుని చలం బఱి - ముఱిబెరుగా
నా మానస మిటు - మఱి మఱి కరుగా
తరిగొండా ధీ - శ్వరుఁ, డహిగిరివరు
డఱమరఁ జేయను తఱిగా దిప్పుడు ॥సఖీ!॥ 3

చెలి: తే.గీ. ఎత్త గూడని బళువు నీ వెత్తినపుడు
ఏమి సాహసమైన నే నిపుడు చేసి
నీ విభునిఁ దోడితెచ్చెద, నీవు నాకు
లంచ మే మియ్యగలవమ్మ! చంచలాక్షి? 91

## *సత్యభామ శ్రీకృష్ణునిఁబిలుచుకొని రమ్మని చెలినిఁ బంపుట*

### దరువు

**సత్య:** ఓ కొమ్మ! పోవే! ॥పల్లవి॥

అల శ్రీ కాంతుని మ - చ్చిక నిటు దేవే!

॥ఓ కొమ్మ! పోవే!॥ ॥ఉప పల్లవి॥

అందియ లిపు డిచ్చేనే! నా - హారావళు లిపుడిచ్చేనే!
సందిబొందె లిచ్చేనే! నా - సామినిఁ దెచ్చిన నిను మెచ్చేనే!
॥ఓకొమ్మ!పోవే!॥ ౧

మొలగంటలు నిచ్చేనే! కెం - పుల జంపులు నిచ్చేనే!
చిలుకల తాళిచ్చేనే! నా - చెలువునిఁదెచ్చినఁ జీరలిచ్చేనే!
॥ఓ కొమ్మ! పోవే!॥ ౨

తరిగొండాధీశ్వరుఁడూ, శ్రీకర -ఫణిగిరి నాయకుఁడూ
విరసముతో నిటు రాఁడూ, వాని - సరసంబునఁదే నేఁడూ

**చెలి:** తే.గీ. ఇప్పుడిచ్చెదనని నీవు చెప్పినట్టి
సొమ్ము లొక్కటి మనసు రాదమ్మ!నాకు
నే డు నా భావమంతయు నీవు దెలిసి
నేను కోరిన దియ్యవే!నీలవేణి! 92

### దరువు. ఆది తాళం

**సత్య:** ముత్యాల హార మిత్తునటవే? నా బన్నసరము
ముందూగ చేతి కిత్తునఁటవే? ౧

**చెలి:** ముత్యాల హార మొల్ల లేవే! నీ బన్నసరము
ముందుగ నే నొల్ల పోవే! ౨

**సత్య:** పచ్చాల కడెము లిత్తు నఁటవే? ఓ యమ్మా! నా
బంగారుంగరమూ లిత్తునటవే? 3

చెలి: పచ్చాల కడెము లొల్ల లేవే! ఓ యమ్మ! నీ
బంగారుంగరమూ లొల్ల పోవే! ౪

సత్య: అపరంజి గొలుసు లిచ్చే కోవే! శేషాద్రి
వాసుఁ డైనా తరిగొండహరినిఁ దేవే! ౫

చెలి: అపరంజి గొలుసు లొల్ల లేవే! తరిగొండనార
హరినిందు నేఁ దేను పోవే! ౬

## దరువు. కురుచ జంపె తాళం

సత్య: బావిలీ లిచ్చేను కోవే! గోపాలకృష్ణునిఁ దోడితేవే! ౧

చెలి: బావిలీ లే నొల్ల లే వే! గో పాలకృష్ణునిఁ దేను పోవే! ౨

సత్య: చేతి చేకటులైన కోవే! అల్ల చిన్ని కృష్ణునిఁ దోడితోవే! 3

చెలి: చేతి చేకటు లొల్ల లే వే! అల్లచిన్నికృష్ణునిఁదేను పోవే! ౪

సత్య: జీవమణు లిచ్చేను కోవే! మాశేషాద్రిపతి నిందు దేవే! ౫

చెలి: జీవమణులే నొల్ల లేవే! మీ శేషాద్రిపతినిఁదేను పోవే! ౬

సత్య: ధనరాసు లిచ్చేను కొవే! మాతరిగొండ నరహరినిఁ దేవే! ౭

చెలి: ధనరాసులే నొల్ల లే వే! మీతరిగొండ హరిఁదేను పోవే! ౮

చెలి: సీ. అనిశంబు తరిగొండ హరికథల్ వినుటలే
పొలఁతి! కర్ణములకు భూషణములు
ఏవేళ శేషాచలేంద్రునిఁ జూచుటే
పొసఁగ నేత్రములకు భూషణములు
ఘనవిష్ణు నామకీర్తనములు చేయుటే
పొలుపొంద వాక్కుకు భూషణములు
పూని కల్గిన వేళ దానముల్ సేయుటే
బోఁటి! హస్తములకు భూషణములు

తే.గీ. గనుక యీ నాళ్లు గొరెదఁ గమలగంధి!
శాశ్వతము గాని భూషణచయము లొల్ల;
దేవదేవుని నిటకు నేఁ దెచ్చినపుడు
చెప్పి యిప్పించు మవియెల్లఁ జిగురుఁబోణి! 93

సత్య: తే.గీ. హరినిఁ దెచ్చుట నీ భార మతివ! నీకు
వరము లిప్పింప నా భార మిరవు గాను,
పొలఁతి! యిఁక జాగు సేయక పోయి వేగ
మాధవునిఁ దోడితేవె! సమ్మతముఁ జేసి. 94

చెలి: తే.గీ. మచ్చికలరఁగ హరి యిందు వచ్చినపుడు
భామ! నే నిందు లే, నల్ల బయట నుంటి;
నతని నీవేమి యంటివి? యతఁడు మగుడి
యలిగి పోయినదేమమ్మ! కలహకంఠి? 95

## దరువు

సత్య: నందానందనుఁ డిందూ వచ్చి - నను లాలించేనే! వోయమ్మా!
మందెమేళమూన గడుసు - మాటలంటినే! వోయమ్మా!
మందరధరు డందూ కలిగి - మళ్లీ పోయానే వోయమ్మా!
మందయాన! వాని నెపుడు - మగుడీ చూచేనే వోయమ్మా? ౧

గుట్టుగా పతి నన్ను లాలించి - కూడవచ్చెనే! వోయమ్మా!
కట్టిఁడినై నే విడనాడాఁ - గా వాఁ డరిగెనే! వోయమ్మా!
దిట్టనై నే నతని మనసూ - తెలియనైతినే! వోయమ్మా!
పుట్టరానీ బుద్ధి నేఁ డూ - పుట్టి చెఱిచెనే! వోయమ్మా! ౨

తరుణీ! యీ చింత చేతా - తాళఁ జాలనే! వోయమ్మా!
మఱచియుందామనినా -మఱపైన రాదే ! వోయమ్మా!
విరహా మగ్గల మాయే - విభుఁడేలా రాడే వోయమ్మా!
తరిగొండాధిపునీ శేష - గిరి వాసునీఁ దేవే!వోయమ్మా! 3

చెలి: ఆ.వె. చేసికొన్నవారు చేసికొన్నంతయు
నసుభవింపవలయునండ్రు బుధులు,
కొమ్మ! నీవు చేసికొన్నంత యిఁకమీఁద
ననుభవింపు మమ్మ! వనరుహాక్షి! 96

సత్య: క. శాపముఁ బెట్టిన రీతిని
ఈ పల్కులు పల్కనేల? నే గతినైనన్
గోపాలుని నా కన్నులఁ
జూపిన నీ మేలు మఱువ సోమనిభాస్యా! 97

చెలి: క. రమ్మని క్రమ్మఱఁ బిలుచుట
కమ్మమ్మా! వెఱతు, భీతి యగుచున్నది; నీ
వమ్మాధవునకు లిఖితము
సమ్మతిగా వ్రాసియిమ్ము చని హరిఁ దెత్తున్. 98

సత్య: క. మెప్పలరఁగ నా సామికి
ఇప్పుడు లిఖితంబు వ్రాసి యిచ్చెద వేడ్కన్
తెప్పునఁ జని, నీ వాక్యము
తప్పక నా విభునిఁదెవె! తామరసాక్షి! 99

తే.గీ. అనుచుఁ దన కొనగోటితో నందముగను
పసిడిఁ గేదఁగిరేకుపైఁ బంక్తు లమరఁ
దన యభిప్రాయమెల్ల మోదమున వ్రాసి,
యపుడు చెలిచేతి కిచ్చి, యిట్లనియెఁ దరుణి. 100

## *సత్యభామ లేఖ*

సత్య: క. చెలి! నీ వీ లిఖితము మా
నలినాక్షున కిచ్చి, చాల నమ్రత మీఱన్
పిలుచుక రమ్మన, నది చని
ఎలమిన్ పద్మాక్షుఁ జేరి యిట్లని పలికెన్: 101

చెలి: క. దండమయా! జగదీశ్వర!
దండము శేషాద్రి నిలయ! దండము కృష్ణా!
దండమయా! పురుషోత్తమ!
దండము తరిగొండధామ! దానవ భీమా! 102

శ్రీకృ: క. వర్ధిల్లవె! గజగామిని!
వర్ధిల్లవె! పువ్వుఁబోఁణి! వారిజపాణీ!
వర్ధిల్లవె! జలజానన!
వర్ధిల్లవె! కుందరదన! వర్ధిల్లు చెలీ! 103

### *దరువు. జంపెతాళం*

చెలి: శ్రీ మానినీలోల! - చెలువలరఁగాను మా
లేమ నీ కిపుడేమొ - లిఖిత మంపినదీ?

శ్రీకృ: ఆ లిఖిత మిటు తేవె! - మేలిమిగఁ జూచి ప్రతి
గా లిఖిత మొకటి యా - కలికి కంపెదనూ.

చెలి: అఖిలేశ! తరిగొండ - హరి! వేంకటేశ! ప్రతి
లిఖిత మేటికి? నీవె - లేచి రావయ్యా!

క. అని పలికి, లిఖిత మిచ్చినఁ,
గనకాంబరధరుఁడు దానిఁ గైకొని నగుచున్
తన సతులందఱు వినఁగా
నెనలేని ముదంబు మీఱ నిట్లని చదివెన్. 104

శ్రీకృ: ద్విపద. శ్రీమదఖండ ల - క్ష్మీ యుక్తులైన
కామితార్థదులైన - ఖగవాహులైన

సర్వకారణులైన - సర్వజ్ఞులైన
నిర్వాణ పదమార్గ - నిర్ణేతలైన

శరణా గత త్రాణ - సంరంభులైన
సరిలేని హాటకా - చల ధీరులైన

కారుణ్య దివ్యమం - గళ మూర్తులైన
భూరి యాదవకులాం - బుధి చంద్రులైన

అనిశంబు బహుకుటుం - బాధారులైనఁ
దనరారు బంధు చిం - తామణులైన

మహి సత్య వాక్య ప్ర - మాణజ్ఞులైన
రహి నీతి కార్యధు - రంధరులైన

శ్రీస్వామివారికిఁ - జెలి సత్యభామ
భాస్వర వినయ సద్ - భక్తి యుక్తులను

విలసితంబుగఁ బది - వేల ప్రణామ
ములును, సన్నుతులును - ముదము దీపింపఁ

జేసి, చాయంగల - చెలి విన్నపంబు
లీ సప్తమీదిన -మిందు వాసరము

వఱకు నేఁగుశల; మ - వ్వలి తమ కుశల
మఱలేక వ్రాయించి -యంపింపవలయు.

తరువాత మీరు నా -దగ్గఱఁ జేరి
యరమరఁ జేసి య - ట్లరిగిన మొదలు

దండెత్తిన వచ్చి కం-దర్పు డఖండ
చండకాండంబు ల-సంఖ్యలు పఱపి

తెగి మర్మములను భే-దింపుచున్నాఁడు,
జగదధీశ్వర! మీరు-శరణాగతులను

రక్షింతుమనుచుఁ బూ-ర్వమునంద బిరుదు
దక్షకత్వంబున - ధరియించివారు;

గాన నన్నెట్లైనఁ - గడతేర్చు కొఱకుఁ
బూని నా యపరాధ-ములను క్షమించి,

సొలయ కీ లిఖితంబు-చూచినక్షణమె
నిలువక వచ్చి మన్నించి,నన్ గలసి,

పరమపావనమైన-పారిజాతాఖ్య
తరువుఁ దెచ్చిచ్చి పం-తంబు నీడేర్చి,

దుర్వార తాపంబుఁ - దొలఁగింపవలయు;
సర్వజ్ఞులకు విశే -షము వ్రాయనేల?

ఈ వివరంబులు - హృదయమందుంచి,
ఈ వేళ వచ్చి న - న్నెనసి సత్కృపను,

క్రన్నన నా విచా - రముఁ దీర్చు, మింతె
విన్నపంబులు వేద - వేదాంత వేద్య!

తరిగొండ పురధామ! - దానవ భీమ!
చిరసత్కృపాసాంద్ర! - శేషాచలేంద్ర!

క. అని సత్యభామ వ్రాసిన
ఘన లిఖితముఁ జూచి, రాక కమలదళాక్షుం
డొనరఁగ నొక ప్రతిలిఖితము
ననువొందఁగ వ్రాసి, పిలిచి యా చెలి కిచ్చెన్. 105

క. 'చెలి! నీ వీ లిఖితము మా
జలజేక్షణ కొసఁగు' మనిన సమ్మతపడకన్
పలుమఱు నది ' రార'మ్మని
పిలిచిన, రాననియె శౌరి ప్రియరహితముగాన్. 106

తే.గీ. అపుడు చెలి చిన్నబోయి, పద్మాక్షుఁ డిచ్చి
నట్టి పత్రికఁ గైకొని వచ్చె, నపుడు దాని
ముఖవిశేషంబు భావించి, మొనసి సత్య
భామ మనమున భయమంది పలికె నిట్లు: 107

సత్య: తే.గీ. నేను వ్రాసిన లిఖితంబుఁ దాను చూచి
దాని కే ముత్తరము వ్రాసె దానవారి?
తేవె! చూచెద ననుచు సత్తెఱవ చేతి
జాబు గైకొని భక్తితోఁ జదివె నిట్లు: 108

## *శ్రీకృష్ణుని యుత్తరము*
## సీసమాలిక

సత్య: శ్రీ మదఖండలక్ష్మీ మనోహరులైన
విశ్వతోముఖులైన విమలులైన
యఖిలాండ కోటి బ్రహ్మాండ నాయకులైన
సర్వజ్ఞులైన శ్రీ స్వామివారు
శ్రీ సత్యభామ కాశీర్వాదములు పెక్కు
రూఢిఁ జేసితి, మీ నిరుద్ధమునకుఁ
గుశలంబు మాకు, నీ కుశలాతిశయములు
వ్రాసి పంపుచునురావలెను తెలియఁ,
దరువాత నీవు మోదంబుతో వ్రాసిన
లిఖిత వృత్తాంతంబు లెస్స దెలిసె,
చెంతఁ జేరిన వేళ ఛీ పొమ్మ పొమ్మని
'రమ్మ రమ్మని మళ్లి వ్రాసినావు,
మొనసి పొమ్మనిపించుకొని వచ్చి మగుడి నీ
చెంతఁ జేరను నాకు సిగ్గు గాదె?
ఎవ్వరైనను వింటె నవ్వి పోదురు గాని
రాను, దేవకుజంబు దేను ధరకు,

తే.గీ. నీ విధంబులు మది నుంచి యింక నీవు
వ్రాయఁదగు సంగతులు మాకు వ్రాసి పంపు!
మహిగిరీంద్రుఁడ దరిగొండహరి నటంచుఁ
జాల నాయెడ దయయుంచు సత్యభామఁ! 109

క. అని సత్యభామ రయమున
వనజదళాక్షుండు తనకు వ్రాసిన లిఖితం
బనువందఁ జదివి, భయమునఁ
దన చెలితో నిట్టులనియెఁ దల్లడపడుచున్. 110

సత్య: తే.గీ. రోషమున రాను పొమ్మని రూఢిగానె
వ్రాసినాఁ దేమిచేతునే వారిజాక్షి?
చెలి: అతని నీవటు విడనాడి నందువలన
నింత కార్యము పుట్టె నింకెట్టులమ్మ? 111

## దరువు. ఆదితాళం

సత్య: అచ్చట నీతో నంబుజ నయనుఁడు - మచ్చిక నేమనెనే? నీ
చెలి: విచ్చటి కెందుకు - వచ్చితివే చెలి?చెచ్చెరఁ బొమ్మనెనే! ౧

సత్య: పొమ్మననేటికి? పురుషోత్తమ! రా -రమ్మనలేదటవే?
చెలి: నే, రమ్మని పిలిచిన రాజీవాక్షుఁడు - రానటు పొమ్మనెనే! ౨

సత్య: తరిగొండాధీశ్వరుఁ డహిగిరి పతి - యఱమర విడువఁ డటే?
చెలి: నీ, వరుదుగ పో పొమ్మని నందుకు వాఁ - డఱ యిటు
విడుచునటే? 3

సత్య: తే.గీ. వారిజాక్షుండు నేఁ డిందు వచ్చు పనికి
నే యుపాయంబుఁ జేతమే! యింకఁ జెలియ?
చెలి: పొమ్ము పొమ్మన్న దానవే పోయి మగుడి
రమ్ము రమ్మని పిలువవే! రాజవదన! 112

ద్విపద.

అని యిట్లు చెలి పల్కు - నప్పు డా మాట
విని సత్యభామ యా - వెలఁది కిట్లనియె:

'చెలి! విను నను లేపి - చెప్పక తొలుత
తలఁగిపోయె నటంచుఁ - దగని కోపమున

జిడిముడి పడుచు వ - చ్చిన మనోహరుని
మడియనై నే నన్ని - మాట లాడితిని,

కావున నచటకుఁ - గంజాక్షుఁ డరిగె,
నే విధంబునఁ బోదు - నింక నే నటకు?

ఏ మోముతోఁ జూతు నిపుడు మాధవుని?
నేమని పిలుతు నే - నిఁక సిగ్గు లేక,

మంచి, దింతకు నోర్చి -మగుడి ప్రార్థించి
యంచితంబుగఁ బిల్చి - నప్పటికైన,

నప్పుడు పద్మాక్షు - నటు విడనాడి
యిప్పుడు దాఁ బిల్వ - నిది వచ్చె, నెంత

వేసాలమారి యీ - వెలఁది!' యటంచు
నా సాటి సవతులు - నవ్వపోరఁటవె?

కావునఁ బోరాదు - గద! యని యుంటె
భావజుఁ డిపుడింత - పగతుఁ డై నన్నుఁ

బద్దుతో నూరకే - పడియుండనీఁడు
ముద్దుల గుమ్మ! నా - ముందఱఁ బదవె!

నీ వెంటనే వచ్చి - నే సన్నుతించి,
శ్రీ వేంకటేశుఁడౌ - శ్రీనివాసునకు

నా పాలి తరిగొండ - నరమృగేంద్రునకుఁ
గోపంబుఁ దీర్చి తో - డ్కొని వత్తు నిటకు'.

## *సత్యభామ వెళ్లి శ్రీకృష్ణునిఁ బిలుచుట*

### దరువు. ఆదితాళం

సత్య: పదవే! పిలిచి వత్తామూ గో - పాల బాలునీ
॥పల్లవి॥

ఇపుడూ, విదితమూగా సకలమౌని - వినుతా శీలునీ
పదవే! పిలిచి వత్తామూ ॥ఉప పల్లవి॥

వలచీ నన్నూ వలపించీనా - వాసుదేవునీ, ఇప్పు
డలిగీ, రాక యుండే మ - హానుభావునీ ॥పదవే!॥౧

నా కొంగు బంగారమైన - నంద కుమారునీ,
శ్రీ కామినీ మణీ విమల - చిత్తాచోరునీ ॥పదవే!॥౨

నన్నేలిన తారిగొండా - నారసింహునీ, మా
వెన్నూనీ గోవిందునీ శ్రీ - వేంకటేశునీ ॥పదవే!॥ 3

క. అని తన చెలియన్ దోడ్కొని,
కనకాంబరధరునిఁ జేరి ఘన భయభక్తుల్
మనమునఁ బెనఁగొన సిగ్గున
నెనలేని ముదంబుమీఱ నిట్లని పలికెన్: 113

### చూర్ణిక

సత్య: శ్రీమదఖండబోధ ప్రదసకల నిగమ నిగమాంత శాస్త్రపురాణేతిహాస ప్రతిపాద్య సచ్చిదానంద నిత్యపరిపూర్ణ దివ్య మంగళ విగ్రహం, కమాలా పరిగ్రహం. ౧

ఉరుతర పాఠీన కమఠ వరాహ నరకంఠీరవ వటుక పరశుధర కోదండాభరణ సీరహస్త బౌద్ధ కలికి ప్రముఖ వివిధావతారం, సుజనమందారం. ౨

సనక సనందన సనత్కుమార సనత్సుజాతాభిధాన పరమ యోగీంద్ర కోపోదిత శాపసంజాత హేమాక్ష హేమ కశిపు దశకంఠ కుంభకర్ణ శిశుపాల దంతవక్త్ర భీకర గర్వాంధకార ప్రభాకరం, బృందారకజన శ్రీకరం. 3

కమలగర్భ రుద్ర కశ్యప వశిష్ఠ శక్తి పరాశర వ్యాస శుక శౌనక గౌతమాంగీరసాత్రి భరద్వాజ నారద శ్రీ వత్స కౌత్స భృగు జమదగ్ని వాలఖిల్య వాల్మీకి విశ్వామిత్రముఖ్య భక్త బృంద వందిత చరణారవిందం, జగన్మూల కందం. ౪

సహస్ర మార్తాండ ప్రభా భాసమాన నానామణిగణఖచిత నూపుర కింకిణీ మేఖలాంగద కౌస్తుభ గ్రైవేయ హార కుండల మకుట దివ్య కనకాంబరాలంకృతం, దూరీకృత ప్రాకృతం. ౫

శంఖ చక్ర గదా ముసల కౌక్షేయ ధనుర్బాణ ముద్గర భిండివాల పరశు పట్టిస పరిఘాద్య నేక దివ్యాయుధ ధరం శత్రుజన వాతూల మహీధరం. ౬

మగధ మాళవ మళయాళ చోళ నేపాళ కొంకణ ద్రవిడ టెంకణ సాళ్వ సౌరాష్ట్ర సౌవీర కురు కుకురు కోసల పుళింద లాట మరాట ఘో(భో?)ట కర్ణాట కాంభోజ కాశ్మీరాది సకల దేశాధీశ్వరాధీన సమస్త వి త్తాప హరణం,సాధు సంపత్కారణం. ౭

నిరంతర కిసలయ పత్ర కోరక కుసుమ ఫల మిళిత విలసన్మహీజాత పరివృత శేషశైలాగ్ర శాతకుంభ కలశోన్నత గోపుర ప్రాకార మంటపాలయ కవాట శోభితానందనిలయ నివేశం, శ్రీవేంకటేశం. ౮

నిరుపమ నిరుపాధిక నిరాలంక నిష్కళంక నిరామయ నిర్వికారాదిమధ్యాంతరహిత స్వయంప్రకాశం తరిగొండ పట్టణాధీశం భజే ఉహం, భజే ఉహం, భజే ఉహమ్. ౯

క. వందన మాశ్రిత పోషణ!
వందన మహిరా జ శయన! వారిజనయనా!
వందన మనిమిష సన్నుత!
వందన మమృత ప్రదాత! వసుదేవ సుతా! 114

శ్రీకృ: క. నీ కాశీర్వాదమె సతి!
నీ కాశీర్వాద మమల నీరజపాణీ!
నీ కాశీర్వాదమె చెలి!
నీ కాశీర్వాద మలఘు నీల సువేణీ! 115

వత్య: క. రారా! దీనజనావన!
రారా! క్షీరాబ్ధిశయన! రా శశివదనా!
రారా! తరిగొండాధిప!
రారా! శేషాద్రివాస! రారా! కృష్ణా! 116

శ్రీకృ: రానే! మదగజగామిని!
రానే! చిగురాకుఁబోణి! రానే! తరుణీ!
రానే! నారీర త్నమ!
రానే! సుగుణాభిరామ! రానే! భామా! 117

వత్య: తే.గీ. రాను రాననఁగా నేల? రార! కృష్ణ!
శ్రీకృ: అంపు లిఁక జాలు, నేనందు రానె!భామ!
వత్య: అంపులిఁక నేను చేయను రార!కృష్ణ!
శ్రీకృ: రమణి! నేనింక నిను నమ్మి రానె! భామ! 118

## దరువు. ఆదితాళం

వత్య: రంతూలు చేయఁ దలచి - రానురాననేవు కృష్ణా!
యింతా మోమోటము - లేనిదేమి? చెప్పరా! ౧

కృష్ణ: ఎంతో మోహమున నేనీఁ -చెంతఁ జేరివేఁడినప్పుడు
కాంతా! నీ మోమోటలెల్ల - గానుపించెనే! ౨

సత్య: అప్పుడు కూరిమితో నే - నాడిన మాటలు నీవు
తప్పుఁ బట్టనేల కృష్ణా! - దయను జూడరా! 3

శ్రీకృ: తెప్ప తెప్పనా నీ వన్న - కొప్పరింపు మాటలన్నీ
యిప్పటికి మఱపు పుట్ట - దెట్లా వత్తునే? ౪

సత్య: తరిగొండానివేశ! శేష - గిరివాసా!నా నేరములు
మఱచి ప్రోవుమంటె యిన్ని - మాటలేలరా? ౫

శ్రీకృ: ద్విపద: కాంతాలలామ నీ - కౌఁగిలిఁ గోరి
యంతగా నే వచ్చి - నపుడు పోనాడి,

వనిత నీవిపుడు పి - ల్వఁ గనె వచ్చుటకు
వనితామణులు లేని - వాఁ డను గాను,

ఏ రీతి నైన నే - నిఁక వత్తు ననిన
ఈ రుక్మిణీదేవి - యీ జాంబవతియు

ఈ కల్కి కాళింది - యీ మిత్రవింద
ఈ కోసలాత్మజ - యీ ముద్దు భద్ర

ఈ లక్షణయు, రాధ - యింక నన్నుచటి
కేల రానిత్తురే? - యెందుకీ భ్రమలు?

మును నీవు నన్నన్న - మూర్ఖవాక్కులకు
గొనకొని వీరెల్లఁ- గ్రోధించినారు,

కావున ననుఁ బిల్వఁ - గా రాదు నీవు
వేవేగ లేచిపో - వే! సత్యభామ!'

యని తరిగొండేశు - డహిశైల విభుడు
మొనసి పొమ్మనఁ గ న-మ్ముదిత యిట్లనియె:

సత్య: ఏమిరా! కృష్ణ! నీ - వింతుల జూపి
వేమఱు నన్నింత - వెఱపింప నేల?

విడువు! నీ కంటె నే - వెఱ్ఱతునుగాని,
జడుతునా కలనైన - సవతుల కేను?

నా పంత మెఱుఁగవా? - నాటినుండియును
నీ పక్షపాతమే నేఁ - డింత చేసె,

తరిగొండ హరి! యిట్లు - ధర్మంబుఁ దీర్ప
నెఱవాదివైతివి - నీ కేమి కొదువ?

చాలుఁ జాల్ పొమ్మని - సవతులఁ జూచి
యా లలితాంగి యి - ట్లనియె రోషమున:

## దరువు. అటతాళం

**సత్య:** ఏమేమే! మీ క్రోధ - మెట్టిదో? చూపరే! సవతులారా!
**సవతులు:** నీ, మోముఁ జూచిన పాప -ములు వచ్చునఁట! పోవే!
సత్యభామా! ౧

**సత్య:** ఈ మాట మీరనే -హేతువుఁ జెప్పరే! సవతులారా!
**సవతులు:** నీ వీ, శ్రీమాధవుని సరకు - సేయనిదె హేతువు
సత్యభామా! ౨

**సత్య:** ఇటువంటి యిచ్చక - మెన్నాళ్లు చేసేరే? సవతులారా!
**సవతులు:** నీలో, కుటిలాముఁ దెలుసుఁ గ్ర - క్కున లేచిపోవే!
సత్యభామా! ౩

**సత్య:** వనజోదరుని తోడు - కొనిపోక పోదునా? సవతులారా!
**సవతులు:** నీ,నెనరు దెలిసె నింక - నీ యింటి కంపామే!
సత్యభామా! ౪

**సత్య:** వరశేషగిరివాసు - నఱ వీడనీయరటే?సవతులారా!
**సవతులు:** ఇంక, తరిగొండాధిపుఁ - దరమర వీడి రాఁడె! వో
సత్యభామా! ౫

ద్విపద: అని సవతులు పల్కి - నట్టి పల్కులను
విని సత్యభామ బల్ - వెలవెలఁ బోయి

'యేమిరా! కృష్ణ! నీ - యింతుల చేత
వేమఱుఁ దిట్టించి- వింతఁ జూచెదవు,

ప్రేమ మీఱఁగ నిన్నుఁ - బిలువ నే వచ్చి
యీ మాడ్కి గౌరవం - బిందుఁ బొందితిని;

ఇంతియే చాలు, నా - కింకేమి కొదువ?
సంతోష మాయె, న - చ్చటి కింకనైన

వచ్చెదవో, లేదొ? - వర పారిజాత
మిచ్చెదవో, లేదొ? - యిప్పుడే దెల్పు'

మన విని తరిగొండ - హరి వేంకటేశుఁ
డెనలేని దయ దాచి - యిట్లని పలికె:

శ్రీకృ: తే.గీ. తరళలోచన! పారిజాతంబు నీకు
దె తెచ్చి యిచ్చెదనని నేను వచ్చినపుడు
నీవు నన్నట్లు విడనాడినావు గనుక
రాను, మహీజమున్ దేను పోవె! 119

సత్య: క. రావఁటరా? జగదీశ్వర!
రావఁటరా? విమలకుంద-రదన! నిజముగా,
రావా? తరిగొండాధిప!
రావా?శేషాద్రివాస!రావా?కృష్ణా! 120

శ్రీకృ: క. రానటు పోవే! భామిని!
రానటు పో మధురవాణి! రానే!తరుణీ!
రానటు పోవే!సుందరి!
రానటు పోవే!లతాంగి!రానటు పోవే! 121

సత్య: క. విలసితముగ నా నగరికి
సెలవఁటరా? వాసుదేవ!చిన్మయరూపా!
సెలవా? తరిగొండాధిప!
సెలవా! శేషాద్రివాస! సెలవేనఁటరా? 122

శ్రీకృ: క. ఇమ్మాడ్కి నడుగనేటికి?
సమ్మతమైనట్లు నీవు సదనంబునకున్
నెమ్మదితోఁ జనుమిప్పుడు,
ముమ్మాటికి సెలవు నకుముద్దులగుమ్మా! 123

సత్య: ద్విపద.'భళి!భళి! కృష్ణ! నీఁభావంబు దెలిసెఁ
గలహప్రియుండవు-కఠిన చిత్తుఁడవు,

గణన చేయఁగరాని-కపటాత్ముకుఁడవు,
గుణ హీనుఁడవు, సత్య-గుణుఁడవే నీవు?

గాయకత్వంబునఁ- గడ ముట్టినావు,
మాయావివై మాఱు-మసలుచున్నావు;

అది యెట్ల నంటె నే-నలిఁగిన వేళ
సదయునివలె వచ్చి-చాల బేలించి

'సతి! నీకు నేఁ బారి - జాత వృక్షమును
హితవుతోఁ దెచ్చి నే - ని చ్చెద' ననుచు

పలికి బొంకితి, వింత - పాపంబు గలదె?
జలజాక్ష! యీ కీర్తి - చాలదే నీకు?

తరిగొండ నరహరే - ధర్మజ్ఞుఁ డనెడి
నరుల నిశ్చయమెల్ల - నగుబాట్లు గాదె?

మేలాయె!' నని చాల - మెండొడ్డి పలికి
యా లేమ. తన చెలి - కప్పు డిట్లనియె.

## *సత్యభామ మరలిపోవుట*

### దరువు. ఝంప తాళం

సత్య: జలజాక్షుఁ డీరీతి - చలపట్టినాఁ డిచట
పాలఁతి! మనపని యేమి? - పోదాము రావే! ౧

సాటి సవతుల కెల్ల - చల్లనాయె హృదయములు
బోటి! మన నగరి కిఁ క - పోదాము రావే! ౨
వరదండశూకగిరి - వాసుఁ డగు తరిగొండ
పురధాము మది దెలిసె - దాము రావే! 3

క. అని పలికిఁ జెలినిఁ దోడ్కొని
తన సదనముఁ జేరి, విరహతాపముచేతన్
కనలుచుఁ సఖులన్ గని మది
నెనసిన రోషంబుతోడ నిట్లని పలికెన్ 124

### దరువు. ఆహిరి రాగం

సత్య: నేనెంతా బిలిచీనా శౌరి
రాను పొమ్మన్నాఁ డు గదరే! యమ్మలారా!
నాకు, కాని సవతులాకూ నేటి
కానందాము లాయెఁ గదరే! కొమ్మలారా! ౧

ముందూగా వచ్చినా హరినీ
ఎందూకు పొమ్మంటి నయ్యో! అమ్మలారా! సవతు
లందూ సందూకోని వానీ
నిందూ రానియ్యరు గదరే! కొమ్మలారా! ౨

తరిగొండాధీశ్వరుని శేష
గిరి వాసూ నేరీతినైనా అమ్మలారా! యిపుడే
సరగూనఁ గూడీగాని
సైరింపా శక్యముగాదే! కొమ్మలారా! 3

కం. అని యిటు మలయానిలమును,
వనజారిని, భావభవుని, వాని బలంబున్
మొనసి శపించెదఁగా కని
యెనలేని చలంబుమీఱ నిట్లని పలికెన్: 129

## *సత్యభామ మలయాలుని శపించుట*
## ఘంటారాగం

ద్విపద. మంచిదిరా!యోరి! - మలయానిలుండ!
మించి పల్మాఱు నా - మీఁదికి వచ్చి

విరహానలముమీఁద - విసరి కీలలను
తిరముగా వృద్ధి బొం- దింపు చున్నావు

కపటివై నా పట్లఁ - గనుక నెట్లయిన,
ఇపుడు నా యుసురు నీ - కెదుగక పోదు,

దిట్టవై నన్ను వే - ధించిన నీకు
బెట్టిన శాపంబుఁ - బెట్టక పోను

హరుఁడైనఁ దరిగొండ - హరియైన, శేష
గిరివాసుఁడైన, యా - గీష్పతియైన

నుపసంహరింప రా - యుగ్రశాపంబు;
విపరీతమగు నట్టి - విధమెట్టులనిన.

## *దరువు. యదుకుల కాంభోజిరాగం-జంపె తాళం*

ఒక్కతలి దంఢ్రికే - నెక్కువై పుట్టినది
నిక్కమైతే నభము - నిను మ్రింగుఁ గాకా! ౧

వసుధలో నేఁ బతి - వ్రత నగుట నిజమైన
ముసురుకొని నిన్ను పా - ములు మ్రింగుఁగాకా! ౨

వరయోగి జనులు కే - వలకుంభకములందు
వెర వెఱఁగి నిన్నుఁ జెఱ - వేయుదురు గాకా! 3

జ్ఞానులగు వారు ని - శ్చయముఁ గాంచిన తఱిని
పూని జడభూతమై - పొయ్యేవు గాకా! ౪

తరిగొండ వాసుఁడగు నురగ - గిరిపతి మతినిఁ
గరుణయుండిన నిన్నుఁ - గడతేర్చుఁ గాకా! ౫

తే.గీ. అనుచు నిన్ని తెఱంగుల నాగ్రహించి
మించి మలయానిలమును శపించి విడిచి
మింటిపై దృష్టి నుంచి, యామింట నున్న
యిందు బింబంబు నీక్షించి యిట్టులనియె: 126

## *చంద్రుని శపించుట*

### ద్విపద - నీలాంబరి రాగం

ఓరోరి చంద్ర! నీ - యురు తీవ్రకిరణ
వారంబు నామీఁద - వరుసగా నించి,

తలఁప నా సవతిసో - దరుఁ డవైనందు
వలన నేఁ డిటువంటి - వైరంబుఁ బెంచి,

పొగిలెడి చింతని - ప్పుల కుప్ప కరణి
తెగువగా నన్ను వే - ధింపుచున్నావు

గాన నీమలిన మి - క్కడఁ గానవచ్చె,
నేనింక నిజముగా - నినుఁ దిట్టి విడుతు

నరుదుగాఁ దరిగొండ - హరి యద్దమైన
పరఁగ నా తిట్టు ద - ప్పదు, తాఁకుఁ గాని.

## దరువు. ఆటతాళం - కాంభోజి రాగం

బెరసి నన్ను సురని - పించితి, వందునఁ జందమామా! నీ
సరసప్రకాశము - సమయు నానాటికిఁ జందమామా! ౧

దిట్టవై నన్ను వే - ధించితి, వందునఁ జందమామా! నిన్ను
-గట్టిగా పెనుఁబాముఁ గఱువాక పోదురా! చందమామా! ౨

తరిగొండాధిపుఁడైన - యురగ గిరీంద్రుఁడు చందమామా!
నెఱవేర్చి చాలా మ - న్నింపాకపోఁడురా! చందమామా! 3

సీ. గురువధూటినిఁ గవగూడినావని నిందఁ
బొందుట చాలదా చందమామ?
అమరులచేఁ దేజ మపహృతంబగు శాప
మందుట చాలదా చందమామ?
క్రూరగ్రహము నోట సారెసారెకుఁ జిక్కి
కందుట చాలదా చందమామ?
మానని మలినంబుతో నిశాచరుఁడవౌ
నందంబు చాలాదా చందమామ?

తే.గీ. వెలయు తరిగొండ హరి రాని వేళ నన్నుఁ
జాల బాధించి లేని దోషంబు కొంత
యిపుడు పొందితి, వా దోష మపరవార్ధి
యందు నిన్ ముంచకుండు నా చందమామ? 127

క. అని కోపాటోపంబున
వనజారిని ధిక్కరించి వారని కినుకన్
తన మది మొనసిన మరుఁ గ
న్గొని యిట్లని పలికెఁ జాలఁగ్రోధము మీఱన్. 128

## *మన్మథ దూషణము*

ద్విపద: ఓ రోరి మన్మథ! - ఓరి పాపాత్మ!
కోరి నా సవతికిఁ - గొడుకవు గాన

చలము సాధింప మ - చ్చర పట్టి నీతి
తెలియక నన్ను వే - ధింపుచున్నావు,

నీచుఁడవై నావు - నీ మాతృవంశ
మే చక్కనిది చూడ - నెట్లన్న వినుము!

జడమతి మీతాత - శాపయుక్తుండు
బడబానలముచేత - బద్ధుఁడై యుండు,

వరుసగా మీ యవ్వ - వడి సుళ్లమారి
వెఱపింపుచుండు నే - వేళ నందఱిని,

నిజగురు సతిఁ గూడి - నీ మేనమామ
త్రిజగంబులందు నిం - దితుఁడగుచుండు,

నిలుక డెక్కడ లేక - నినుఁగన్నతల్లి
చెలరేఁగి జనుల వం - చింపుచునుండు,

నట్టి యిల్లాలిని - నరమరగాఁదొల్తఁ
జిట్టాడి మీ తండ్రి - చే పట్టె గనుకఁ,

గపట మానవుఁడయ్యెఁ, - గ్రమముగా నతని
కిపుడీవు పుట్టితి - విందుచే ధరను

తులువవై, చపల చి - త్తుఁడవైతి వకట!

వసుధలోఁ దరిగొండ - వాసుఁడై వెలసి
యసదృశ శేషాచ - లాధీశుఁ డైన

హరి రాని తఱిని న - న్నాఱడి చేసి
శరము లేసితివి, నే - శపియింతు నిన్ను.

## దరువు

పంచబాణా! ఓ పంచబాణా! ॥పల్లవి॥

పంచబాణా! జ్ఞాన - భానుఁ డుదయంబైన
మంచువలె నీ రూపు - మాయమౌఁగానీ ॥పంచ॥ ౧

నీ విల్లు తునుకలై - నీ రసంబులు గాని
నీ వాఁడి బాణములు - నేలపాల్ గానీ ॥పంచ॥ ౨

నీకుఁ దగు వాహనము - నిలిచి చెఱఁబడుఁగాని
నీ కేతనము సొలసి - నీటఁ గూల్గానీ ॥పంచబాణా!॥ 3

నా పాలి తరిగొండ - నరహరి నిలుచుఁగానిఁ
నీ *పాట్టుదళ మడవి - నిన్ గలియుఁగానీ
॥పంచబాణా!॥ ౪

సీ. సారెకు నామీఁద శరము లేయుట నీకు
మంచిది గాదురా! పంచబాణ!
సవతితల్లి నటంచుఁ జలపట్టు టిది నీకు
మంచిది గాదురా! పంచబాణ!
నాకుఁ గోపమువచ్చి - నను నీకు నిజముగా
మంచిది గాదురా! పంచబాణ!
నన్నుసురనిపించు చున్నా విపుడు, నీకు
మంచిది గాదురా! పంచ బాణ!

తే.గీ. అమరఁ దరిగొండ హరి పుత్రుఁ డనుచు బుద్ధిఁ
దెలియఁ జెప్పితి, నిఁకనైన, దెలిసి బ్రతుకు!
తెలివి లేకయయున్న నీ యలఘు బలము
భానుఁ డుదయించి యణఁచురా! పంచ బాణ!129

---

* సైన్యంలో ఉత్తేజ కరంగా పాటలు పాడేవాళ్ల సముదాయం.ఇక్కడ మన్మథుని 'పాట్టుదళం' కోకిలలు. ఈ 'పాట్టుదళం' అనేది నేట military band లాంటిది.

క. అని యిటువలెఁ దనుఁ దిట్టిన
విని మదనుఁడు చలముఁ జేసి విరిములుకులతో
మొనసి యురంబునఁ జొరఁ గ్రు
చ్చిన నలుకుచు సత్యభామ చెలి కిట్లనియెన్. 130

## దరువు

రాఁడాయెను హరి - యీడ, కీ వేళ దిన
మేడాయెను, బలువేఁ డాయెను వెన్నెల
॥తాళలేనే!॥ ౧

నేఁడా మదనుని - వాఁడి బాణములన్నీ
జోడై నాయెద - సూటిగ నాఁ టెను ॥తాళలేనే!॥ ౨

తరిగొండాధీశ్వరుఁడగు శేషాశైలా
వరునిఁ గూడినా - సరణి మఱపు రాదే! నా మదినీ
॥తాళలేనే!॥ 3

తే.గీ. అనిన నొక కాంత యిట్లనె' నబల! యింత
బేలవై జాలి బొందఁగా నేల మదిని?
ధైర్య ముంచినఁ గార్యంబు, దాన జయము
పొందు; నింక న ధైర్యంబుఁ బొందవలదు!' 131

ద్విపద. అని యిట్లు చెలి పల్కఁ -నా మాటలన్ని
విని సత్యభామ యా - వెలఁ ది కిట్లనియె:

'కంతుని కేళి కు - త్కంఠతో వచ్చి
యంతగా నను వేఁడి - నటువంటి హరినిఁ

జెప్పక పోయిన - చిడిముడిచేత
నప్పుడు నేను పొ - మ్మని పల్కుటకును,

మగుడి పంతము వీడి - మాధవుఁ జేరి
పగవారి ముందఱఁ - బ్రార్థించుటకును,

సారసోదరుఁడందు - నవతులు నవ్వ
నా రీతి నను విడ - నాడినందుకును,

విరసంబు దీఱ కీ - విధమున నిచట
విరహాగ్ని శిఖలతో - వ్రేఁగుచుండుటకుఁ

శుక పిక బంభర - స్తోమంబు లిపుడె
ప్రకటంబుగా నిందుఁ - బల్కుచుండుటకు,

వెలయు నిప్పుల గాలి - విసరుచుండుటకు
నెలఁ త! యీ వేఁడి - వె - న్నెల గాయుటకును

చుఱుకుఁ జుఱుక్కున - సూనబాణములు
దురుసుగా ఱొమ్ములో - దూరుచుండుటకు

తనుమధ్య నాకెట్లు - ధైర్యంబు నిలుచు?'
నని యని వివశయై - యవనిపై వ్రాలి

కనుమూసి నిద్రించు - కైవడినుండి
కనకాంగి యంతలోఁ - గలగాంచి లేచి,

కళకళ పడుచు ను - త్కంఠ దీపింప
జెలిని వీక్షించి మ - చ్చిక నిట్టు లనియె:

## *సత్యభామ స్వప్నము*
## దరువు. ఆదితాళం

సత్య: కలకంఠి! కలా - గంటి నమ్మా!
కలఁ గన్న చంద - మలివేణి! చెప్పే వినవమ్మా!
॥పల్లవి॥

నెలఁతా! నా కల నేఁ డెంతో
నిజమూగ నుండీ నమ్మా ॥ కలకంఠి!॥ఉప పల్లవి॥

నలినాక్షుఁ డిందు వచ్చెనమ్మా!
లే లెమ్మనుచూ నను -లేపి బుజ్జగించె నమ్మా!
కో కొమ్మాని పువ్వుల చెండ్లు చేతి కిచ్చె నమ్మా!
రారమ్మాని నన్నలమీ కౌఁ-గిటాఁ జేర్చె నమ్మా!
అలుకా వద్దాని మదిలో - కలఁ కా దీరిచి నట్ల
॥కలకంఠి॥ ౧

ముద్దాగుమ్మా! రమ్మానె నమ్మా! నా మీద నీకు
పద్దూ లేమీటి కనెనమ్మా! నవ్వాచు మంచి
సుద్దాలు చెప్పమనె నమ్మా!
కద్దూ నీ మీఁద నెనరూ, కల్లా గాదని నట్ల
॥కలకంఠి!॥ ౨

తరుణీ! చింతా యే? లనె నమ్మా! శేషాచలాధీ
శ్వరునీ ధ్యానింపు మనె నమ్మా! తరిగొండ నారా
హరి నిన్ను మెచ్చునానె నమ్మా! సురపారిజాతా
తరువూఁ దెచ్చిత్తునానె నమ్మా!
స్థిరమూగఁ గృష్ణ జపముఁ జేయు నీవనినట్ల
॥కలకంఠి!॥ 3

## *ఎఱుకత (కొఱవంజి) రాక*

ద్విపద: అని సత్యభామ నె - య్యంబుతోఁ జెలికిఁ
దన కల వివరించు - తఱిఁ దత్క్రమంబు

భావించి భారతి - పరమ కల్యాణి
శ్రీవాణి గీర్వాణి - చిగురాకుఁబోణి

జలజల సంభవురాణి - సైకతశోణి
కలిత వీణా పుస్త - క ద్వయ పాణి

విలసిల్లు కొరవంజి - వేషంబు దాల్చి,
చెలఁగు బంగరు బుట్టి - శిరముపైఁ బెట్టి,

తడయక వెండి బె - త్తంబు చేఁ బట్టి,
బుడుతనిఁ బైఁటలో బొందుగాఁ గట్టి,

సరిలేని యెఱుకల - సాని భాషణల,
'యెఱుఖ! యెఱుఖో! దుండి! - యెఱుఖో!'యటంచు

నంగనలార ! గ - ద్దెడగరే!' యనుచు
పొంగుచుఁ 'గోర్కెఁ జె - ప్పెదునె మీ?' కనుచు,

గజ్జె లందెలు కాళ్ల - ఘల్లు ఘల్లనఁగ
ముజ్జగంబులఁ - జాల మోహింపఁ జేయు

చిఱునవ్వు మోముపై - శృంగార మొప్పఁ
'దరిగొండ హరి! శేష - ధరణీధరేంద్ర

వాస! నా యిష్టదై - వము నీవె గనుక
భాసురకరుణతోఁ - బాలింపు' మనుచుఁ

గరమొప్ప నా ద్వార - కాపురంబునకు
సరసమౌ నెఱుకల - సానియై వచ్చె.

## *ఎఱుకత (కొఱవంజి) మనోజ్ఞ వేషము*
## దరువు

వచ్చె నెఱుకతా ॥పల్లవి॥

వచ్చె నెఱుఖో! యెఱుఖ! యనుచును.-వాడవాడల వెంటనూ
హెచ్చుగా శ్రీ సత్య భామిని- కెఱుకఁ జెప్పెద ననుచునూ
॥వచ్చె నెఱుకతా ॥ ఉపల్లవి॥

సిరి గులుకు బంగారు పువ్వుల
- చీర కుచ్చులు నెఱయఁగా.
తఱచుగా దివ్యా భరణములు
- ధళుకు ధళుకున మెఱయఁగా
ఉరుతరములగు మణుల హారము
-లురము మీఁదట నొఱయఁగా
ము రువు మీఱిన సంకుటుంగర
- ములును బలువగ మీఱఁగా
॥వచ్చె నెఱుకతా॥ ౧

పెనఁగొనిన విరజాజి సరములు
- బిల్ల కొప్పున గదలఁగా
ఘనములై చెక్కిళ్లఁ బంజుల
- కమ్మ లందము మీఱఁగా
మొనసి పెదవిని నాణిముత్తెపు
-ముక్కరరుదై వెలుఁగఁగా
కనుల గాటుక, పచ్చబొట్టును,
-గంధలేపన మమరఁగా
॥వచ్చె నెఱుకతా॥ ౨

ఎఱుకడుగ రారమ్మనుచు ఘన
-సరసిజాక్షులఁ బిలుచుచూ
పరఁగ జోలలు పాడి యూచుచు
-బాలకుని ముద్దాడుచూ
శిరముపై బంగారు బుట్టినిఁ
- జేత పలుమఱు నంటుంచూ
సరవి శ్రీ తరిగొండ హరి ఫణి
-గిరినిలయ! శరణనుచునూ
॥వచ్చె నెఱుకతా॥ 3

క. అచ్చెరువుగ నీ విధమున
వచ్చిన కొరవంజి మంజు వాక్యంబులతో
మచ్చికను సత్యభామను
హెచ్చుగదాఁ బల్కరించి, యిట్లని పలికెన్: 132

## దరువు. అట తాళం

యెఱుక శెప్పేనే! దుండి! అవ్వోయవ్వ!
యెఱుక శెప్పేనే! దుండి! ॥పల్లవి॥

ఎఱుక నిక్కముగా నమర భామినుల కెల్లా
గుఱి కట్టుగా శెప్పే కొమ్మాను గనుక, నీ
కెఱుక శెప్పేనే! దుండి! ॥ఉపపల్లవి॥

వింతా మాటలు విన్నావూ, మదిలో నేమొ
సింతా సేయుచునున్నావూ,
సంతోస మొనఁ గూరి - పంతాము లీడేఱి
వంతూ కెక్కను ర - వ్వంతా సైరింపావే!॥యెఱుక॥౧

రతికి నే శెప్పినానే! యెఱుఖా, పా
ర్వతికి నే శెప్పినానే!
మతిమంతురాలాని - సతతాము నను మెచ్చి
హితవూగ తమ సొమ్ము - లిత్తూరు, నీ కట్ల
॥యెఱుక॥౨

పడిగె కొండల రాయఁడూ, శ్రీ
తరిగొండ పతియైనా నరసింగఁడూ
కుడి యె డమలా నిన్ను - కూడుక యుండారు
కడలేని శుభమూలు - కలుగఁ జేశేరు, నీ ॥కెరుక॥3

క. ఎఱుక డుగే కమలేక్షణ!
యెఱుకడుగే! రాజవదన! యిభవరయానా!
యెఱు కడుగే! నారీమణి!
యెఱకడుగే! పువ్వుఁబోణి! యెఱుకడుగె! సతీ! 133

## దరువు. ఆది తాళం

పద్దు లీడేఱిశేనీ - భామాలలామ! నన్ను
గద్దెడుగవే! దుండి! - గద్దెడుగవే!

సఖ్ఖెరబొమ్మా! నీవు - సఖ్ఖిగా నా బుట్టికి
మ్రొఖ్ఖెడుగవే! దుండి! - మ్రొఖ్ఖెడుగవే!

అల తారిగొండా హరినీ - అహిగిరి వరునీ మదిని
తలశడుగవే! దుండి! తలశడుగవే!

వ. అనిన విని సత్యభామ కొఱవంజిని జూచి' నీ వెవ?' రని
యడిగిన, కొఱవంజి యిట్లనుచున్నది: 134

## * కొఱవంజి చమత్కారోక్తులు*

## దరువు. ఆదితాళం

యెఱుఖా సెప్పేవార మోమే! - యెఱుఖా సెప్పేవార మోమే!
యెల్లా లోకాములలో మే - మె ఱుఖా సెప్పే వారమూ ॥పల్లవి॥

ధరకాట భరకాట కల్ల - తబ్బిబ్బు గాకుండా, నిజము
నెఱుఁగఁ దగ్గ వారికెల్ల - నెఱుఖా సెప్పే వారమూ
॥యెఱుఖా సెప్పేవార మోమే! ॥ఉప పల్లవి॥

లోక పాలకూలకూ, సు - శ్లోకులైన మౌనులాకు
నేకాదశ రుద్రులాకూ - నెఱుఖా సెప్పే వారమూ ॥ యెఱుఖా॥౧

అష్టావసువూలాకు, ద్వాద - శాదిత్యులా, కవనీసురుల
కిష్టాముగా నిరత - మెఱుఖా సెప్పే వారమూ ॥ యెఱుఖా॥ ౨

సురసిద్ధ చారణ విద్యా - ధర యక్షా కిన్నర భుజగ
గరుడ గంధర్వాదులాకు - నెఱుఖా సెప్పే వారమూ ॥ యెఱుఖా॥3

యోగులాకు, త్యాగులాకు - భోగులాకు, భాగవతుల
కీ గతులా నుండుఁడాని - యెఱుఖా సెప్పే వారమూ॥ యెఱుఖా॥४

ఉరగాశైలా ధీశుఁడైన - తరిగొండా నారసింహుని
యిరవూగా పూజించుఁడాని - యెఱుఖా సెప్పేవారమూ, మే
॥మెఱుఖా॥ ५

క. అని పలికిన కొఱవంజినిఁ
గనుఁగొని యా సత్యభామ - గౌరవమెసఁగన్
తనతో సరిగా గద్దియ
నెనలేని ముదము నుంచి, యిట్లని పలికెన్. 135

## దరువు. ఝంపెతాళం

సత్య: ఏమె! వో కొఱవంజి - యెందుండి వచ్చితివి
యేమి నీ పేరు? నా - కెఱిగింపవమ్మా! ०

కొఱ: యెలమి పై కొండనుం - డిచ్చటికి వచ్చితినె!
పలుకు సింగెందురే! - భామ నా పేరు. ౨

సత్య: కంజాక్షి నీ పేరు - ఘనతరంబుగ వింటి
మంజు భాషిణిరొ! నీ మగని పేరేమే? 3

కొఱ: చెలఁగి యీ పేరంటెఁ - జెప్ప సిగ్గగు, నైన
నలువయను సింగఁడే - నా మగని పేరూ ४

సత్య: అత్తమామల పేరు - లనువందఁ జెప్పవే!
మత్తేభయాన! విన - మనను పుట్టినది ५

కొఱ: చెలువ! తరిగొండనర - సింగఁడే మా మామ
మలయు కలుముల సింగి మా యత్తపేరు. ౬

సత్య: తే.గీ. కొడుకు లెందఱె నీకు నో కోమలాంగి?
కొఱ: ఎందఱో లెక్క పెట్టలే నిందువదన!
సత్య: ఇంతి! యీ పట్టి పేరేమి? చెప్పవమ్మ!
కొఱ: పడతి! విను చివ్వఁ, డింతె యీ బుడుతపేరు. 136

సత్య: తే. గీ. సుదతి! నీ వెన్ని దేశముల్ చూచినావు?
తెలుపు నీ వని పలుకఁగా జలజనయన
చాల ముదమంది, సకల దేశముల పేర్లఁ
జెలువ మలరఁగఁ దానిట్లు చెప్పఁదొణఁగె: 137

కొఱ: ద్విపద. పంకజేక్షణ! విను - బంగాళ, మగధ,
కొంకణ, సౌరాష్ట్ర, - కోస, లావంతి,

మాళవ, నేపాళ, -మళయాళ, పాండ్య,
చోళ, టెంకణ,సింహ,-శూరసేన, శక,

గాంధార, లాటాంధ్ర, - కర్ణాట, భోట,
సింధు, పుళింద, కా - శ్మీరాదులైన

వివిధ దేశంబులు - వింతగా దిరిగి
వివిధంబులైనట్టి - విద్యలచేత

పరఁగ నందఱి నోళ్లఁ - బడి విజృంభించి,
యిరవుగా నే రచ్చ - కెక్కియుండుదును;

గాన మా యత్తయౌ - కలుముల సింగి
నానా విధంబుల - ననుఁ బరీక్షించు,

నే నున్న చోటుల - నిలువక తిరుగుఁ,
దా నున్న చోట్లకే - తరుణి నన్ బిలుచు;

నేను తా నొక దిక్కు - నిలుచుటె యరుదు,
పూని నిల్చిన మహా - ద్భుతముగా నుండు;

మానిని! యిపు డిన్ని - మాటలే మిటికి?
ఆనంద మెసఁగ న - న్న డుగవే యెఱుఖ;

పొసఁగ దచ్చనయు, తాం - బూలంబుఁ బెట్టి
యసమాన నయిన న - న్న డుగవే యెఱుఖ;

ఉరగేంద్ర గిరి వాసు - నూహించి మదిని
తరిగొండ నరహరిన్-తలఁచి వేడుకొని

బంగరు చేటలో - బల్మితోఁ దెచ్చి
పొంగుచు ముత్యముల్ - పోయవే! దుండి!

## *కొరవంజి యెఱుక చెప్పుట*

తే.గీ. అనిన విని సత్యభామ నెయ్యమునఁ బైఁడి
చేటలో ముత్యములు పోసి 'బోఁటి! మదిని
కల్గుకోరికఁ జెప్పు శీఘ్రముగ' ననిన
చెలఁగి కొరవంజి దేవుళ్లఁ దలఁచె నిట్లు. 138

మంజరి. శ్రీ వెంకటప్పయ్యా! - చెంచూల వోబా!
శ్రీ కాశి విశ్వేశా! - శ్రీ శైల మల్లా!

శ్రీ కాళహస్తీశా! - చెంగల్వరాయా!
మన్నారు రంగా! శ్రీ - మద్దులేటయ్యా!

గోరంట్ల మాధవా! - గోవింద రాజా!
కంచి కామాచ్చెమ్మా! - కనకవల్లెమ్మా!

వాసి కెక్కిన బెజ - వాడ దుర్గమ్మా!
సరస నందవ రాధ్య - చౌడేశ్వరమ్మా!

మధిరే మీనాచ్చెమ్మా - మంగా తాయమ్మా!
కులదైవమైన మా - ఖొల్లాపురెమ్మా!
తరిగొండ హరి యాజ్ఞ - ధరియించి వచ్చి
మన్నించి యందఱు - మంచి వాక్కియరే!

## దరువు. ఆదితాళం

గురుసామి! నీవు నా - గుఱి దప్ప నియకా,నా గుఱి దప్ప నియకా
వరుసాగ నిజమైన - వా క్కియ్యవయ్యా!
దేవళ్లందఱూను నా - దిక్కూకు దిరిగీ, నా దిక్కూకు దిరిగీ
వావిరి సల్లాని - వాక్కియ్యరయ్యా!
తరిగొండాధిప! నీవు - దయతోడ వచ్చీ, నీవు దయతోడ వచ్చీ
వరమిచ్చి సక్కాని - వాక్కియ్య వయ్యా!

ద్విపద:అని యిట్లు దేవుళ్ల - నందఱఁ బిలిచి
పనిఁ బూని కొఱవంజి - పండు ముత్యములు

సొలయక మూడుఁ రా -సులు చేసి, నెఱపి,
చెలఁగుచు మున్మూటుఁ - జె య్యెత్తి మ్రొక్కి,

తన చేత నుండు బె - త్తము 'సత్యభామ!
కొనుము నీ' వని పల్కి -కొనచేతి కిచ్చి,

'నెలఁత! నీ కోరిక లేమొ - నీ మదిలోన
తలఁచి, నా మో మిట్లు - తప్పక చూడు!

కాంత యంటే శెవి - కమ్మ సూపుదును,
కాంతుఁడంటే చుబు - కంబు జూపుదును,

ఆడదానికిఁ గోరి - యడుగుట కాదు,
పోఁడిమితో నొక - పురుషుని కొఱకె

యడిగెద; వతఁ డెవ్వఁ - డంటె నీ మెడను
కడఁకతో నొక బొట్టు - గట్టిన వాఁడె!

వనిత! యొండే రెండె మూఁడు ఝాములకు
పనిఁబూని తరిగొండ - పట్టణాధిపుఁడు

సలలిత వేంకటా - చల వాసుఁడిటకు
వలనొప్ప నిన్నేల - వచ్చునే దుండి!'

యనిన సంతసమంది - యా సత్యభామ
యెనలేని దయతోడ - నిట్లని పలికె:

## దరువు. ఝంపెతాళం

సత్య: వచ్చి యతఁ డిప్పుడొక్క - వస్తువే నడిగితే
తెచ్చి యిచ్చునా, లేదా? - తెలుపవే తల్లి!

కొఱ: అచ్చుగా కృష్ణ జప - మిచ్చటనె పది కోట్లు
మెచ్చఁజేసినఁ గాని - తెచ్చియ్యఁడే, దుండి!

సత్య: తరిగొండ హరి శేష - ధరణీ ధఁరేశ్వరుడు
మెఱయు నా జపనిష్ఠ - మెచ్చునటవమ్మా?

## ఎఱుకు జాతి వచనము

అనిన విని కొఱవంజి యిట్లనుచున్నది. 'వినవే! యవ్వ! నీవు తలంచిన తలంపులు మఱుగుఁ బెట్టి పలుకుసుండావు. అవ్వో యవ్వ! నీతలంపు మా ఖొల్లాపురెమ్మ వచ్చి సెప్పుసుండది. అవ్వో యవ్వ! అది యేమంటే సెప్పే వినవే! దుండి! అవ్వో యవ్వ! వొక్క మేలు కడుగుసుండావు. వొక్క మేలు కడుగుసుండావే! భాగ్యశాలీ!వొక్క మేలు కడుగుసుండావంటె తెలలేదంటే దుండి? తెలలేదంటే అవ్వో యవ్వ! అదిగో! నందనవనంబులో నుండే పారుజాత వ్రిచ్ఛంబు కోరుసుండావే! బూటకాల బిడ్డ! అవ్వో యవ్వ! అవ్రిచ్ఛంబు తపంబు శాయనివారికి లభ్యంబు గాదే! దుండెమ్మా! అవ్వో యవ్వ! అటుగనుక, నీ కలలో పరమపురుషుండు వచ్చి శ్రీకృష్ణజపంబు శేయుమని సెప్పియుండాఁడే

కొడఖ! యిదిగో! నా మాట దబ్బుణో, నిజమో, నీ మనస్సుకు తెలలేదంటే దుండి? తెల లేదంటే దుండి? అవ్వో యవ్వ! యీ కన్న కల లోడంబ రమో, ధసుకో, భుసుకో, కల్లో, కైలాటకమో యని యను మానింపు సుండావే! భాగ్యశాలీ! అవ్వో యవ్వ! యీ కన్నకల కల్లగాదు, కైలాటకము గాదు,ధసుకు గాదు, భుసుకు గాదు, లోడంబరము గాదు, తబ్బిబ్బు గాదు, ధరకట భరకట గాదు, తాలోట్లు గాదు, దబ్బఱ గాదే భాగ్యశాలీ! అవ్వో యవ్వ! నీ కన్న కలలో పరమపురుషుండు వచ్చి శ్రీకృష్ణజపంబు నుపదేశించిన ప్రకారంబున జపంబు శాయవే! దుండి! అవ్వో యవ్వ! ఆ జపంబు శాత శ్రీమన్నారాయణుండైన పడిగెకొండలవాఁడు తరిగి ౦డ నారసింహుఁడై వచ్చి నిన్ను మెచ్చి,పారిజాతంబు తెచ్చి యిచ్చి నీ శెంత నిలిచియుండునే! భాగ్యశాలీ! అవ్వో యవ్వ! ఆ బిడ్డలు అడబిడ్డలో, మొగబిడ్డలోంఠ దుగుతుండావే దుండి! అవ్వో యవ్వ! ఆడబిడ్డలంటే శెవి సూపుదు, మొగబిడ్డలంటే గడ్డంబు సూపుదు. అట్లా ఆండ బిడ్డలు గారు, అట్ల మొగబిడ్డలే కలుగుతుండారే! భాగ్యశాలీ! అవ్వో యవ్వ! నీ హస్తమధ్యమందూ ద్విరేఖ వుండాది. కావున నీవు శ్రీమంతురాల వౌతుండావే! కతల కాచి! అవ్వో యవ్వ ! యిది గాక, నీ శేతిలో ఖడ్గ శంఖ, శూల, గదా, భేరీ రేఖలుండావే దుండి! అందు చాత నీకు పతిభక్తి కలిగియుండునే దుఁడెమ్మా! అవ్వో యవ్వ! అదిగాక, మఱిన్ని, అంకుశ, ధ్వజ, హయ, రథ, భృంగ, యవ, పద్మమాల్య, శ్రీవత్స, స్వస్తికా, గోష్ఠ, తోరణ, మీన, కూర్మ రేఖలు నీ శేతిలో వొప్పసుండావే! భాగ్యశాలీ! అవ్వో యవ్వ! యింతే కాదు, మఱిన్ని నీ కరకమలంబులు మృదువులై యంగుళంబులకు యెడములేక కలిశియుండావే కొడఖ! అవ్వో యవ్వ! అటుగనుక, నీ మగఁడు మహారాజై యుండాఁడు. అవ్వో యవ్వ! యిది శ్రీరేఖ, యిది పురుష రేఖ. యీ రేఖలు రెండూ కూడియుండావి. యిదిగో! యిట్లనే నీ మగఁడూ నీవు కూడి వొద్దికెగా వుంటుండారు. అవ్వో యవ్వ! యీ శ్రీ రేఖకు కొన్ని సంగడిరేఖ లుండావే! యవ్వో యవ్వ! కాగా, నీకు సవతులు పెక్కండ్రు గలిగియుండారే! భాగ్యశాలీ! అవ్వో యవ్వ!యిట్ల యెందఱు సవతులుండినా, అందఱికన్నా నీవే ప్రౌఢ నాయకి వౌతుండావే! దుండి! నీ లచ్చనంబుల చాత నీకు సకల సంపదలు

గలిగి,చిరకాలము ముత్తైదువై యుంటుండావే! ధైధమ్మా! అవ్వో యవ్వ! నా మాట బూటకంబు గాదు, గజిబిజి గాదు, నిక్క మౌతుండాది! అవ్వో యవ్వ! శ్రీ తరిగొండ నారసింహుఁడైన పడిగె కొండలవాని వరంబునఁబుట్టినట్టి నా చిన్నదిండి బుడుతని కింత బువ్వ దేవే! దుండమ్మా! అవ్వో యవ్వ! యీ బుడ్తఁడు సూస్తే యిట్లా వుండాఁడు. బలు కచ్చు పెట్టేవాఁడు. 'వున్నచోట వుండేవాఁడు కాఁడు. అవ్వో యవ్వ! మాయకాఁడై తిరుగుతుంటాడు. యిప్పుడు నా శాత చిక్కియుండాఁడు. వీనికి అందెలు, మువ్వలు మొదలైన బాలపోలము లియ్యవే! ధైధమ్మా! అవ్వో యవ్వ! నీవు యిట్లా బిడ్డలఁ గని ముద్దులాడేవు గాని, నా బుడుతని కిన్ని పాలు బొయ్యవే! భాగ్యశాలి!' అని యిట్లు సత్యభామకు యెఱుక చెప్పి, కొఱవంజి మఱిన్నిట్లనుచున్నది:
139

## దరువు. ఆదితాళం

తరుణీ! నీ మదిలోనుండే - తలఁపూలన్ని నే భావించి
యెఱుఖా చెప్పినందుకూ నా - కేమి యిచ్చేవే? ॥పల్లవి॥
పంజుల కమ్మో లిచ్చేవా? నీ - బవిరెలు' జంపూ లిచ్చేవా? వో
కంజాక్షి! చేకట్లు, కర - కంకణము లిచ్చేవా? ॥తరుణీ!॥ ౧

చిలుకల తాళి యిచ్చేవా? నీ - చీర ఱవికె లిచ్చేవా?యీ
మొల వడ్డాణ మిచ్చేవా? యీ - మొలనూ లిచ్చేవా? ॥తరుణీ!॥ ౨

తరిగొండా ధీశ్వరుఁడూ శేషా - గిరి వాసుఁడూ నీ నగరిలో
తఱచూగా దాచీన పెన్ని - ధాన మిచ్చేవా? ॥తరుణీ!॥ 3

ఆ.వె. అనిన సంతసించి యా సత్యభామిని
నగుచు రత్న భూషణంబు లిచ్చె;
సింగిసాని యన్ని చేకొని - దరహాస
కలిత వదన యగుచుఁ - బలికె నిట్లు: 140

కోలు: ఆ.వె. సింగఁడున్న యెడకు సెలవిచ్చి, నా మీఁద
సాల కరుణ యుంచు సత్యభామ!
సత్య: మైత్రి మఱువ కరిగిఁ మాయింటి కెపుడైనఁ
జెలఁగి వచ్చుచుండు సింగసాని! 141

## *సింగని రాక*

ద్విపద. అని యిట్లు సెలవిచ్చె - నా సత్యభామ,
విని సింగి యా సతిన్ - వీడ్కొని రాఁగ

ననఘాత్ముఁ డై నట్టి యజుఁ - డంతలోన
మొనసి సింగని వేష - మొనర ధరించి

ఘన వేదములు చాప - గా నల్లి చుట్టి,
యనఘాత్ముఁడై మూఁపునం దంటఁ గట్టి,

నరులెల్ల వింతగా - నవ్వి చూడఁగను
మఱి మఱి తబ్బిబ్బు - మాటలాడుచును

వెడనవ్వు నవ్వుచు - వెక్కిరింపుచును
మిడిగ్రుడ్లు ద్రిప్పుచు - మిన్నుఁ జూచుచును

జంగలు చాచుచు - జంకి నిల్చుచును
పొంగుచుఁ 'దరిగొండ - పురవాస! నార

సింగ! ప్రోవు' మటంచు - శీఘ్రంబుగాను
'సింగి! వాడి!' యటంచు - సింగఁ డేతెంచె.

## దరువు. ఆదితాళం

సింగఁడు వచ్చానే! యెఱుకల - సింగఁడు వచ్చానే! ॥పల్లవి॥

కొంగాలఁ జంకానఁ బెట్టి - గువ్వాల పిడికిటఁ బట్టి ॥సింగఁడు॥ ౧

మొలకు కొడవలిఁ జెక్కుకుంటా -మొనసి గిలకా లల్లుకుంటా
॥సింగఁడు॥ ౨

తరిగొండేశ! శ్రీనివాస! - సరగున సింగ్గినిజూఁపుమంటా
॥సింగఁడు॥ 3

తే.గీ. సింగఁ డిటు తన్ను వెదకఁగా,సింగిసాని
సత్యభామిని తనకు విశ్వాసమొదవఁ
బొసఁగ నిచ్చిన సొమ్ములన్ బుట్టినిండఁ
బెట్టుకొని వచ్చి సింగని కిట్టులనియె: 142

## *సింగీ సింగీళ్ల సంభాషణ*

సింగి: అడా! సింగ! సింగ! సింగా! సింగా!
గుడసలే కావలారె వెచ్చి వందాయిడా?॥అడా!॥ ౧

సింగ: అడి! సింగి! సింగి! సింగీ! సింగీ!
గుడసలే మూఁడు గాల కేళివిప్పొణ్ణెకావల్‌వెచ్చి వందేండీ!
॥అడి!॥ ౨

సింగి: అడా! సింగ! సింగ! సింగా! సింగా!
అరుగళుదై అంజుగణ్ణె వెంగ గట్టి వందాయిడా? ॥అడా!॥ 3

సింగ: అడి! సింగి! సింగి! సింగీ! సింగీ!
ఏళోమలే మేలిరుక్కుం గలియల్‌గట్టి వందేండీ! ॥అడి!॥ ౪

సింగి: అడా! సింగ! సింగ! సింగా! సింగా! నా
నిడుమాల భామ కెఱుకసొల్లి వారె, నీగుడసకి పోడా! సింగా:
॥అడా!॥ ౫

సింగ: అడి! సింగి! సింగి! సింగీ! సింగీ!
వున్న బిట్టు పోగకాలో డిల్లె యెన్న శేవన్ సింగీ? ॥అడి!॥ ౬

## దరువు. ఆదితాళం

సింగి: ఇంతమోహ మెంతు కొందు-దేండ! సింగా?
వింత్తై పేశు శొల్లువానె - వెఱ్రి సింగా! ॥౧॥

సింగ: నీమేలే మోగం పీద - నేర సింగీ!
మోము పాతు యిరుంద పోరుం-ముద్దు సింగీ! ॥౨॥

సింగి: యేండా మోగ మిరుందా లెన్న - యెప్పో సింగా? నా
నండ యిరుందాల్ వెళవు తీరు-మ్మడా! సింగా! ॥ 3 ॥

సింగ: నిన్నండ యిర్కాదె వేలె - నెలఁత సింగీ! యిత్తు
కన్న వేలెన్నా? కతల - కాశి సింగీ! ॥ ౪ ॥

సింగి: పొందు బెరగి తిరియరే-డేండల్ సింగా? పురుషన్
నండా జీవిప్ప నా-డేండ సింగా? ॥ ౫ ॥

సింగ: తరిగొండ నారసిమ్మన్ - తరుణి సింగీ! వున్నై
మరవామల్ పణ్ణా నిప్పో - మాయ సింగీ! ॥ ౬ ॥

## దరువు. ఆదితాళం

సింగి: ఇప్పు డందతీకి యెఱుకఁ- జెప్పివత్తు, నీ వందాక
తప్ప కింట నుండుమంటె - కొప్పరించేవా? సింగ!
కొప్పరించేవా? ౧

సింగ: కక్కెరాలఁ దెచ్చి పెడితె - వుక్కెరాల మెక్కి, యెుక్క
దిక్కు నుండ కిట్లు దిరిగి - కొక్కరిచేవా? సింగి!
కొక్కరించేవా? ౨

సింగి: గిలక లల్లి పెట్టి గుడస - బలముఁ జెయ్యమంటె వచ్చి
పిలిసి పిలిసి లేనిపోని - కలగ మాడేవా? సింగ!
కలగ మాడేవా? 3

సింగ: గుడస వెళ్లి, చివ్వ దిండి - బుడుత నెండలోనఁ దిప్పి
మడియ వగుచు నన్ను గడుసు - మాట లాడేవా? సింగి!
మాటలాడేవా? ౪

సింగి: అండాఁ బాయ కెపుడు తారి-గొండావానుఁడైన పైఁడి
కొండావాఁడు,గావ బుడుత-కెండా యేమిరా? ౫

## దరువు. అట తాళం

సింగి: ఇంటానుండమంటె - వంటారివై తిరిగి
గంటారివైతివి - గావున నేనింక సింగీ! నిన్నొల్లనే!
చక్కని పల్కు సింగీ! నిన్నొల్లనే! ౧

సింగి: యేదేదనో యెఱుక - పోఁడీమిగాఁ జెప్పి
కూడూ దెచ్చి పెడితే -కొట్లాడ వచ్చేవు, సింగా! నిన్నొల్లరా!
చక్కని నలువాసింగా! నిన్నొల్లరా! ౨

సింగ: కొంగా పిల్లలఁ దెచ్చి - పొంగూచు పెట్టితే
నంగావాలె మెక్కి - దొంగా మూల్గులు మూల్గే సింగీ!
నిన్నొల్లనే! చక్కని పల్కు సింగీ! నిన్నొల్లనే! 3

సింగి: యింగిత మెఱుఁగాక - నంగాతిఁ జేసి, న
న్నెంగిలి పఱచిన - దొంగావు నీవేరా! సింగా! నిన్నొల్లరా!
చక్కని నలువాసింగా! నిన్నొల్లరా! ౪

సింగ: తరిగొండాధిపుఁడైన - యురగాద్రి పతికైన
వెఱచి, నా తప్పులు - మఱచి యెప్పటివలె సింగీ!
నన్నేలవే!చక్కని పల్కు సింగీ! నన్నేలవే! ౫

## దరువు ఆది తాళం

సింగి: వాళ సింగ! వాళ సింగ! - వాళ సింగా!
సింగ: వాళి సింగి! వాళి సింగి! - వాళి సింగీ! ॥పల్లవి॥

సింగి: యిప్పు డిట్ల నన్నుఁ బట్టే - వేండ! సింగా?
సింగ: తప్పు దీని కేమి? కూడు-దామె సింగీ! ॥వాళ సింగ!॥ ౧

సింగి: రట్టు చేసి నన్నుఁ బట్ట-రాకరా! సింగా!
సింగ: గుట్టు గానే నన్నుఁ గవ -గూడవే ! సింగీ! ॥వాళ సింగ!॥ ౨

సింగి: వేళ గాదు' నిమిష మింక - తాళరా! సింగా!
సింగ: కేళి సల్ప కింక నేను - తాళలేనే! సింగీ!॥వాళ సింగ!॥ 3

సింగి: యీలాగైతే శ్రీనివాసుఁ-డేమాను సింగా?
సింగ: యీలాగతని మాయ గాదె! -యీపని సింగీ!॥వాళసింగ!॥ ౪

సింగి: తారిగొండా హరినిఁ దలు-తాము రారా! సింగా!
సింగ: మారు గెల్వ,కట్ల మనసు-మళ్లదే సింగీ! ॥వాళ సింగ!॥ ౫

ద్విపద. అని సింగి, సింగఁడి - ట్లన్యోన్యముగను
మనము రంజిల్లఁగా - మాటలాడుచును

సరగున నిజ నివా - సముఁ జేరి, యచట
నఱ లేక తరిగొండ - హరియైన శేష

గిరివాసు నేవేళఁ - గీర్తించుకొనుచు
నురుముదంబునఁ గూడి - యుండి; రంతటను

సత్యభామిని యొక్క - సతిని వీక్షించి
యత్యంత మైత్రితో ననియె నిట్లనుచు:

సత్య: తే.గీ. పడఁతి! కొఱవంజి కృష్ణజపంబుఁజేయు
మనుచుఁ జెప్పెఁగదా! యిప్పు డా జపంబుఁ
జేయఁబూనిన నుపశాంతిఁ జెందవలయు,
సవతి విద్వేషమున నాకు శాంతి రాదె! 143

చెలి: ఆ.వె. శాంతి గలిగినేని జపమాచరింపుమా!
శాంతి లేక జపము సల్పవలదు;
వేషధారి జనులు ద్వేషంబుతోఁజేయు
జపము నెత్తిఁ గొట్టు సత్యభామ! 144

వత్య: తే.గీ. 'చేడె! యీ మాటు కృష్ణునిఁ జేరి పిలిచి,
వచ్చెనా సరి! రాకున్న వాంఛ విడిచి
యప్పు డుపశాంతితో జపం బాచరింతు'
ననుచుఁ జెలితోడ హరిపాలి కరిగి పలికె: 145

## *సత్యభామా శ్రీకృష్ణుల రెండవ సంవాదము*
## చూర్ణిక

వత్య: శ్రీమదకుంఠిత భక్తి జ్ఞాన వైరాగ్య తపఃప్రభావాతిశయ దేవకీ వసుదేవ విమల గర్భ క్షీరపారావార సంజాత రాకానుధాకరబింబం, యశోదానందావలంబం. ౧

సదానంద సంభరిత నందపరిపాలిత పోషస్థిత గోప గోపికావ్రాత నిలయస్థ క్షీర దధి నవనీతచోరం,నల్లలిత శృంగార సారం. ౨

అసమాన సుందర సుకుమార నవయౌవనాలంకృత వల్లవీ జన బృంద వివిధ విచిత్ర వస్త్రాపహరణం, గోవర్ధన పర్వతోద్ధరణం 3

పూతనా శకట తృణావర్త బకాఘ ధేనుక వృషభ కేశివ్యోమ చాణూర కంస ముర నరక శిశుపాల దంతవక్త్ర సాళ్వ విదూరథముఖ్య శత్రు విదారణం, నతజనోద్ధారణం. ౪

నానా విధ ప్రసూన ఫలభరిత శృంగారవన తటాకజల జాకరానేక పుణ్య వాహినీ సమేత శేషశైలాగ్ర నివేశం, కోటిసూర్య ప్రకాశం, నీల జీమూత సంకాశం, తరిగొండపురవరాధీశం, లక్ష్మీనరమృగేశం భజేఽహం, భజేఽహం, భజేఽహమ్. ౫

తే.గీ. అనుచు మ్రొక్కిన చెలిఁ జూచి, యవల జరిగి
హరి పరాఙ్ముఖుఁడై యుండె, నందువలనఁ
జాల వెలవెలఁ బోవుచున్ సత్యభామ
చెలిని వీక్షించి పల్కె బల్ సిగ్గుతోడ. 146

సత్య: ద్విపద.'నెలఁత! యాశౌరికి-నేను మ్రొక్కినను
చెలఁగి నన్ జూడఁ డా-శీర్వాద మనఁడు

బలవంతమున మహా - బధిరుని చెంతఁ
బొలుపొంద శంఖంబుఁ - బూరించినటుల

నెఱి దర్పణం బంధు - నికిఁ జూపు పగిది,
నురుతర నిద్రఁ బో-వుచునుండు వాని

పదము లొత్తిన రీతి - బాగాయెఁ జూడు
మదిరాక్షి! యిటకేల - మగుడి వచ్చితిమి?

స్థిరముగాఁ గొఱవంజి - చెప్పిన రీతి
హరినామ జపముఁ జే-యకపోతి మపుడె;

వలనొప్పఁ దరిగొండ - వాసుఁడైనట్టి
సలలిత వేంకటా- చల ధాము మనసు

కరఁగియుండు నటంచుఁ - గదియ వచ్చితిమి
సరివారి ముందఱఁ - జౌకైతి మమ్మ!'

తే.గీ. అనినఁ జెలి యిట్టులనియె 'నీ వనిన రీతి
నిచ్చటికి మళ్లి రారాదు, వచ్చినపుడు
మ్రొక్కి పిలువక పోరాదు నిక్కముగను,
ప్రియముతో మ్రొక్కి యాసారి పిలువవమ్మ!' 147

తే.గీ. అనినఁ జెలిమాట మేలుమేలనఁగ మెచ్చి
చక్రధరుదిక్కు దిరిగి యా సత్యభామ
'వందనము కృష్ణ! గోవింద! వాసుదేవ!'
యనుచు మ్రొక్కినఁ గృష్ణుఁ డయ్యతివ కనియె: 148

శ్రీకృ: ఆ.వె. నీవు మ్రొక్కినందు కీవసుంధరమీఁదఁ
జాల వృద్ధిఁ బొందు సత్యభామ!
అలిఁగి పోతి వప్పు, డా రీతి నుండక
మగుడి వచ్చుటేమి మాయలాఁడి? 149

సత్య: క. ఈ రీతిఁ బల్కనేటికి?
రారా! లోకైక రక్ష! రాజీవాక్షా!
రారా! వేంకట గిరివర!
రారా! తరిగొండ వాస! రారా! కృష్ణా! 150

శ్రీకృ: క. నారీమణి! నీ వాడిన
క్రూరపు వాక్యములు మదినిఁ గొంకక నాఁటెన్
కూరిమి విడిచెను, రానిఁకఁ
బోరాటము చాలు, లేచిపోవే! భామా! 151

## దరువు. మధ్యమావతి రాగం-త్రిపుట తాళం

సత్య: నిన్ను నే నేమంటినోయీ? నీవు
నన్ను విడనాడేది న్యాయమఁట వోయీ?
॥నిన్ను నే॥పల్లవి॥

చెక్కుల పసుపేమి యనినానా? కెమ్మోవి
నొక్కులేమని యడిగినానా? హారములు
చిక్కుపడుటేమి యనినానా? నీవు నను
కక్కసింపుచు నింత కడఁ ద్రోయఁదగునా?
॥నిన్ను నే॥ ౧

నీటు బలు మించె ననినానా? కీలుజడ
వేటు లెటు గలిగె ననినానా? యీ గుబ్బ
పోటు లేఁమని యడిగినానా? వలువకును
కాటు కంటుట కేమి కార్యమనినానా? ॥నిన్ను నే॥ ౨

మఱి మఱీ నన్నేఁచ మేరా? నీ పదమె
శరణమని నమ్మియున్నారా! నన్ను నీ
కరుణ మెఱయఁగ నేలు కోరా! శ్రీ శేష
గిరివాస! తరిగొండ నరసింహ! రారా! ॥నిన్ను నే॥ 3

క. తరిగొండాధిప! వేంకట
గిరినాయక! పరమపురుష! కృష్ణ! ముకుందా!
విరసము సేయక, కరుణను
సరసత నన్నేలుకోర! జగదాధారా! 152

శ్రీకృ: క. తరుణీమణి! నీ వాడిన
విరసపు వాక్యంబులన్ని వేమఱు మదిలోఁ
జుఱుకు చుఱుక్కన నాఁటఁగ
సరసంబిఁక నీకు నాకు సరిపడు నటవే? 153

## దరువు. అటతాళం

సత్య: అండాజ వాహన! నిన్నే మంటీరా? మా యింటిలోన
వుండాక వచ్చి, నన్ని ట్లా వుడ్డాడించేవు? ౧
మందూల మారి! నా సవతూ లందారు నీకాప్తులటరా?
నందా నందాన! నే పగదాననా? చెప్పరా! ౨

చెలఁగీ తారిగొండ నారసింహ! శేషశైలవాసా!
ఎలమీ నీకూ మ్రొక్కేను మా యింటికి రారా! 3

క. అనఘా! తరిగొండాధిప!
ఘనతర శేషాద్రివాస! కాముని శరముల్
నను వేధింపుచునున్నవి
నిను వేఁడెద లేచిరార! నీరజనాభా! 154

శ్రీకృ: క. ఇనుమది విఱిగిన నతుకును
వనుపడ ననలముఁ గాఁచి బంధించిన,నా
మనమటు విఱిగిన నతుకదు
వనితామణి! లేచి పోవె! వార్తలు చాలున్. 155

## దరువు. మధ్యమావతిరాగం-ఆదితాళం

సత్య: ఏమి సేతురా! గోపాలా! స్వామీ! యేమి సేతురా? ॥పల్లవి॥
ఏమిసేతురా? వలపెటువలె దాతురా?
సామి! నన్నేలు కోరా! జాలిచే తాళలేరా! ॥ఏమి॥ ౧

నిన్ను నేనేమన్నా రా? నేరాము లెన్నే వేరా?
చిన్ని కెమ్మోవియ్యారా! నీ చిత్తాము మ్రొక్కేను రారా! ॥ఏమి॥ ౨

విరసము చేయకురా! వేఱుగాఁ జూడకురా!
మరుఁడు పగవాఁడు రా! నా మర్మము భేదించెఁగదరా!
॥ఏమి॥ 3

సురుచిర శేషశైలావర!తరిగొండాధి పాలా!
మఱి మఱీ జాలామేలా? శరణు బొందినారా! చాలా
॥ఏమి॥ ४

శ్రీకృ: తే.గీ. వెలఁది! రుక్మిణి మొదలైన నళినముఖులు
నన్నుఁ గవగూడియుండఁగా, నిన్ను నేను
సరకుసేతునె? నీకిట్టి జాలి వలదు;
చాలు నిఁక బోవె? నీ ప్రేమ సత్యభామ! 156

సత్య: సీ. నీపక్షపాతంబు నేనేమి యెఱుఁగనా?
పొంచి కోఁతినిఁబట్టి త్రుంచినావు,
నీ న్యాయపద్ధతి నేనేమి యెఱుఁగనా?
దాతను తల ద్రొక్కి తఱిమినావు,
నీ ధర్మవర్తనల్ నేనేమి యెఱుఁగనా?
ఘనపుణ్యజనులను దునిమినావు,

నీ దయాళుత్వంబు నేనేమి యెఱుఁగనా?
ప్రియ కాంత నగ్ని కొప్పించినావు

తే.గీ. గాన, నిటువంటి నడతలు మానవులకుఁ
జెప్పి నిందింతు; నన్నును చేకొనేవా?
తెలియఁబలుకుము శేషాద్రినిలయ! వైరి
వారగజసింహ! తరిగొండ నారసింహ! 157

శ్రీకృ: సీ. తమ్ముని సతిఁ బట్టి తానేలినటువంటి
దుర్మార్గుఁడని వాలిఁ దున్మినాఁడఁ,
బాకారి కమిత సంపదలిచ్చి, సుతలంబు
నేలు నీవని బలి కిచ్చినాఁడ,
శిష్టుల నెల్ల రక్షించుటకై దుష్ట
దనుజులఁ బరిమార్చి దనరినాఁడఁ,
జెఱనున్న సీత నందఱిచేత మెప్పించు
కొఱ కగ్నిఁ జొరనిచ్చి, కూడినాఁడఁ

తే.గీ. గాంత! యివి కాని నడతలు-గాఁ దలంచి
జనుల కెఱిఁగింతునంటి; నే జడుతు నఁటవె?
సకల లోకము లెఱుఁగు నాసద్గుణములు;
చాలు నిఁకఁబోవె! నీప్రేమ సత్యభామ! 158

సత్య: సీ. కొడుకును మడియించి కోడండ్ర నేలిన
నీకీర్తి యెఱుఁగరా నిఖిలజనులు?
దాసినిఁ గూడి నందనులఁ బుట్టించిన
నీఖ్యాతి యెఱుఁగరా నిఖిలజనులు?
పెద్దాలికూతురిన్ పెండ్లియాడిన నాటి
నీ నీతి యెఱుఁగరా నిఖిలజనులు?
ఎత్తి నిన్ బెంచు మేనత్తనే వలపించు
నీ మాయ లెఱుఁగరా నిఖిలజనులు?

తే.గీ. పరఁగ గురిగింజ తనమీఁది యెఱుపెగాని
యడుగు నలుపును గననేర; దట్ల నీవు
నిక్కెదవు చాల శేషాద్రి నిలయ! వైరి
వారగజసింహ! తరిగొండ నారసింహ! 159

శ్రీకృ: సీ. నరకుని నగరిలోఁ జెఱయున్న తరుణుల
నేను రక్షించుట నీచమటవె?
భక్తితోఁ గామించి ప్రార్థింపఁగాఁ గుబ్జ
కోరికఁ దీర్చుట కొంచెమటవె?
రాజు నైనపుడు ధ-రాపుత్రి నేను చే
పట్టినందునఁ గొంత పాపమఁటవె?
ననుఁ బొందుటకుఁ దపంబొనరింపఁగా మెచ్చి
నే రాధ నెనయుట నిందయఁటవె?

తే.గీ. పరఁగఁ బన్నీటి సౌఖ్యంబు పంది కెపుడుఁ
దెలియ, దటువలె నీవు నా దివ్య మహిమ
లెఱుఁగనేరవు; నీప్రాప్తి కేమి చేతు?
చాలు నిఁకఁబోవె! నీప్రేమ సత్యభామ? 160

## దరువు. అట తాళం

వత్య: రంతూలు మాని నా వెంట-రారా! శ్రీకృష్ణా!
నావెంట రారా! శ్రీకృష్ణా!
శ్రీకృ: రంతూలాఁడీ! నేనీవెంట - రాలేనే! భామా! ౧

వత్య: రద్దూ, పద్దూలేల? లేచి-రారా! శ్రీకృష్ణా!
వేగ లేచి రారా! శ్రీకృష్ణా!
శ్రీకృ: పొద్దూబోయే నేరా నింకఁ - బోవే! సత్యభామా! ౨

వత్య: సారెకు నన్నేఁచేదేలా?- రారా! శ్రీకృష్ణా!
గ్రక్కన లేచి రారా! శ్రీకృష్ణా!
శ్రీకృ: పోరూ జాలూ నేరానింకఁ-బోవే! వత్యభామా! 3

సత్య: రవ్వా శాయా మేరా గాదు - రారా! శ్రీకృష్ణా!
మేరాగాదు రారా! శ్రీకృష్ణా!
శ్రీకృ: పువ్వుఁబోణీ! నే రాలేను - పోవే! సత్యభామా! ౪

సత్య: తరిగొండా శేషాద్రీశా! శేష-గిరివాసా! రారా!
చక్కని శేషగిరివాసా! రారా!
శ్రీకృ: తరుణీ! నేనూ రానూ నీ - తొందర చాలు పోవే! ౫

సత్య: సీ. మున్ను నిన్నెఱుఁగనా? యున్నట్టి తల్లిని
సాహసవృత్తితోఁ జంపినావు,
ఆఁడుదానిని సంగరాదిని దయలేక
పొంచించి శరమేసి త్రుంచినావు,
జనని చందంబునఁ జన్నిచ్చినటువంటి
యంగన ప్రాణముల్ మ్రింగినావు,
మొనసి నిన్నీక్షించి మోహించి వచ్చిన
కొమ్మముక్కును చెవుల్ కోసినావు

తే.గీ. కాన,సతులందు నీకేల కరుణ గలుగు?
తొలుత నిన్నింతవాఁడని తెలియలేక
వలచితిని నిన్ను; శేషాద్రి నిలయ! వైరి
వార గజసింహ! తరిగొండ నారసింహ! 161

శ్రీకృ: సీ. జనకాజ్ఞ మీఱరాదని ధర్మశాస్త్రముల్
చెప్పఁగా జనని శిక్షించినాఁడ,
మునుల యాగముల కెప్పుడు విఘ్నకారియై
తిరుగు తాటకను మర్దించినాఁడ,
పాలని విషమిచ్చు బాల ఘాతకి గాఁగ
నటువంటి పూతన నణఁచినాఁడ,
క్రూరాత్మురాలైన ఘోర రాక్షసి ముక్కుఁ
జెవులను గోసి శిక్షించినాఁడ,

తే.గీ. వెలఁది!యివి కాని పనులని తలఁచి, నన్ను
వలచినందున మోసంబు వచ్చెననుచుఁ
బలికితివి గన్క, నాపొందు వలదు నీకుఁ;
జాలు నిఁకఁ బోవె! నీప్రేమ సత్యభామ! 162

సత్య: సీ. ఒకరికిఁ బుట్టి, వేఱొకరిపే రిలమీఁదఁ
ప్రకటంబుగాఁ జెప్పి బ్రతికినావు,
ఘనుల కావరిమొత్తము బలు గొల్లపల్లెలోఁ
బెఱుగు మ్రుచ్చిలి త్రావి పెరిగినావు,
తల్లి తోడును జంపి తాతగారింటిలో
నీచంపుఁ బనులకు నిలిచినావు,
తురకవాఁ డొక్కఁడు దొరకొని తఱుమఁగాఁ
బిఱికివై యడవుల కుఱికినావు

తే.గీ. గాన, నీవింత నడతలు గారడములు
చేసి కవులెంత దెల్పిన సిగ్గులేక
కులుకుచున్నావు; శేషాద్రి నిలయ! వైరి
వార గజసింహ! తరిగొండ నారసింహ! 163

శ్రీకృ: సీ. నందుని భక్తి కానందించి, తత్సూనుఁ
డనిపించుకొనుట తప్పందు రఁటవె?
ఘనగోష్ఠమందు గో గణముల రక్షించి
దధిఁ ద్రావి బ్రతుకుట తక్కువటవె?
కలుషాత్ముఁడగు కంసు ఖండించి, నే నుగ్ర
సేనుఁ బ్రోచిన పనుల్ కానివఁటవె?
యవనునిఁ జంపింప నడవిలో ముచుకుందుఁ
బాలింపఁజనిన నే బేలనఁటవె?

తే.గీ. పూని నీవన్ని తెలిసిన దానివలెనె
శిరము, కన్నులు కరములు చిత్రములుగఁ
ద్రిప్పవలదింక, నీ బుద్ధి తెలిసివచ్చెఁ;
జాలు నికఁ బోవె! స్నేహమ సత్యభామ! 164

## దరువు. అటతాళం

సత్య: మంచిది మంచిది- మనసులో నీమాట
లుంచు కృష్ణా! నీమనసులో - నుంచు కృష్ణా!
శ్రీకృ: నీవు, మంచెఁ బెట్టిననాటి-కెంచి గువ్వలు దోలేఁ బోవే!
భామా! ౧

సత్య: వేళ వచ్చిన నన్ను-వే,డేవు మంచిది
తాలు కృష్ణా! మంచిది- తాలు కృష్ణా!
శ్రీకృ: అంత, వేళ వచ్చిన నిన్ను - వేఁడుకొనేఁ గాని, పోవే భామా! ౨

సత్య: అప్పుడు నను వేఁడే - నంటే షేఁ బంగించ
నఁటరా కృష్ణాఁ? నేఁ బంగించ-నఁటరా! కృష్ణా?
శ్రీకృ: అట్లా, తప్పు నాయందుంటే - తగ్గి చెప్పేఁగాని పోవే! భామా 3

సత్య: రద్దూ చేయుచు నీవు - పద్దులు నాతోఁ బల్క
వద్దూ కృష్ణా! పద్దులు పల్క-వద్దు కృష్ణా!
శ్రీకృ: నీ, వద్దద్దిరా! యంటె- దద్దిర్లే నఁటవే? వో సత్యభామా! ౪

సత్య: తరిగొండాధిప! శేష - గిరివాస! చలమేలా?
రారా కృష్ణా! మా యింటికి- రారా! కృష్ణా!
శ్రీకృ: నన్ను మఱిమఱి పిలిచేది - మర్యాదగా దింకపోవే!
భామా! ౫

సత్య: సీ. బోయదా నెంగిలి బోసేసితివి పూర్వ,
మిప్పుడా గుట్టు నేఁ జెప్పవలెనా?
చెలులచీరలు దాఁచి సిగ్గులు గనుఁగొంటి
విప్పుడా గుట్టు నేఁజెప్పవలెనా?

హెచ్చి మెచ్చుగ వెన్న ముచ్చిలించితివి ము,
న్నిప్పుడా గుట్టు నేఁ జెప్పవలెనా?
వనములో ఘగనియాండ్లను గూడి యాడితి,
విప్పు డా గుట్టు నేఁ జెప్పవలెనా?

తే.గీ. నన్ను నేలెదవో తెల్పు నైజముగను,
కచ్చలాడిన నీ సిగ్గుఁ బుచ్చుకొందుఁ;
దలఁగి పోనింక శేషాద్రి నిలయ! వైరి
వార గజ సింహ! తరిగొండ నారసింహ! 165

శ్రీకృ: సీ. శబరి యిచ్చిన పండ్లు సరవి నే భుజియించు
టెల్లవా రెఱుఁగుదు, రేమి భయము?
చెలుల చీరలు దాఁచి సిగ్గులు నేఁజూచు
టెల్లవా రెఱుఁగుదు, రేమి భయము?
చిన్ననాఁ డలర నే వెన్న ముచ్చిలు చంద
మెల్లవా రెఱుఁగుదు, రేమి భయము?
మగనియాండ్రను నేను మరులు కొల్పిన వింత
లెల్లవారెఱుఁగుదు, రేమి భయము?

తే.గీ. చంద్రుఁ డుదయింపఁగా జూచి సారమేయ
మెదిరి బెదరించి యఱచిన ట్లీవిధమున
నీవు వెఱపించి పిలిచిన నేను రాను;
చాలు నిఁకఁ బోవె! నీప్రేమ సత్యభామ! 166

సత్య: చేఁపవైతి వటంచుఁ జెలరేఁగి కొందఱు
ఎగ్గు లాడిన నీకు సిగ్గు లేదు,
పిఱికి తాఁబేలివై మఱుఁగుఁ జేరితివంచు
నెగ్గులాడిన నీకు సిగ్గు లేదు,
పందివై బురదలోపలఁ బొర్లినావంచు
నెగ్గు లాడిన నీకు సిగ్గు లేదు,

ప్రేవులు మెడ వేసి త్రావె నెత్తురటంచు
నెగ్గు లాడిన నీకు సిగ్గు లేదు,

తే.గీ. మాన, మవమాన మెఱుఁగవు గాన, నీవు
పరుల నెఱుఁగవు, నీమూల మరయ లేవు;
నిన్ను నేమందు? శేషాద్రి నిలయ! వైరి
వార గజసింహ! తరిగొండ నారసింహ! 167

శ్రీకృ: సీ. ఆది పాఠీనమై వేదంబు లా బ్రహ్మ
కిచ్చినాఁ డనుమాట కెగ్గు గలదె?
కమఠమై గిరి మోచి, యమరుల కమృతంబు
నిచ్చినాఁ డనుమాట కెగ్గు గలదె?
ప్రకట వరాహరూపముఁ దాల్చి,పోనీక
నిల నిల్పె నను మాట కెగ్గు గలదె?
నరమృగాకృతిని దానవుఁ ద్రుంచి, తద్రక్త
మిలఁ ద్రావె నను మాట కెగ్గు గలదె?

తే.గీ. ఏనుఁగును జూచి దోమ తా నెదిరి పోరఁ
దలఁచినటువలె నీవు నన్నలిఁగి, యిన్ని
యెగ్గు లాడిన ఫలము నీకేమి వచ్చెఁ?
జాలు నిఁకఁ బోవె! నీప్రేమ సత్యభామ!168

## దరువు. అటతాళం

సత్య: రాను రానన నేల? - రారా! కృష్ణా! నీవు రారా! కృష్ణా!
ఏను మ్రొక్కెదఁ గౌఁగి - లీరా! కృష్ణా! ౧

శ్రీకృ: నేను నీయింటికి రానే! భామా!-నేను రానే! భామా!
పూని పిల్వక, లేచి - పోవే! భామా! ౨

సత్య: శ్రీపతి నామీఁద - కోపమేలరా? నీకు కోపమేలరా?
నీపట్ల నేఁ జేయు - పాపమేమిరా? 3

శ్రీకృ: నీ పుణ్య పాపములు - నీవే భామా! అవి నీవే భామా!
పో పొమ్మంటే లేచి-పోవే! భామా!

సత్య: తరిగొండాధిప! శేష-గిరి విహారా! శేషగిరి విహారా!
ఇరవొంద నను( బ్రేమ-నేలుకోరా! ౫

శ్రీకృ: తే.గీ. సారెసారెకు నీ విట్లు చనవుగాను
రమ్ము రమ్మని పిలువకే! రాజవదన!
నీ ముఖమ్ముఁ జూడ సైఁపదు, నేఁడు లేచి
చనవె! యింటికి సుఖసీమ! సత్యభామ! 169

సత్య: సీ. హెచ్చుక బలు తగ్గి బిచ్చమెత్తితి వంచు
జనులెన్న నీకు రోషంబు లేదు,
పరువ కాయుధ మిచ్చి భంగపోయితివంచు
జను లెన్న నీకు రోషంబు లేదు,
కోఁతులరాజువై కొండ లెక్కితివంచు
జను లెన్న నీకు రోషంబు లేదు,
మడియ కాఁపు విధాన మడఁకఁ బట్టితివంచు
జనులెన్న నీకు రోషంబు లేదు,

తే.గీ. మొండి లెక్కలు వేయుచు బండకూడు
కుడువఁ దలఁచెదవేమొ? నీ గొల్లబుద్ధి
తెలిసి వచ్చెను; శేషాద్రి నిలయ! వైరి
వార గజసింహ! తరిగొండ నారసింహ! 170

శ్రీకృ: సీ. అడుగులు బలిని మూఁ డడిగి ముల్లోకముల్
సాధించెనంటె రోషంబు గలదె?
తానైనవానికే తనబాష-మిచ్చి ని
శ్చలుఁడయ్యెనంటె రోషంబు గలదె?
కార్యార్థమై మహాకపులకు స్వామియై
చరియించె నంటె రోషంబు గలదె?

హలము ధరించి శత్రులనెల్ల వరుసగా
నమయించెనంటె రోషంబు గలదె?

తే.గీ. రాజహంసను జూచి గారడముఁ జేసి
బకము పకపక నవ్విన పగిది నన్ను
నీవు హసియించి సారెకు నిక్కనేల?
చాలు నిఁకఁబోవె! నీ ప్రేమ సత్యభామ! 171

సత్య: సీ. బట్ట గట్టక దిగంబరుఁడవైతి వటంచు
నిందించినను లజ్జ నీకు లేదు,
హలము ధరించి శత్రుల నెల్ల వరుసగా
సమయించెనంటె రోషంబు గలదె?
బ్రాహ్మణత్వము వీడి బంట్రౌతువలె ( గత్తిఁ
జేకొంటివన లజ్జ నీకు లేదు,
పండిన కూడమ్మి వడ్డి కాసులు గూర్ప
నేర్చెనన్నను లజ్జ నీకు లేదు,
తురకల రవు తౌచు వెఱచి వారికి రూక
నెఱి నిచ్చెనన లజ్జ నీకు లేదు,

తే గీ. పేద బాఁపని కరణి నే పెద్దవాఁడ,
దానపాత్రుఁడ ననుచు హస్తంబుఁ జాఁచి,
వెలసితివి లేర! శేషాద్రి నిలయ! వైరి
వారగజసింహ! తరిగొండ నారసింహ! 172

శ్రీకృ: * బౌద్ధాంగనల మానభంగంబు గావించు
కొఱకు నేను దిగంబరుఁడ నౌదు,
కలిదైత్యతతుల నిగ్రహముఁ జేయుటకు ని
మ్ముగఁ గరవాలమును ధరింతు,
నాప్రసాదము మీఁద నరులకెల్లను భక్తి
నిలుపఁ దత్క్రయమెల్ల నేనె గొందు,
అలయించి వడ్డికాసులు, మొదల్ గొని,భక్త
భరముఁ దురుష్కుల పాలు చేతు

బుద్ధుఁడుగా అవతరించటానికి ప్రేరణ కలిగించిన అంగనలు (త్రిపురాసురుల భార్యలు).

తే.గీ. తరుణి! నాయుక్తిఁ దెలియక, దంతి దంత
మూలములఁ జూడఁబోయెడి మూర్ఖ పగిది
నీవు నన్నుపాలంభింప నీతి గాదు;
చాలు నిఁకఁ బోవె! నీప్రేమ సత్యభామ! 173

## దరువు. అటతాళం

సత్య: ఇటువంటి చలముఁ-జేయుట నీకు మేరా?
కటకటా! నన్నిట్ల - గారించే వేరా?
నీలవర్ణ! కృపాలవాల! - శ్రీలోల! ఘనానంద! బాలగోపాలా! ౧

శ్రీకృ: ఇన్నాళ్లవలె చను-విఁక నీకు రాదే!
నన్నింక దూఱేది - న్యాయము గాదే!
కామినీ! గజకామినీ! సత్య-భామినీ! స్త్రీశిరోమణీ! పోవే! ౨

సత్య: చెలులు పెట్టిన మందు - తల కెక్కెనఁటరా?
కలకంఠు లందఱీ - గతిఁ జేసిరఁటరా?
నీలవర్ణ! కృపాలవాల! - శ్రీలోల! ఘనానంద! బాలగోపాలా! 3

శ్రీకృ: చేడె! యిదెవరుఁ - జేసిన గతి గాదే!
నేఁ డింత చేసేది - నీ వాడే వాదే!
కామినీ! గజగామినీ! సత్య - భామినీ! స్త్రీ శిరోమణీ! పోవే! ౪

సత్య: హరి! నే వాదింపక - శరణనే లేరా!
తరిగొండాధిప! శేష - గిరివాసా! రారా!
నీలవర్ణ! కృపాలవాల! - శ్రీలోల! ఘనానంద!
బాల గోపాలా! ౫

సత్య: సీ. విష్ణు విప్రులకు శూద్రు లెంగిలి నీళ్లను
ఇంపులుచేసి త్రావింపఁగలవు,
చద్దికుండల కూడు పెద్ద నైష్ఠికులచే
బెదరుఁజూపుచుఁ దినిపింపఁగలవు,

చెలరేఁగి పరుల బిడ్డలఁ బెండ్లి నీ వాడి
పిఱికి దాసళ్ల కొప్పింపఁగలవు,
వైరాగ్యమున మోక్షవాంఛతో శరణన్న
చేడెల నట్లట్ల చెనకఁగలవు,

తే.గీ. దొంగ! నీమాయ లెవ్వ రెఱుంగనుచుఁ
బూర్ణ గాంభీర్య పురుషుని పోల్కిగాను
నిలిచినా వౌర! శేషాద్రి నిలయ! వైరి
వార గజసింహ! తరిగొండ నారసింహ! 174

శ్రీకృ: వరతొట్టి తీర్థ మందఱికి నేఁ ద్రావించు
టాత్మభేదంబు లేదనెడి కొఱకె,
చద్ది కుండలలోని సాద మందఱికిచ్చు
టల కర్మవాసన లణఁచుకొఱకె,
పెండ్లాల దాసరివాండ్ల కొప్పించుట
కలియుగంబున లక్ష్మి వెలయుకొఱకె,
వైరాగ్య సతులకు వగఁజూపి చెనకుటల్
తెలివిచ్చి ముక్తిఁ బొందించు కొఱకె

తే.గీ. కాంత! నా భావమెల్ల నైకాంతికులకుఁ
దెలిసియుండును; నీకట్టి తెలివి లేదు
గాన నీ మాట లంటివిగాని, కాని,
చాలు నిఁకఁ బోవె! నీప్రేమ సత్యభామ! 175

సత్య: సీ. తావిచ్చినట్టి స్వాతంత్రుని నొకమూల
నుంచి, స్వసర్వము నాక్రమించినావు,
మొనసి రూకల నీక మొగముఁ జూపనటంచుఁ
బరమ భక్తులనైనఁ దఱుమఁగలవు,
అందఱితో మాటలాడినట్లుండి, యె
వ్వరిమాటలకుఁ జిక్కకుఱుకఁగలవు,
దొరవని యొక చోట మెఱసినట్లనె యుండి
దేశదేశంబులు తిరుగఁగలవు

తే.గీ. గాన, నీవలె నటియించు గారడీఁడు
గలుగునే యింక మూఁడు లోకంబులందు?
నీవె చాలురా! శేషాద్రి నిలయ! వైరి
వార గజసింహ! తరిగొండ నారసింహ! 176

శ్రీకృ: సీ. తావిచ్చు దొరకు ముందర భోజనముఁ బెట్టి
యవల నే భుజియింతు, నందుకేమి?
ఇలను దాసులకు మిక్కిలి భక్తిఁ బుట్టింప
నళికించి రక్షింతు, నందుకేమి?
శుద్ధాత్ములకు ఫలసూచనంబులు చేసి,
యా మాటలకుఁ జిక్క, నందుకేమి?
ఒక చోట దొరనవుచుండి నే నొక లీల
నవనిపై దృష్టింతు, నందుకేమి?

తే.గీ. నీవు నా భావమెఱుఁగక నిష్ఠురంపు
మాట లంటివి, నీ బుద్ధి నేటివఱకు
తేటగాఁ గంటి, నింక నీ కూట మొల్లఁ;
జాలు నిఁకఁ బోవె! నీ ప్రేమ సత్యభామ! 177

## దరువు. ఆదితాళం

సత్య: జడఁ దీసి కొట్టుదునా? వోరోరి! సామీ! -జడఁదీసి
కొట్టుదునా? ॥పల్లవి॥

జడఁ దీసి కొట్టుదునా? - సవతూల నందఱినీ
విడిబాడి తిట్టుదునా? - వోరోరి! కృష్ణా! ॥ఉపపల్లవి॥

దబ్బాఱ లాడినట్టి - తంటాల మారి! నిన్ను
గుబ్బాలఁ గుమ్ముదునా? నీ ఱొమ్ము గబ్బి
-గుబ్బాలఁ గుమ్ముదునా? ॥జడఁదీసి॥ ౧
పట్టూ పడాని నిన్నూ - బాహులతల నేనూ
పట్టి బంధించుదునా? వోరోరి! సామీ!
-పట్టి బంధించుదునా? ॥జడఁదీసి॥ ౨

తరిగొండాధీశా! శేషా - గిరివాసా! నిన్నుఁ గదిసి
తిరుగ్రిప్పు లాడుదునా? నా - చలమూ దీఱా
-తిరుగ్రిప్పు లాడుదునా? ॥జడఁదీసి॥ 3

సత్య: సీ. దొరనని మురిసేవు, తొడరి విద్యావంతు
లెంత వేఁడిన ధనం బియ్యలేవు,
పరమభక్తులనైనఁ బరిచారకులచేత
రొప్పింతు, వన్న మిప్పింప లేవు,
తీర్థ వాసులు పొంచి తిరిపెమెత్తు దుగాండ్లు
గుత్త గొందువు, వారి కిత్తు ననవు,
కలిగిన వారినే ఘనముఁజేతువు గాని,
చెలఁగి దీనుల నీవు చేరనీవు,

తే.గీ. పేద లెవరైన ధనికుల బిచ్చమెత్తఁ
బోఁదలంచినఁ బోనీక పోరి, యదియు
నీవె గొందువు; శేషాద్రి నిలయ! వైరి
వార గజసింహ! తరిగొండ నారసింహ! 178

శ్రీకృ: సీ. అధిక విద్యావంతు లాశ్రయించిన మెచ్చి
నాశంబులేని ధనంబు నిత్తు,
భటులచే రొప్పించి, పరమ భక్తుల క్షాంతిఁ
గని యన్నమిప్పించి గారవింతు,
పరుష పాపమును భూసురముఖాంతరము గాఁ
దెప్పించి, యజ్ఞుల కొప్పగింతు,
ధనికుల హెచ్చించి ధనము లార్జింతుఁ, బే
దలను తగ్గించి సత్పదము నిత్తు;

తే.గీ. కలిసి నాయుక్తిఁ దెలియక కంటకంబు
లైన మాటలు నీవంటి, వైనఁగాని
ఇందుచేఁ గీర్తిఁ బొందితి వింక నేమి?
చాలునిఁకఁ బోవె! నీప్రేమ సత్యభామ! 179

సత్య: సీ. కులగోత్రములు లేని గుణహీనుఁడవు నీవు
కడలేని యప్రమాణుఁడవు నీవు
మానావమానముల్ లేనివాఁడవు నీవు
కడపట బుద్ధిశూన్యుఁడవు నీవు
మాయావివై మాఱు మసలు చుండుదు వీవు
ఘనతరాహంకారఖనివి నీవు
బహురూపి యగుచు దబ్బఱ లాడుదువు నీవు
ప్రకట మహేంద్ర జాలకుఁడ వీవు

తే.గీ. గనుక నిన్నొక్క మానవుఁ డనఁగ రాదు,
ఏడనైనను నీ మోముఁ జూడరాదు,
కలియు విధమెట్లు శేషాద్రినిలయ! వైరి
వారగజసింహ! తరిగొండ నారసింహ!

శ్రీకృ: సీ. అద్వయ బ్రహ్మమైనటువంటి నాకును
కుల, గోత్ర, గుణమితుల్ కొన్ని గలవె?
వస్త్వంతరము లేని వానికి మానావ
మాన, బుద్ధులు వేఱె కానఁబడునె?
మొనసి మాయావినై ఘనతరాహంకార
ఖనిని నేఁ గాకుంటె కలదె జగము?
బహురూపినగుచు దబ్బఱలాడి, యింద్ర
జాలముఁ జేతు, నదియె లీలావిభూతి!

తే.గీ. కలికి! నీ వింత భావంబుఁ దెలియలేక
నిందఁజేసితి, పది మంచి నిక్కమయ్యె,
నింతయే మేలు, నీ చెంత కేను రాను;
చాలు నిఁకఁ బోవె! నీ ప్రేమ సత్యభామ! 181

క. అని పలికిన గోపాలునిఁ
దన జడతో విసరి కొట్టి, తడయక యపుడే
మొనసి నిజాంతః పురమున
కనురాగము లేక వచ్చి, యా చెలి కనియెన్: 182

సత్య. క. ఎఱుకత చెప్పిన విధమున
వెఱువక ఘనపారిజాత వృక్షము కొఱకై
వర కృష్ణ జపముఁ జేయుచుఁ
జిరతర తప మాచరింతు శీతాంశుముఖీ! 183

## *సత్యభామ శ్రీకృష్ణ జప మొనరించుట*

క. అని పల్కు సత్యభామను
గనుఁగొని చెలియిట్లులనియె గౌరవమెసఁగన్
'వనితామణి! కృష్ణజపం
బనువందఁగఁ జేయు కోర్కె లెల్ల ఫలించున్'. 184

ద్విపద. అని చెలి పల్కఁగా నా సత్యభామ
తన మదిఁ జింతించి - దాని కిట్లనియె:

హరి నామజపము మో - క్షాస్పదంబనుచుఁ
బరమయోగీంద్రులు - పల్కుచుండుదురు.

సలలితమైన యా - జపమహత్త్వంబు
పొలఁతి! వైరాగ్యంబుఁ - బుట్టింపఁగలదు,

గాన నాకు విరక్తి - కలిగినట్టైనఁ
బూని నా సవతులు - పొంగుచుండుదురు.

విలసితమగు దేవ - వృక్షంబు కొఱకు
చెలఁగి యా జపము నే - జేసితినేని

వృక్షంబు వచ్చునో? - విమలమైనట్టి
మోక్షంబు గల్గునో? - మొనసి యీ రెండు

తెలియక మనము సం-దేహమందినది.
తలఁచిన పారిజా-తము వచ్చెనేని

సవతుల సాధించి - సంతసించెదను.
ప్రవిమల మోక్ష సం - ప్రాప్తి గల్గినను

పంత మీదేఱక - పరమవైరాగ్య
చింతఁ జేయుచు నాత్మఁ - జెందియుండుదును;

అకలంక తరిగొండ - హరివేంకటేశుఁ
డొక చిత్తంబునఁ గూడి - యుండఁగా సతుల.

## దరువు. ఝంపె తాళం

సత్య: వెలఁది! నా కిపుడొక్క - వేళ వైరాగ్యంబు
గలిగితే సవతులు - త్కంఠ నుండుదురే! ౧

ఈ మణుల హారంబు, - లీ యంబరములన్ని
యీ మీఁద నే సవతి - యిల్లుఁజేరీనో? ౨

ఈ చంద్రకాంత శిల, - లీ చిత్తరువు పెట్టె,
లీ చిల్క, లీ హంస - లెవరిఁ గలిసీనో? 3

నా దేవుఁడును నేను - మోదమునఁ బెనఁగొనిన
యీ దివ్యభవనమం దెవతె నిలిచీనో? ౪

తరిగొండ హరి శేష- ధరణీధరేశ్వరుఁడు
కరుణ నిందే సతినిఁ - గౌఁగిలించీనో? ౫

క. అన విని యా చెలి యిట్లనె
'వనితామణి! జపముసేయువా రెవ్వరైనన్
ధన,ధాన్యాదుల నీ గతి
మనమునఁ జింతింతురఁటవై? మధుకరవేణీ! 185

తే.గీ. చిత్తమేకాగ్రముగఁ జేసి చిరతరముగ
విష్ణు దివ్యావయవములు వేఱువేఱ
మనన చేయుచు జపము సమ్మతినిఁజేయు
నీకుఁ దరిగొండ హరియిచ్చు నిత్య సుఖము.' 186

ద్విపద. అన విని ముదమంది - యా సత్యభామ
ఘనతరంబైన యే - కాంత స్థలమున

నలువొప్పఁ బద్మాస-నమునఁ గూర్చుండి,
నెళవుగా దేహంబు- నిక్కించి, దృష్టిఁ

గ్రమమొప్ప నాసికా - గ్రంబుపై నుంచి,
భ్రమ లెల్ల నణంచి - పద్మలోచనుని

యవయవ ధ్యానమం-దపు డాత్మ నుంచి,
యవిరళ తరిగొండ - హరిమెచ్చుకొఱకు

సరవిని దివిజవృక్షముఁ దెచ్చు కొఱకుఁ
జిరతర తపమిట్లుఁ జేయుచునుండె.

క. అప్పుడు పద్మదళాక్షుఁడు
తప్పక యా సత్యభామ తపమొనరించే
చొప్పు మనంబునఁగని, మది
నుప్పొంగుచు సతులఁ జూచి యొనరఁగఁ బలికెన్.187

ఆ.వె. భక్తి నిపుడు సత్యభామిని ననుఁ గూర్చి
పారిజాతతరువుఁ గోరి తపముఁ
జేయుచున్న దిపుడు చెలఁగి నేనచటికి
వనితలార! పోయి వత్తు నటరె? 188

## *శ్రీకృష్ణుఁడు సత్యభామ కడ కేఁగుటకు రుక్మిణ్యాదుల అనుమతి*

ద్విపద.'పరమపావన! సత్య-భామకు నీవు
సురపారిజాత మ-చ్చుగ నిత్తు ననుచుఁ

దలఁచెదవేమొ,త-త్తరువు నయ్యింద్రుఁ
డలరఁ దేనిచ్చునే?' - యని పల్కె రాధ;

'తేనిచ్చెనే చూడు- దేవమహీజ
మూని ధాత్రిని నంద - నోద్యానమందు

నిలిచి యున్నటువలె - నిలుచునే?' యనుచు
లలిత మానసయైన - లక్షణ పల్కె;

'నిలిచి యుండినఁ జూడు - నెలవుగాఁ బుష్ప
ములు వికసింప వి-మ్ముగ' ననె భద్ర;

'వికసించెనే చూడు- వికసించినపుడె
యకలంకసూనంబు - లాస్వర్గమందె

'చేరు, నిందుండవు - సిద్ధ' మటంచు
నారూఢిగాఁ బల్కె - నా నాగ్నజితియు;
ఇంత మాత్రమునకు - నింద్రుని గెలిచి
వింతగా నాదేవ - వృక్షమిచ్చుటికిఁ

దేకున్ననేమి? యా-దేవి చెంగటికిఁ
బోకున్ననేమి? యి-ప్పుడు కృష్ణ!' యనుచు

విరసంబుగా మిత్ర - వింద భావించె;
'పరఁగ నీ వాసత్య-భామిని కొఱకుఁ

బురుహూతు సాధింపఁ - బోఁదలంచెదవు'
హరి! నిన్నుఁ బోనియ్య'- మనియెఁ గాళింది;

'దేవమునీంద్రుండు - దెచ్చిన సుమము
దేవి యీ రుక్మిణీ -దేవి కిచ్చితివి

గనుక, తద్వృక్షమే-కావలె ననుచు
ననఘ! నిన్నాయింతి - యడిగినదేమొ?

వలపు నిల్వఁగలేక - వనజాక్ష! నీవు
నల భూజమిత్తు నీ - కని యంటివేమొ?

యలఘుపట్టపుదేవి - యైన రుక్మిణితో
చెలఁగి దానిని సాటి - చేసితి వేమొ?

మెఱసి దానిని మాత్ర - మే సత్తుగాను
హరి! నీవు మునుఁ బెండ్లి యాడితివేమొ?

నెళవుగా మేమెల్ల - నినుఁజూచి భ్రమసి
వలపుచేఁ దేరకు - వచ్చితిమేమొ?

కనుక రుక్మిణి కన్న - ఘనముగా దానిఁ
గనుఁగొని, మమ్మెల్లఁ - గడకుఁ ద్రోసితివి,

ఇంతయే చాలు మా - కిఁక నేమి?' యనుచు
వంతు కెక్కిన జాంబ - వతి పల్కఁగాను

దరహసితాస్యుఁడై - తరిగొండ నృహరి
యురగాద్రి వాసుఁడా - యువిదల కనియె:

ఆ.వె. 'ఇంత కోపమేల? యంగనలార! మీ
రుండుమనిన చోట నుండువాఁడ'
ననుచుఁ గుసుమతల్పమందుఁదా శయనింపఁ
గా విదర్భ రాజకన్య పలికె: 189

ద్విపద. 'ఇది యేమి కృష్ణ! నీ - వింత నిష్ఠురము
మది నుంచుకొని యన్ని - మానిన రీతిఁ

బవ్వళింతురె? సత్య - భామ కా కుజము
నివ్వటిల్లఁగఁ దెచ్చి - నీ విచ్చి రమ్మ!

మా యెక్కువేమి? యి - మ్మాడ్కి నిందుండ,
నా యిందుముఖి తక్కు-వై యున్నదేమి?

జలజాక్ష! నీకు వై - షమ్య నైర్ఘృణ్య
ములు గలవే? భూత - ములకెల్ల నీవు

సముఁడవే గావున - సత్యభామినిని
బ్రమదంబు నొందింపు - పవళింపనేల?

లెమ్ము లె'మ్మని చాల - లేపిన లేచి
యమ్మధుసూదనుం - డహిశైల విభుఁడు

తరిగొండ ధాముఁ డా - తరుణి నీక్షించి
కరుణ నిట్లనియె ను-త్కళిక దీపింప.

తే.గీ. 'అతివ! యీ జాంబవతి మొదలైన సతులు
నీవు చెప్పిన యట్లనే నెనరుగాను
పోయిరమ్మన్న నచటికిఁ బోయి దాని
సమ్మతముఁ జేసి వచ్చెద జలజనయన?' 190

తే.గీ. అనిన విని రుక్మిణీదేవి హర్షమెసఁగ
జాంబవతి మొదలైనట్టి సతులఁ బిలిచి
'యీ మహాత్ముని నా సత్యభామ కడకుఁ
బోయి రమ్మని చెప్పరే! పొలఁతులార!' 191

జాంబవత్యాదులు

ఆ.వె. నిన్నఁ బోయి వచ్చె, నేఁడేమి యవసర?
మచటి కంబుజాక్షు నంపనేల?
నమర పారిజాత మాపె కియ్యకపోతె
మానె, నుండనిమ్ము మీన నయన! 192

రుక్మిణి: ద్విపద. ఇది యేమి సతులార? - యిమ్మహామహుని
మది నెఱుంగక యిట్టి - మాటలాడెదరు;

పరమాత్ముఁడిటు భక్త - పరతంత్ర కీర్తి
ధరియింపఁగా స్వతం - త్రత గల్గె మనకు,

నీ మహత్త్వముచేత - హెచ్చి గర్వించి
యీ మాధవుని నిల్ప - నెంతవారలము?

కావున నితని న - త్కరుణ మాత్రంబె
కావలె మన కంతె - గాని, యొండేల?

దయచేత మనల నిం-తగ గొప్పచేసి
నయముగా నడుగుచు - న్నాఁడంతె గాని,

పరవఁ జేయక సత్య-భామ చెంగటికి
నరిగెద నంటె మీ - రడ్డు పెట్టుదురె?

ద్విపద. అన విని యా కాంత-లందఱు జడిసి
కనకాంబరునిఁ జూచి - కరములు మొగిచి

'పంకజోదర! సత్య - భామిని కడకు
శంకింప కరిగి, యి-చ్చటికి శీఘ్రముగ

నీవు రావలె'నంచు - నెనరుతోఁబలుక
శ్రీవేంకటేశుఁ డా - శ్రిత జనావనుఁడు

పావన తరిగొండ - పట్టణాధీశుఁ
డా వెలఁదులఁ జూచి - యప్పు డిట్లనియె:

సీ. 'రావె! శ్రీరుక్మిణి! రా జాంబవతి! యిందు,
రావె! యో కాళింది! రంగుమీఱ,
రా మిత్రవిందరో! రా నాగ్నజితి! భద్ర!
రావె! లక్షణ! రావె!రావె! రాధ!
యొక సారి మీరంద ఱిఁక ముద్దు లియ్యరే!
సెలవిచ్చి యంపరే! చెలువమలర,
సత్యభామకుఁ బారి జాతమహీజంబుఁ
దెచ్చిచ్చి వచ్చెద మచ్చికలర,'

తే.గీ. ననిన, రుక్మిణి మొదలైన యబ్జముఖులు
మోహముప్పొంగ నందఱు ముద్దు లిచ్చి,
'స్వామి! గోవింద! మాధవ! చక్రపాణి!
పుండరీకాక్ష! దయ యుంచి పోయిరమ్ము!' 193

తే.గీ. అనుచు రుక్మిణి మొదలైన వనజముఖులు
పోయిరమ్మని పలుకఁగాఁ, బుండరీక
నేత్రుఁ డా సత్యభామిని నిలయమునకు
వచ్చి యిట్లని పల్కె బల్ మెచ్చుగాను. 194

## *శ్రీకృష్ణుఁడు సత్యాదేవి నోదార్చుట*

శ్రీకృ: ద్విపద.'ఓ సత్యభామ! నీ - యురుతర తపము
భానురంబుగఁ జాల - ఫలియించె నేఁడు

నీ నిష్ఠమెచ్చి మ-న్నించి వచ్చితిని
మానినీ! తపమింక - మాని నన్ జూడు!

అనుపమ పద్మాస - నాసీనవగుచు
ఘనతరాంతర్లక్ష్య - గగనమం దుండి

యనిల ధారణచేసి - యఖిలేంద్రియములు
మనసులోన నణంచి - మదిని నా బుద్ధి

యందు లీనముఁజేసి - యా బుద్ధి నాత్మ
యందైక్యమొనరించి - యానంద మొందు

పరమయోగిని రీతి - బహు విరాగమునఁ
జిరతర తప మిట్లు - చేయుచున్నావు,

ఖ్యాతిగా నే మెఱుం -గని రీతి నుండి
యీ తపోనిష్ఠ నీ - వేడ నేర్చితివి?

ఇంతి! నీ జపమున - కే నాత్మయందు
సంతసించితిఁ, బారి - జాతంబుఁ దెచ్చి

యిచ్చెదఁ గనువిచ్చి - యిఁక నన్నుఁ జూడు!
మచ్చికతోఁ బల్కు - మౌన మేమిటికి?

రహిని శృంగార వై - రాగ్య రసంబు
లహహ! నీ ముఖపద్మ - మందు దీపించె;

నిది చాల వింత! ని - న్నేవేళ నేను
కదియక మాన నే - క్రమమున నైనఁ,

దరళాక్షి! యిది మంచి - తఱియని మరుఁడు
గురుతరంబుగ నిక్షు - కోదండమునకు

నురువడితోడ బం-భర మౌర్విఁ గూర్చిఁ
గరకరితోఁ బుష్ప - కాండముల్ దొడిగి

సరవిఁ బ్రత్యాలీఢ - చరణుఁడై నిలిచి,
తరిగొండ హరి శేష - ధరణీ ధరేంద్రు

పతి యితఁడని భక్తి - భావనయైన
మతిలోఁ దలంపక - మదమత్తుఁ డగుచు

ముదమంది నా మర్మ - ములనెల్ల నిపుడు
బెదరించి బెదరించి -భేదింపసాగెఁ,

గావునఁదాళ శ-క్యముగాదు నాకు,
వేవేగఁ గౌఁగిలీ - వే! ముద్దుగుమ్మ!'

తే.గీ. అనుచుఁ గొనరెట్టఁ బట్టి నెయ్యంబు మీఱ
నెత్తి కౌఁగిటఁ జేర్ప, నా యిందువదన
యలుక తోడుత మిళితమై తళుకుఁజూపు
మొలక నవ్వున విభునితోఁ బలికె నిట్లు: 195

సత్య: ద్విపద.'స్వామి! శ్రీకృష్ణ! నీ - జపమహత్త్వమున
గామాది శత్రు వ - ర్గమును గెల్చితిని;

ఇహసౌఖ్య విషయ భో-గేచ్ఛల కెపుడు
మహిని నా యంత పా- మరురాలు లేదు

గాన, సకామనై - ఘనతర జపము
పూని చేసితి నది -ప్పుడు ఫలియించె,

గ్రక్కన నన్ను ని -ష్కామఁగాఁ జేసి
నిక్కంబు నెఱిఁగించె; - నీ దయవలన

నన్ని భోగములు ము-న్ననుభవాలయ్యె,
నెన్నాళ్లు చా, లింక నేనేమి నొల్ల;

అవిరళ భోగంబు - లాసింపనేల?
సవతులతో వాదు - సల్పఁగానేల?

నేను రారమ్మని - నినుఁ బిల్వనేల?
పూని రానని నీవు - పోనాడనేల?

ననుఁజూచి యీసతుల్ - నవ్వఁగానేల?
చెనఁటి చందమున నేఁ - జింతింపనేల?

కామంబు గల్గఁగాఁ -గద యిన్ని గల్గె!
కామంబు విడిచినఁ-గల్గునే యిన్ని?

కావున వైరాగ్య - కలితాత్మ నగుచు
దేవ! నీ పదములం-దే బుద్ధి నుంచి

మదన తంత్ర సుఖంబు - మానితి, నన్నుఁ
గదియవ'ద్దని పల్కెఁ, - గనికరంబెనఁగ

నరుదంది తరిగొండ - హరియైన శేష
ధరణీధరేంద్రుఁ డా - తరుణి కిట్లనియె:

## దరువు. ఆదితాళం

భామా! నాకలికీ! సత్య -భామా! ॥పల్లవి॥

నీ మహిమెఱుఁగక - నిక్కముగా నతి
కాముకురాలవు - గద యని నమ్మితి ॥భామా!॥ ౧

భావభవుఁడు నను - బాధింపఁగ నీ
కీ వైరాగ్యం-బెందుకు నిల్చునె? ॥భామా!॥ ౨

మనమలరఁగ నీ - వను రాగంబున
మునుపటి విధమున - ననుఁగవగూడవె॥భామా॥ 3

తరిగొండాధీశ్వరుఁడగు వేంకట
గిరివాసుఁడ ననుఁ - గరుణఁ జూడవే! ॥భామా॥ ౪

తే.గీ. అనుచుఁ గాముకు పగిది మోహమునఁ జక్రి
రతికిఁ బ్రార్థింపఁగాను, విరక్తురాలి
చందమునఁ బట్టుపడక యా సత్యభామ
తొలఁగి మెలఁగుచు నతనితోఁ బలికె నిట్లు: 196

సత్య: ఆ.వె. విను మనేక భార్య లనురాగమున నిన్ను
కలిసి మెలఁగుచుండఁగాను, రతికి
నేను తక్కువైన నీకేమి  కొదువ? నా
జోలి యేల నీకు నీలవర్ణ? 197

శ్రీకృ: తే.గీ. పెక్కులగు భార్యలందఱు నొక్క యెత్తు,
మత్తగజయాన నీ వొక్కయెత్తు గనుక,
నీ విరక్తిన నీవు న న్నెనయ ననిన
సత్యభామిని! నాకు సంసారమేలె? 198

సత్య: తే.గీ. అహహ! నా మీఁద నింత మోహంబు నీకు
మీఱియుండఁగనే కదా! పారిజాత
భూజమిప్పుడు నా వనంబునకు వచ్చె,
పంత మీడేఱె బ్రతికితి బాలకృష్ణ! 199

శ్రీకృ: తే.గీ. ఎగ్గు లాడక దయఁ జూడు మీక్షణమున
తరుణి! యిచటికిఁ బారిజాతమును దెత్తు,
సత్య: తెచ్చి యిచ్చితి వలనాఁడె తీఱెఁ గోర్కె;
చాలుఁజాలటు పోర! గోపాలబాల! 200

## దరువు. ఆటతాళం

శ్రీకృ: ఏమే! నన్నేలవే! ముద్దుగుమ్మా!
ఝామాయెనే ప్రొద్దూ చక్కెర బొమ్మా! ॥పల్లవి॥

సత్య: నీ మాయాలు గంటిరా! ముద్దుసామీ!
సామాన్యుఁడవా? నీ సఖ్యమింకేమీ? ॥ఉపపల్లవి॥

శ్రీకృ: మందాపవనూఁ - డిందు మేనూ
పొంది కుందించానే! - సుందరవదనా! ॥ఏమే!॥౧

సత్య: వలచీ వలచీ పిలిచీ పిలిచీ- యలసీనే! సొలసేనే!
కలిసితివఁటరా? నీ మాయాలు - గంటిరా!
ముద్దుసామీ!॥నీ మాయాలు॥ ౨

శ్రీకృ: కలికీ రావే! కౌఁగిలీవే!- కలకాలాలు ఈ
కీలేలే? చిలు-కాల కొలికీ! ॥ఏమే!॥ ౩

సత్య: సరసమూలూ -చాలూ చాలూ
మురియూచు కదిసీప -ల్మఱునం టకురా!
॥నీమాయాలు॥ ౪

శ్రీకృ: తారిగొండా -పురము నుండా
తరి యీది ఫణిగిరి -వర! రా రమ్మనవే! ॥ఏమే!॥ ౫

సత్య: కోరీ తారి గొండా నృహరీ!
సారతర శేషా - శైల విహారీ! ॥నీ మాయాలు॥ ౬

శ్రీకృ: తే.గీ. ఇపుడు కౌఁగిట ననుఁ జేర్చు,మింక నొక్క
ఝాములోఁ గొను భుజంబు సత్యభామ!
సత్య: సురమహీజంబుఁ గన్నులఁ జూచి నిన్ను
పొందు, దందాఁక పొందను పోర! కృష్ణ! 201

ద్విపద. అని వానిఁ దూలిపో - నాడి కృష్ణుండు
తన చేతి పారిజా-త మహీరుహంబు

మొనసి యా మూలాగ్ర -ముగఁ బెల్ల గించి
ఘన విహగేంద్రు రె - క్కల మీఁద నుంచి

పొలుపొందఁ దరిగొండ - పురధాముఁడైన
సలలిత వేంకటా -చల నివాసుండు

అమిత సంతోష మ - గ్నాత్ముఁడై చెలఁగి
కమనీయ లీలతో - గగనమార్గమున.

## దరువు. అట తాళం

జగదీశ్వరుఁడు వచ్చెనూ, సత్యకు
పారిజాతముఁ గొని తెచ్చెనూ ॥పల్లవి॥

ఖగరాజుపై నెక్కి - గగన పథంబున
నెగసి సురేంద్రుని - నగరములోఁ జొచ్చి
జగదీశ్వరుఁడు వచ్చెనూ॥ ॥ఉప పల్లవి॥

సురలు వెఱఁగు నొందఁగా, సమస్త ఖే
చరులు సంతసమొందఁగా,
తరుణితో మురియూచు - పారిజాతాఖ్య
తరువూ వాసన దిగంతరములా నిండఁగా ॥జగదీ॥ ౧

కనక చేలము మెఱయా, సర్వాంగము
లను భూషణము లొఱయా
మినమిన మెఱసేటి- మెఱుపులతో నీల
వనదము దిగఁ బాఁఱి - వచ్చెనో యనినట్ల॥జగదీ॥ ౨

గురుశేషాచల వాసుఁడూ నృసింహుఁడు
తరిగొండ పురధాముఁడూ
పరవాసుదేవుఁడూ - భవ్యప్రభావుఁడు
పరమపవిత్రూఁడు - పంకజనేత్రుఁడు ॥జగదీ॥ 3

## *నందనవనపాలకుని ఆక్షేపణ*

వనపా: తే.గీ. అమరనాథుని కాటపట్టగుచు నెపుడు
ఘనత మీఱిన యీ మహావనముఁ జొచ్చి
చోరకుని రీతి నీ దేవ పారిజాత
మీ విధంబునఁ బెకలింప నెవఁడవోయి? 206

శ్రీకృ: తే.గీ. అమరనాయకు కొఱకు సాహసము చేసి
నరకుఁడను రాక్షసునిఁ ద్రుంచి, నురుచిరంబు
లైన కుండలములు దెచ్చి యదితి కిచ్చి,
యిటకు వచ్చితి; నన్ను నీ వెఱుఁగవఁటర? 207

వనపా:క. 'నను నే నెఱుఁగని వాఁడను
నిను నే గతి నెఱుఁగనేర్తు? నిజముగ నీ పే
రనువందఁ దెల్పు' మన విని
వనజాక్షుం డిట్టులనియె వనపాలునితోన్. 208

శ్రీకృ: క. వినరా! యో వనపాలక!
పెనుపొందఁగ నీవు నాదు పేరడిగిన, న
న్ననువందఁ గృష్ణుఁ డనుచును
జనులందఱు బిలుతురెపుడు సంతస మొప్పన్. 209

## దరువు. ఆదితాళం

వనపా: కృష్ణా! నీవీ వృక్షం బిటు పెకలింపక విడువవయా!
శ్రీకృ: మీ, జిష్ణుఁడు వచ్చిన వృక్షము విడువను ఛీ!పో! వనపాలా!౧

వనపా: 'ఛీ! పో'మ్మనినను వెఱచి కుజము నిచ్చే నఁటరా? నీకూ
శ్రీకృ: నేఁ, జేపట్టిన వృక్షంబును విడిపించేవాఁడెవ్వఁడురా? ౨

వనపా: శ్రీతరిగొండేశ్వర! సురపతి కిది చెప్పదునఁటవోయీ?
శ్రీకృ: ఈ తఱి మీ దొర వచ్చిన భయమే, మిపుడే దెలుపు పోరా! 3

యమరేంద్ర పురమున కరిగి -యచ్చోటఁ
గొమరొప్ప నదితికిఁ - గుండలా లిచ్చి,

చెచ్చెర నయ్యింద్రు - చేఁ బూజలంది,
వచ్చునప్పుడు మహా - వాంఛ రెట్టింప

ననుపమ గరుడ వా - హనముతోఁగూడఁ
దన సతితోడ నం - దనవనంబునకు

భాసుర శేషాద్రిపతి తరిగొండ
వాసుఁడౌ కృష్ణుండు - వచ్చి వేడుకను

రమణితో వనవిహా - రంబుఁ జేయుచును
ప్రమదాంతరంగుఁడై - పలికె నిట్లనుచు;

## దరువు. అట తాళం

**శ్రీకృష్ణ:** ఈ వన శృంగార - మింపూగఁ జూడవే! సత్యభామా! నీకుఁ
గావలసిన పూలు- గ్రక్కునఁ గోయవే! సత్యభామా! ౧

కుందరదన! దేవ - కుజమిది చూడవే! సత్యభామా! నీ
విందుకే గద! నన్నుఁ - బొందరా నంటివి సత్యభామా! ౨

తరిగొండ హరి! శేష-గిరివాస! రమ్మని సత్యభామా! నన్ను
కరుణించి యొకనైనాఁ -గౌఁగిలించేవటే? సత్యభామా! 3

ఆ.వె. అనుచు సత్యభామ కనురాగమునఁ జక్రి
మెఱయు పారిజాత తరువుఁ బూని
ప్రియము మీఱ దానిఁ బెకలింప, వనపాలుఁ
డటకు వచ్చి యిట్టులనియె హరికి. 205

సకల శాస్త్రవులను - సాధింపఁగలము,
ప్రకటంబుగానైనఁ - బయనంబు గమ్ము!

పోయివత్త'మటంచుఁ -బొలఁతికిఁ జెప్పి
మాయావియైన యా - మాధవుఁడపుడు

అలర వశీకృతుఁ -డై తన చెంత
నిలిచియుండెడి కాము - నిం జూచి 'నీవు

ఘనతర క్షీరాబ్ధి కడ కేఁగి, యచట
నొనరంగఁదపముఁ జే - యుచునుండునట్టి

పరమసాత్త్విక భక్తి - భావజ్ఞుఁడైన,
గరుడునిఁ దోడ్తెమ్ము - గ్రక్కున' ననుచుఁ

గాముని క్షీరాబ్ధి - కడకంపి, సత్య
భామిని నగర నా - ఫణిగిరీశ్వరుఁడు

అలరారఁ దరిగొండ - హరి ఖగరాజు
చెలఁగి వచ్చుట నిరీ - క్షించుచునుండె.

తే.గీ. కాముఁ డప్పుడు క్షీరాబ్ధికడకుఁ బోయి
వేడుకను పక్షిరాజును దోడి తెచ్చె,
నా ఖగేంద్రునిపై నెక్కి యలర సత్య
భామ తోడుతఁ గృష్ణుఁడంబర పథమున. 204

ద్విపద .బలమొప్పఁగాఁ జని - ప్రాగ్జ్యోతిషాఖ్య
గలపురిఁ జేరి, య-క్కడ మురాసురునిఁ

బరిమార్చి, నరకుని - భంజించి, వాఁడు
చెఱ గొన్న - భూపాల శేఖరాత్మజులఁ

బొదువైన ద్వారకా - పురమందుఁ జేర్చి,
యదితి కుండల యుగం - బపుడు గ్రహించి,

నెళవుగా నీ మీఁద - నేను నవ్వులకు
నులికింపవేయు పు - వ్వుల చెండ్లుగావు,

వీరుల కోదండ-వితతులనుండి
యారూఢి వెడలు ఘో - రాస్త్రముల్ గాని;

మొలక నవ్వుల నీవు - ముద్దులాడుటకు
నలరు చిల్కలును, రా - యంచలు గావు,

సరవిఘోరాట్టహా - సంబులు చేసి
తఱచుగా నార్చు దు-ర్దానవుల్ గాని;

రమణిరో! నీవేడ? - రణరంగమేడ?
కమలాక్షి! యిందుండు, - గ్రక్కున నేను

చని దానవులనెల్ల - సమయించి, పిదప
ననిమిషేశ్వరు గెల్చి - యా స్వర్గమందు

సలలితమగు పారి - జాతంబుఁ దెచ్చి
నలువొప్ప నీకిత్తు; - నా వెంట నిపుడు

వామాక్షి! నీవు రా- వల'దన్న సత్య
భామ యా తరిగొండ - పతి కిట్టులనియె:

సత్య: తే.గీ. 'తోయజేక్షణ! నీ బాహుదుర్గయుగము
నడుమయుండఁగ భయమంద నాకుఁగలదె?
కాన నీ వెంట వత్తు నిక్కముగ' ననినఁ
జక్రి యిట్లని పలికె నా సతినిఁ జూచి: 203

శ్రీకృ: ద్విపద. 'వామాక్షి! నీవిట్లు - వచ్చెదననిన
భామ! యీ చతురంగ - బలము లేమిటికి?

నెఱజాణవైనట్టి - నీవును, నేను
గరుడ వాహనమెక్కి - కదలితిమేని

తే.గీ. పంకజోదరుఁ డీరీతిఁ బైనమగుట
సంతసంబునఁ జూచి యా సత్యభామ
గునిసి, ముద్దులు గురియుచున్ మొనసి విభుని
పాదపద్మములకు మ్రొక్కి పలికె నిట్లు: 202

సత్య: ద్విపద. 'దేవదేవ! సమస్త - దేవతారాధ్య!
నీవు దానవులతో - నిపుణతమీఱ

సమరంబుఁ గావించు - చందంబుఁ జూడఁ
గొమరొప్ప నామదిఁ - గోర్కె పుట్టినది,

నలినాక్ష! యిదిగాక - నందనవనము
వలనొప్ప వీక్షించు - వాంఛ గల్గినది,
అటుగాన నీవెంట - నరుదెంతు' ననిన
కుటిలకుంతలను గ-న్గొని వేంకటాద్రి

పతియైన తరిగొండ -పట్టణాధి పుఁడు
హితవు మీఱఁగ నవ్వి - యిట్లని పలికె:

శ్రీకృ: ద్విపద.'ఓ సత్యభామ! యా-యుగ్రాజి కిపుడు
భాసురమతిని రాఁ - బయన మయ్యెదవు,

తరుణి! నీ వెపుడు ము-దంబుతో వినెడు
సరసమత్తమిళింద - ఝుంకృతుల్ గావు,

గొనకొని దిశలెల్ల - ఘూర్ణిల్లఁజేయు
ఘనకరి నికర ఘీం - కారముల్ గాని;

మలయమారుతముచే - మాటిమాటికినిఁ
బొలుపొందఁ బ్రై్వాలు - పుప్పొడి గాదు,

హయపదఘాతచే - నధికమై దివికి
రయమున వెగయు ప-రాగంబు గాని;

నందనవనములో - నం బ్రవేశించి
పొందుగా ఘనసుర - భూజంబుఁ దేను

గట్టిగా నేఁడు సం - కల్పించినాఁడ;
నెట్టన నీ విందు - నిలువక యరిగి

వలనొప్ప శృంగార - వనములో నున్న
యల రుక్మిణీ ప్రము - ఖాంగనా మణుల

నంత:పురములో - నతివేగఁ జేర్చి
వింతగా నట౯ జతు - ర్విధబలంబులను

సరగున శర శరా -సన చక్ర ముసల
పరశు తోమర గదా - పట్టస కుంత

కరవాల శూలము - ద్గర భిండివాల
పరిఘాది సాధన - ప్రతతులతోడ

విరివిగా రణభేరి - వ్రేయించుకొనుచు
నరకాసురుండేలు-నగరంబు దిక్కు

నలువొప్ప నతివేగ - నడిపింపు'మనిన
చెలఁగి యుద్ధవుఁడంత - చెచ్చెర నరిగి

వనములో నుండెడి - వారిజేక్షణల
మొనసి యంత:పుర - ములఁ జేర్చి వచ్చి,

బలముల నతివేగఁ- బైనంబుఁ జేసి
విలసిల్లు రణభేరి - వేయించె, నంత

బలమొప్పఁ దరిగొండ - పట్టణాధిపుఁడు
సలలిత వేంకటా -చల నాయకుండు

శర శరాసన గదా - శంఖ చక్రములు
ధరియించి రథమెక్కఁ - దలఁచె వేడుకను.

## *పారిజాత తరువు నిమిత్తమై శ్రీకృష్ణుఁడు ప్రతినఁబూని వెడలుట*

### దరువు ఆదితాళం

శ్రీకృ: అయితే నా ప్రాణఁ జూడు సత్యభామా! నీ
వప్పుడే నన్నుఁ గూడు సత్యభామా! ౧

ఖ్యాతిగా నింద్రు గెల్తు సత్యభామా! పారి
జాతాము నీకుఁదెత్తూ సత్యభామా! ౨

నామోమిట్లా జూడవే! సత్యభామా! నీవు
నవ్వూచు సెలవీవే! సత్యభామా! 3

అలుకా వీడిన నీకు సత్యభామా! నీకు
కనకాభిషేకముఁ జేతు సత్యభామా! ౪

తరిగొండ హరిని నేను సత్యభామా! నీకు
తక్కువ జేయనేమీ సత్యభామా! ౫

ద్విపద: అని కృష్ణుఁ డా సతి - కభయం బొసంగి
పెనుపొంద నుద్ధవున్ - బిలిచి యిట్లనియె:

'వినుమింక నుద్ధవ! -విశదంబుగాను
పనిఁబూని యీ సత్య - భామకు నేను

పూని గ్రక్కున దేవ - భూజంబు నిచ్చి
గాని ప్రాశింపను - గంగామృతంబు,

అటుగాన నింద్రున - కపకారి యగుచుఁ
గుటిలాత్ముఁడగు నర - కుని సంహరించి,

వాఁడు పూర్వము గొన్న - వరకుండలములు
నేఁడదితి కొసంగి - నిర్జరేశ్వరుని

ద్విపద. హరి యిట్లు వనపాలు - నదలించి మించి
గురుతరంబుగ దేవ - కుజముఁ దెచ్చుటకు

భయమంది, తద్వన - పాలుఁడందుండి
రయమునఁ బోయి' ప-రా'కని మ్రొక్కి

'యో పాకశాసన! - యో మహావీర!
ఏ పార నల్లవాఁ - డెవ్వఁడో కాని

బలియుఁడై యొక పక్షి -పై నెక్కి వచ్చి
వలనుగా నందన - వనములోఁ జొచ్చి

యురు సాహసమున న-న్నదరఁద్రోయుచును
వెఱవక ననిమిష - వృక్షంబుఁ బెఱికి

యిప్పుడె ఖగముపై - నిడుకొని పోయెఁ
దెప్పున నది నీకుఁ- దెలుప వచ్చితిని'

అన విని దేవేంద్రుఁ- డాగ్రహం బెసఁగ
ననిమిషుల్ గొలువ ది - వ్యాస్త్రముల్ పూని

కులిశాయుధంబుఁ గై - కొని విజృంభించి
తలకొని యైరావ - తంబుపై నెక్కి

విడిబడి యార్చుచు - వెనువెంట నుఱికి
యడరారఁ దరిగొండ - హరి కడ్డముగను

## *శ్రీకృష్ణ సురేంద్రుల సంగరము*

### *దరువు. ఆదితాళం*

వచ్చె సురేంద్రుఁడు - హెచ్చిన బలమున
నచ్చముగా శ్రీ - హరిపై చలమున
॥ వచ్చె సురేంద్రుఁ డు॥ పల్లవి॥

'నిలునిలు గోపక! - నిలు నిలు' మనుచును
'పొలుపలరఁగ నినుఁ- బోనియ' ననుచును
'చెలఁగుచు నిను శి - క్షించెద' ననుచును
కలహంబునకే - కాలు ద్రవ్వుచును ॥వచ్చె॥ ౧

'ఈ మాడ్కినిఁ బో - నేమిటి?' కనుచును
'మోమిటు జూపర! - ముద్దుగ' ననుచును
నీ మాయలు నటు - నిలుపర!' యనుచును
తేమా 'వృక్షము - తే తె'మ్మ నుచును ॥వచ్చె॥ ౨

'నరుఁడవు నీవై -నావిపు' డనుచును
'సురలను వంచిం - చుదురా?' యనుచును
'వెఱవక ధర్మము - విడిచితి' వనుచును
'తరిగొండాధిప! - తగునే?' యనుచును ॥వచ్చె॥ 3

క. ఇటువలె వచ్చి సురేంద్రుఁడు
చటులోగ్రాకారుఁడగుచు జలరుహనాభున్
పటుతర రోషంబునఁ గని
కుటిలతతోఁ బలికె నిట్లు క్రోధోద్ధతుఁడై. 210

ఇంద్రుః ద్విపద. 'ఇది యేమి గోపాల! - యివ్విధంబునను
మది నీకుఁదెలియక - మమ్ముఁ జొక్కించి

వలనొప్ప నందన - వనములోఁ జొచ్చి,
సలలితముగఁ బారి - జాతంబుఁ బెఱికి

తెచ్చినందున నేఁడు - తెల్లంబుగాను
ముచ్చు నీ వైనట్టి - మూలంబు గంటి,

గలిబిలిగా గోప - కాంతల యిండ్ల
చెలరేఁగి వెన్న ద్రము - చ్చిలినట్లు గాదు,

ప్రాకటంబుగ బక - ప్రముఖ రాక్షసులఁ
జీకాకుఁజేసి కూ-ల్చిన రీతి గాదు;

ఇది సురతరురాజ, - మేను జిష్ణుండ,
నిదియు నీ కెటు దక్కు? - నే నేల విడుతు?

నీకేల నిమ్మహా - నీయ భూజంబు?
మా కిచ్చి పొమ్ము, తా - మసమేటి?' కనిన

దరహసితాస్యుఁ డై - తరిగొండ నృహరి
సురనాయకుని మోముఁ-జూచి యిట్లనియె:

శ్రీకృ: 'వినరోరి! యింద్ర! యీ - వికట వాక్యములు
పనిఁబూని తొలుతనే - పలుక నేమిటికి?

మంచిది, నీవంత - మగవాఁ డవైనఁ
జంచలపడిపోక - సమరంబుఁ జేయు!

పోటరివైన నీ - భూరి శౌర్యంబు
నేటికి దాచెద? - వెదురుగా నడువు!

మాటల పంది లి-మ్మాడ్కిఁ బెట్టినను
బూటకంబున నవ్వి - పోరె జంభారి?'

యని యిట్లు తరిగొండ - హరి పల్క, నల్గి
యనిమిష నాయకుం - డతని కిట్లనియె.

## దరువు. ఆదితాళం

ఇంద్రు: అయితే నా బలముఁజూడు యాదవేంద్రా! ని
న్నవలీల గెలిచిపోదు యాదవేంద్రా! ౧

శ్రీకృ: శూరుఁడవైన గెల్చి నిర్జరేంద్రా! యీ
పారిజాతముఁ గొనర! నిర్జరేంద్రా! ౨

ఇంద్రు: చూడూ నా క్షాత్రము యాదవేంద్రా! ము
న్నేడా నన్నెఱుఁగవేమో? యాదవేంద్రా! 3

శ్రీకృ: నేఁడూ నీ శౌర్యమెల్ల నిర్జరేంద్రా!
చూడా నే వచ్చినారా! నిర్జరేంద్రా! ౪

ఇంద్రు: తరిగొండాధిపుఁడవాని యాదవేంద్రా! నేఁ
దాళితి నింత తడవు యాదవేంద్రా! ౫

ఇంద్రు: ద్విపద. 'ఇది యేమి శ్రీకృష్ణ! - యెఱుఁగవే నన్ను?
నదరక మున్ను జం - భాదుల తోడఁ

బోరి జయించిన - భూరి విక్రముఁడ,
ధీరుఁడ, నదిగాక - దేవతాధిపుఁడ,

ఎంతైన నరుఁడ వీ, - వేను నిర్జరుఁడ;
సంతసంబున నన్ను - సాధింపఁగలవె?

మంచిది, నీవే స - మర్థుండ ననుచు,
నెంచవు గద! నన్ను - నిదె చూడు చూడు!

నట్టుపడక మించి - నారి సారించి
బెట్టుగా విల్లెక్కు పెట్టితిఁ జూడు!

ఈ పాదిలో బాణ - మెత్తితిఁ జూడు!
దీపించు వింట సం - ధించితిఁ జూడు!

నీ దిక్కె లక్ష్యంబు - నిల్పితిఁ జూడు!
ఈ దేవతలు మెచ్చ -నెట్టైన నిన్నుఁ,
బక్షీశ్వరునిఁ బట్టి - బంధించి మించి
వృక్షంబుఁ గొనిపోక - విడిచితినేని

యో మాధవుండ! నే - నొక్క పురుషుఁడనె?
నా మూతి మీన మె -న్నంగ మీసంబె?

వర సాధనం బిది - వజ్రాయుధంబె?
వెఱవక నా దిక్కె - వీక్షింపుచుండు

మిదె వచ్చె బాణంబు - లిదె వచ్చె' ననుచుఁ
బదరుచు శరపరం - పరలేసి 'నీవు

తరిగొండ హరివైనఁ - దప్పించుకొనుము!
నరుఁడవై యుండిన - నా వృక్షమిమ్ము!'

క. సురపతి యిట్లని హరిపై
శరము లనేకంబు లేయ, జలజాక్షుం డా
శరముల నొక బాణంబున
నతిముతి ఖండించి, యిట్టులనె ముదమెసఁగన్!211

శ్రీకృ: ద్విపద. మేలు మే లింద్ర! నా - మీఁద బాణంబు
నీ లీల నేయువా - రెక్కడ లేరు,

శూరుఁడ వౌ నోయి! - శూరాగ్ర గణ్యు
లారూఢి మెచ్చి ది - వ్యాస్త్రంబు లిపుడు

పంతంబు మీఱ నా - పైఁ బ్రయోగింపు,
మంతటఁ దరిగొండ - హరిని నేనైతె

మొనసి నీ దివ్యాస్త్ర - ముల సంహరింతు;
మనుజ మాత్రుఁడనైన - మానెదఁ గాని,

ధీరత్వమున నేయు - దివ్యబాణంబు,
లీ రీతిఁ దామసం - బేల జంభారి?

ఇంద్రు:ద్వి. ఓ హెూహెూ! కృష్ణ! నా - యురుతరంబైన
సాహసం బెఱుఁగక, - సామాన్యుఁడనుచుఁ

దలఁచితివేమొ? నా - త్రాణైనఁజూడు
మెలమి దివ్యాస్త్రంబు - లేసెద నింకఁ,

గాలానల జ్వాల - కరణి దీపించి
నాలుకల్ గోయు నా - నాగబాణంబు

నిదె! వింటఁదొడిగితి, - నిదిగొ! వేసితిని;
అదె వచ్చె నదె వచ్చె - నదెవచ్చెఁజూడు!

తరిగొండహరివైనఁ - దప్పించుకొనుము!
నరుఁడవు నీవైన - నావృక్ష మిమ్ము!

క. అని నాగాస్త్రం బేసినఁ
గని హరిని భరించియున్న గరుడుఁడు దానిన్
కొనగోళ్లఁజీల్చి, ధరపై
నొనరఁగఁ బడవైచెఁగృష్ణుఁడొగి నిట్లనియెన్. 212

శ్రీకృ:ద్విపద. దేవేంద్ర! నీ కింత - తెలుకువలేక
నీవేళ నాగాస్త్ర - మేసితి వకట!

గరుడాస్త్రమే సర్ప - కాండంబు నణఁచు,
గరుడుఁడే యుండుండఁ- గా నీ శరంబు

నాపైఁ బ్రయోగించి - నా వటుగాన
నీ పని దప్పె, దీ - నికిఁ జింత వలదు;

ఇంక దివ్యాస్త్రంబు - లెన్నైన నేయు
కొంక నేటికిఁ? దరి - గొండాధిపతిని

నేనె నిక్కంబైన - నిన్ను సాధింతుఁ
గాని, కాకున్న వృ-క్షము నిచ్చి పోదు.

ఇంద్రు:ద్విపద. నరదేహధర! కృష్ణ! - నాగాస్త్ర మొకటి
గరుడుండు విఱిచి నిన్ - గాచి రక్షించె,

వెక్కసంబుగ బహు - విస్ఫులింగములు
గ్రక్కు నీ యాగ్నేయ - కాండంబు జూడు!

ఇదె వింటఁదొడిగితి - నిదిగొ! వేసితిని,
ఎదకు బల్ సూటిగా - నిదె వచ్చె నిపుడు,

తరిగొండ హరివైనఁ - దప్పించుకొమ్ము,
నరుఁడవే నీవైన - నా వృక్ష మిమ్ము.

ఆ.వె. అని మహేంద్రుఁడిట్టులనుచు నాగ్నేయాస్త్ర
మేసెఁ, బంకజాక్షుఁడెలమి వరుణ
బాణమేసిదాని భంజించి, దరహాస
కలితవదనుఁడగుచుఁ బలికె నిట్లు. 213

శ్రీకృ: ద్విపద. దేవేంద్ర! నామీద - ధీరతమీఱ
నీవేయు బాణంబు - నీరసంబయ్యెఁ,

గకవిక పడుచు ను - త్కంఠ దీపింప
నిఁక దివ్యబాణంబు - లెవ్వైన నేయు,

తరిగొండ హరియైనఁ - దప్పించుకొందు;
ధర మానవుఁడనైనఁ - దరువిచ్చి పోదు.

ఇంద్రు:ద్విపద. వినవోయి కృష్ణ! నీ - వితరణ మీఱఁ
గినిసి నేనేయు నా - గ్నేయ బాణమును

బొలియించుటకుఁ జాలఁ - బొంగనేమిటికి?
ఎలమి వాయవ్యాస్త్ర - మేసెదఁజూడు!

విడిబడి వచ్చె నీ - విపుల కాండంబు
గడగడ వణకించు - గరుడుని,నిన్నుఁ,

దరిగొండ హరివైనఁ - దప్పించుకొమ్ము!
నరుఁడవై యుండిన - నా వృక్ష మిమ్ము!

క. ఈ రీతిఁ బల్కి సురపతి
మారుత శరమేసె; దాని మసలక కృష్ణుం
డారూఢిఁ గుధర కాండము
చే రయమున నణచి, పల్కె చిఱునవ్వెసఁగన్. 214

శ్రీకృ:ద్విపద. ఓ నిర్జరేంద్ర ! వా - యుశరంబు నిపుడు
నే నిగ్రహించితి, - నీ విందుకొఱకుఁ

జింతింపవలదు; మం - చిది యిఁక మీఁద
నెంతటి దివ్యాస్త్ర - మేయంగఁగలవొ?

దాని నామీఁదఁ బం - తంబు దీపింపఁ
బూని ప్రయోగించు - భూరి శౌర్యమునఁ,

దరిగొండ హరినైనఁ - దప్పించు కొందు,
నెఱి మానవుఁడనైన - నీ వృక్ష మిత్తు.

ఇంద్రు.ద్విపద. గోవింద! యివియెల్లఁ- గుత్సితాస్త్రములు
కావున నీచేత - ఖండింపఁబడియెఁ!
బూని నేఁ బ్రత్యహం- బును పూజసేయఁ
గా నిత్యమగు మూర్తి - గలిగి, సంతతము

నా పాదిలో మహా - నలకీల లీల
నేపారు బ్రహ్మాస్త్ర - మేసెదఁ జూడు!

నే నభి మంత్రించి - నెళవుగా వింటఁ
బూనిచితిం జూడు - పొంగెల్ల వీడు!

వచ్చె బ్రహ్మాస్త్రంబు - వచ్చె నీపైకి
వచ్చె వచ్చెను దుర్ని - వారమై యిపుడు

తరిగొండ హరివైనఁ - దప్పించుకొమ్ము!
నరుఁడవు నీ వైన - నావృక్ష మిమ్ము!

క. అని బ్రహ్మాస్త్రంబేసిన
ఘనముగ బ్రహ్మాస్త్రమునవె కంజదళాక్షుం
డనిమిషపతి బ్రహ్మాస్త్రం
బును దా నుపసంహరించి మొగినిట్లనియెన్. 215

శ్రీకృ. ద్విపద. భళి! భళి! యింద్ర! నీ - బ్రహ్మాస్త్రవరము
బలమెల్ల నణఁచెనా - బ్రహ్మాస్త్ర మిపుడు

గాన, నీ దివ్యాస్త్ర - గణముల జోలి
మాని స్వర్గమునకు - మరలి నీ వరుగు;

అటు చనవేనిఁ జే - యంగల కార్య
మిటనేమి దోఁచిన - నిప్పుడే చేయు!

తరిగొండ హరినైనఁ - దప్పించుకొందు,
హరినిఁ గాకున్న నీ - యవనిజ మిత్తు.

ఇంద్రు:ద్విపద. ఇపుడు శ్రీ కృష్ణ! నే - నేయు బ్రహ్మాస్త్ర
ముపసంహరించితి - వురుశక్తి మీఱ,

గొల్లవానికి నింత - గురుశక్తి గలుగు
టెల్లవారికిఁ జూడ - నిది విచిత్రంబు!

మేటి పోటరివని - మెచ్చితి నిన్ను,
హాటకాంబర! చూడు - మద్రిసంఘముల

పక్షముల్ విఱిచి, తాఁ - బ్రఖ్యాతిఁ జెంది
యక్షీణమైన వ - జ్రాయుధం బిపుడు

నీ మీఁద వైచెద - నిఖిల వేదములు,
సోమ సూర్యాగ్నులు, - సురలును, మునులు,

హరి హర బ్రహ్మలు, - నాగమంబులును,
పరమ ధర్మంబును, - పంచ భూతములు

సత్యంబులై యున్నఁ- జటుల వజ్రంబు
నిత్యమౌఁగా! కిది - నీ చేతఁదెగక'

యని పల్కి, దంభోళి - నప్పుడందుకొని
'వనజాక్ష! చూడు! నా - వజ్రంబు వచ్చెఁ

దరిగొండ హరివైనఁ - దప్పించుకొమ్ము!
నరుఁడవు నీవైన - నా భుజ మిమ్ము!

క. అని పల్కుచుఁగులిశంబును
దన కేల ధరించె దేవతతి నా యకుఁ,డా
కనకాంబరుఁడును చక్రముఁ
గొని నవ్వుచు నిట్టులనియె గోపతితోడన్. 216

శ్రీకృ.ద్విపద. 'శక్ర! నీవిటు ప్రతి - జ్ఞాపూర్వకముగ
విక్రమాటోపంబు - విపులంబుగాఁగఁ

బలికి యీ దంభోళి - ధరియించినావు,
సొలయక దూరంబుఁ - జూచుకో బ్రతుకు,

ఇపుడు నీ వీ వజ్ర - మేసితివేని
నపరిమితారి సం - హారి యైనట్టి

చక్రంబుచే దీని - సమయింపకున్నఁ
జక్రధరుండనే - జగతిలో నేను?'

అని పల్కి తరిగొండ - హరి విజృంభించి
ఘనమైన దివ్యచ -క్రంబుఁ జేపట్టె;

నా వేళ గరుడుండు -నైరావతంబు
వేవేగఁ గదిసె నా - విధ మెట్టిదనిన.

## దరువు. అటతాళం

గరుడూఁడు చెలరేఁగి - కదిసెను కరినీ
వరుసాగ నఖమూల - వ్రచ్చెను కరినీ
పొరిఁ బోరి ముక్కూనఁ - బొడిచెను కరినీ
గురు పక్షముల విసరి - కొట్టెను కరినీ. ౧

మదకరి విడి బడిఁ - గదిసె గరుడూనీ
ముదురూ దంతములచేఁ - బొడిచె గరుడూనీ
తుదలేని తుండానఁ - బొదివె గరుడూనీ
అదరాక తిరుద్రిప్పు - లాడె గరుడూనీ ౨

తరిగొండ పురనార - హరి ప్రేరేపఁగనూ
పరువాడి నిర్జార - పతి డీ కొల్పఁగనూ
సురలాదిగాను ఖే - చరులు మెచ్చఁగనూ
గరుడూఁడు కరి పోరె - ఘన శౌర్యముననూ. ౩

ద్విపద. ఈ రీతిఁ బక్షీంద్రుఁ - డింద్ర గజంబు
పోరాడుచుండె న - ద్భుత విక్రమముల,

గగనపథంబెల్ల - గడగడ వణఁకెఁ;
దెగువ నా కృష్ణుండు - దివిజనాయకుఁడు

చలమునఁ జక్ర, వ - జ్రములు చేపట్టి
యెలమి నొండొరులపై - నేయ నూహింప

నప్పుడు భూతంబు - లైదు భీతిల్లె,
దప్పె మార్గంబులు - తరణి, చంద్రులకుఁ,

జుక్కలు నెఱి దప్పు - చును వ్రాలఁదొణఁగె,
దిక్కులు కంపించె, - దిగ్దంతు లదరె,

భోరున సప్త స - ముద్రముల్ మొరసె,
నారూఢి శైలంబు - లల్లన నాడె,

శ్రీకూర్మ సత్క్రోడ, - శేషులు చాలఁ
జీకాకు పడి రింత - చిత్రమే? మనుచు,

బ్రహ్మాదు లత్యంత - భయచిత్తు లైరి,
బ్రహ్మాండమంతయుఁ - బగిలినట్లుండె;

ననఘుఁడౌ తరిగొండ - హరి తత్క్రమంబు
మొనసి లీలామాత్ర - ముగఁ జూచుచుండె.

క. ఆ వేళఁ బార్వతీశుఁడు
దేవేంద్రుఁడు హరియుఁబోరు తెఱఁగెల్ల మదిన్
భావించి 'యిట్టి కార్యము
వేవేగమె మాన్పకేను విడువందగునే?' 217

## *పరమేశ్వరుని ప్రవేశము*

ద్విపద. అని యిట్లు రజతాచ - లాధీశ్వరుండు
ననఘుండు తరిగొండ - హరిప్రాణసఖుఁడు

మనమునఁ జింతించి - మసలక లేచి,
ఘనకరి చర్మంబు - కాసెగాఁ గట్టి,

వలనొప్పఁ బులితోలు - వలెవాటు వేసి,
లలి మీఱఁగాఁ ద్రిశూ - లంబుఁ జేపట్టి,

సారంగ, డమరుక, - చాప, బాణములు
నారూఢిగాఁ బూని, - యద్రిజతోడ

నరుదైన నందివా - హనముపై నెక్కి,
సురుచిరంబగు జటా - జూటంబు నడుమ

నలఘుగంగా ప్రవా - హంబు ఘోషింపఁ,
బొలుపొందఁగాఁ జతు - ర్భుజముల మీఁదఁ

గుఱుచజడల్ కొన్ని - గుసిసి యాడఁగను,
మఱియును తజ్జటా - మకుటంబుమీఁదఁ

గ్రమమొప్పఁగా భాషి - కంబు చందమునఁ
గమనీయమగు చంద్ర - ఖండంబు మెఱయ,

నిటలమం దొక కెంపు - నిలిచిన రీతి
స్ఫుటముగా ననల భా - సురనేత్ర మొప్ప,

నీలాల హారముల్ - నెఱి'( జుట్టినటులఁ
గాలకూటము చాల - గళమందు వెలుఁగ,

మొనసి ముప్పిరి గొన్న - ముత్తెంపు సరము
లనఁదగు ఫణి భూష - ణావళి గదల,

శరదభ్ర శుభ్ర ల - సత్కాంతి మేనఁ
బరిపూర్ణ చంద్రిక - పగిది దీపింపఁ

బనిఁబూని ప్రమథులు - భక్తితో గొలువ
వనజాక్షు పాలికి - వాయువేగమున

## దరువు. ఆదితాళం

వచ్చే నందీ వాహనూఁడై - వామదేవుఁడూ ॥పల్లవి॥
చాలా, హెచ్చుగ నింద్రునికి, హరికి మ- చ్చికఁ
జేయఁదలఁచి॥ వచ్చే నందీ వాహనూఁడై॥ఉపపల్లవి॥

'నిలునీలు మింద్రా! నీవిట్లా - చలమునే సాధించే'వానీ
'కులిశాయుధమూ నేయావలదూ - నలినాక్షునిమీఁద'ననుచు
॥ వచ్చే నందీ ॥ ౧

'తాళు తాళు కృష్ణా! యిట్లా - తామసా గుణమూన కీది
వేళగాదూ వేళాగాదూ - వేయావలదూ చక్ర'మనుచూ
॥వచ్చే నందీ॥ ౨

'దేవేంద్రా! నీవు శ్రీ కృష్ణ - దేవుని ప్రభావ మాత్మ
భావించి శరణుఁబొందూ, - పదరావద్దు వ'ద్దనుచూ
॥వచ్చే నందీ॥ 3

'కుంభినీశ! కృష్ణ! నీవు - జృంభణముతో చక్రమునూ
దంభోళి పై నిట్లేయ - తగదూ - తగదూ తగ'దనుచూ
॥ వచ్చే నందీ॥ ४

'సురపతీ! నీవీ విధానఁ - దరిగొండా నారసింహుని
నరునిఁగాఁ దలంచి యేల - విరసాముఁజేసే' వనుచూ
॥వచ్చే నందీ॥ ౫

క. ఈ రీతి వచ్చి శంభుఁడు
వీరుండై రజత నగము విధముఁ దలిర్పన్
కూరిమి నమరాధిపునకు
నారాయణదేవునకును నడుమన్ నిలిచెన్. 218

క. చెలరేఁగి నంది కరి గరు
డుల నటు నిటు ద్రోసి యుండె డంబగు చోటన్,
బలముకొనియుండి ఖేచరు
లెలమి శివున్ వినుతిఁ జేసి రిట్లని వేడ్కన్. 219

## దరువు. అట తాళం

ఖేచరులు: పాహి సదాశివ! - పాహి సదాశివ!
పాహి సదాశివ! - పాహి శివా! ॥పల్లవి॥
శ్రీశ వాణీశ సు-రేశ సన్నుత!
చిత్ర్ప, కాశా! గౌ-రీశ! విశ్వేశ! శివా! ॥ఉపపల్లవి॥

చండప్రతాప! బ్ర-హ్మాండస్వరూప!శ్రీ
ఖండేందు ధర! ని-త్యాఖండా! శివా! ॥పాహిసదా॥ ౧

భావజ సంహార! -బహుభక్త మందార!
భావనాతీత ప్ర-భావా! శివా! ॥ పాహి సదా॥ ౨

కైలాసగిరివాస! - కమనీయ దరహాస!
లాలిత కరుణాల - వాలా! శివా!॥పాహి సదా॥ 3

తరిగొండ హరిమిత్ర!- గురుతార శిఖినేత్ర!
పరమ పావిత్ర! మాం -పాహి శివా! ॥పాహి సదా॥ ౪

క. అని వారు వినుతిఁ జేయఁగ
మనమున హర్షించి శివుఁడు మన్నింపుచు,నా
కనకాంబరునిఁగనుంగొని
వినుతింపుచు నిట్టులనియె వేడుకతోడన్. 220

శివుడు: ద్విపద.'శ్రీ రమణీలోల! - జితదైత్యజాల!
కారుణ్య గుణమూల!- కాంచనచేల!

యదుకులాంబుధి సోమ! - యాహవభీమ!
సదమల గుణధామ! - సంపూర్ణ కామ!

కమలలోచన! నీవు - కావలె ననిన
నమితంబులగు పద్మ - జాండభాండముల

నర్భకుల్ పుట్టచెం - డాడినకరణి
నిర్భయంబునఁ బట్టి - నీవు మీ టుదువు

బలుమేడి చెట్టునఁ - బండ్లున్న రీతి
నలర నీయందు బ్ర - హ్మాండంబు లుండుఁ,

గావున గజమశ - కన్యాయ మరయ
భావింప నీకును - పాకాంతకునకుఁ,

జెలరేఁగి పిఱికి పి- చ్చికమీఁదఁగినిసి
యెలమిని బ్రహ్మాస్త్ర - మేయు చందమునఁ

బురుహూతుతో నింత - పోరనే?'లనినఁ
దరిగొండ నరహరి - తగ నిట్టులనియె:

ద్విపద.'శ్రీ పార్వతీనాథ! - శ్రితపారిజాత!
పాపసర్ప ఖగేంద్ర! - పటుకృపాసాంద్ర!

నీ వన్ని దెలిసిన - నిర్మలాత్ముఁడవు
కావున నీ వెఱుం-గని యర్థమెద్ది?

దేవాదిదేవ! యీ - దేవేంద్రుమీఁద
భావింప నెపుడైనఁ - బగ నాకుఁగలదె?

పారిజాతము సత్య-భామిని కొఱకు
కోరి నే నిపుడు గై-కొంటి నటంచు

నూరక యుండలే - కుగ్రుఁడై వచ్చి
భూరి సాహసమునఁ - బోరాడినాఁడు;

నను గొల్లవాఁడనినాఁ, - డది గాక
మనుజుఁడ వన్నాఁడు - మదమత్తుఁడగుచుఁ

గాన, నీయింద్రుని - గర్వం బణంపఁ
బూని చక్రమును దం -భోళిపై నేయ

గమకించి లేచి, నిన్ - గాంచి తాళితిని.
అమలాత్మ! తరిగొండ - హరిని నేనైన

నింకమీఁదటనైన - నింద్రుని మదముఁ
గొంకక విడిపించి, - కుజముఁగొంపోదు'

ననవిని మందస్మి-తాస్యుఁడై శివుఁడు
మనసిజగురుఁ జూచి - మగుడి యిట్లనియె.

## దరువు. అట తాళం

శివు: ఇంద్రూనిపై చల-మెందూకు? రక్షించు రుక్మిణీశా!

శ్రీకృ: ఏని, సాంద్ర గర్వంబూను- నమయించి రక్షింతు పార్వతీశా!

శివు: ఇంకా గర్వం బెందు - కితనియందుండూను? రుక్మిణీశా!
శ్రీకృ: వీని, బింకా మిప్పటికిని -పెరుగుచున్నది చూడు పార్వతీశా!౨

శివు: వీఁడెంతవాఁడు? నీ - వాఁడొని దయఁజూడు రుక్మిణీశా!
శ్రీకృ: వీని, కీదంభ మున్నప్పు - డేడా నా వాఁడవును? పార్వతీశా!3

శివు: శరణన్న నింద్రూనిఁ - గరుణింతువో లేదో? రుక్మిణీశా!
శ్రీకృ: వీడు, శరణానునే?యింత-చలము నాపై నుండ పార్వతీశా? ౪

శివు: తరిగొండాధిప! సహెూ - దర భావమునఁ బ్రోవురుక్మిణీశా!
శ్రీకృ: నన్నూ, నరుఁడావన్నాఁడు, సో-దరభావమెట్లుండూపార్వతీశా? ౫

క. అని జలజాక్షుఁడు పలికిన,
విని నిటలాక్షుఁడపుడు వికటాననుఁడై
యనిమిషపతినిఁ గనుంగొని
గొనకొని యిట్లనియెఁ జాల గోపముమీఱన్. 221

## *శివుడు సురపతిని మందలించుట*

శివు: ద్విపద: "ఏమీరా! యింద్ర! నీ-వీ విధంబునను
తామసాత్మకుఁడవై-తత్త్వంబు మఱచి

నరుఁడు వన్నావట! నా ప్రాణసఖుని,
నరుఁడౌటఁ, దరిగొండ- నరహరి యగుట

శ్రీకరంబుగ వేద- శీర్షంబు లెఱుఁగు;
నీకేమి దెలియురా! నిర్జరనాథ?

అమరపతిత్వమే- యధికంబుటంచు
భ్రమసి రాజసములోఁ- బడి, మేను మఱచి

చెనఁటివై నీవిట్లు - చెడిపోవనేల?
విను సత్త్వ గుణుఁడవై - వేవేగ మ్రొక్కి

నందనందనుఁడైన - నారాయణునికి
నందమౌ పారిజా - తాఖ్య భూజంబు

నీవే సమర్పింపు - నిన్ను రక్షించు
దేవకీ సుతుఁ' డన్న - దేవేంద్రుఁ డనియె:

ద్విపద: 'శ్రీగిరిజాధీశ! - చిదచిదాకాశ!
యోగమార్గవిహార! - యురగేంద్రహార!

సర్వజ్ఞుఁడవు నీవు,-సర్వంబు నీవు,
సర్వసాక్షివి నీవు, - సర్వాత్మ వీవు,

కనుక నే నెట్టైనఁ- గడఁగి నిన్నేమి
యనరాదు గాన, మ-హాత్మ! నీవన్ని

యెఱిఁగియు, నెఱుఁగన-ట్లే నందసుతుని
నరుఁడనినందుకే- నన్ను దూఱితివి;

నరుఁడుగా కీతఁడు-నారాయణుండె?
నారాయణుండైన నాకుఁజెప్పకనె
పారిజాతముఁ గొని-పరువెత్తి చనునె?

ఇతని దుర్గుణములు - నిది గాక వినుము
సతి నొక్కదానినిఁ జంపె-బాల్యమున,

కొంగను, సర్పంబు-గోవును ద్రుంచె,
దొంగతనముఁ జేసి-తులువయై తిరిగె,

అరుదుగా మాయావి-యగుచు నటించెఁ,
బరకామినుల మాన-భంగంబుఁ జేసె,

మఱియును మఱి మేన-మామను జంపెఁ;
బరమేశ! యిటువంటి-పరులన్ని చూడ

నరుని పనుల్ గాక - నారాయణునివె?
వరుసగా నీ గొల్ల - వానినిఁ జూచి

తరిగొండ హరియంచుఁ-దలఁచితివేని
నరు లిందుకై నిన్ను -నవ్వరే?'యనిన

విని వెఱ్ఱివాఁడని - విబుధ నాయకునిఁ
గనుఁగొని నవ్వి శ్రీ-కంఠుఁ డిట్లనియె:

## **దరువు. ఆది తాళం**

**శివు:** ఓరి వోరి యింద్రా! యీ ని-ష్కారణవైరమునా నీవు
శ్రీరమణూనీ నిందింపఁ-జెల్లునఁటరా? ౧

**ఇంద్రు:** శౌరిపై వైరముఁ జేయా-పారిజాత వృక్ష మిపుడు
కారణ మాయెనో లేదో? - గరళకంధరా? ౨

**శివు:** పారిజాత వృక్షమునకే - పరమ పూరుషుని మీఁద
వైరముఁ జేయుట కెంత-వాఁడా వింద్రుఁడా? 3

**ఇంద్రు:** పరమ పురుషుఁడైన ముచ్చు- కరణి పారిజాతమూను
సరగునఁ గైకొని యిట్లా -జనునె శంకరా? ౪

**శివు:** తరిగొండా నృకంఠీరవు - డంతటికి స్వతంత్రుఁడు గనుక
తరువూ గొన్నాఁడతని కిది - తప్పు గాదురా! ౫

**ఇంద్రు:** క. 'నరుఁ డైన నందతనయునిఁ
తరిగొండ నృసింహుఁడన్న, ధర నెవరైనన్
పరమేశ! నిన్ను మెత్తురె?
సరిపో వీ మాట'లన్న,శంకరుఁడనియెన్: 222

ద్విపద. 'వినరోరి! దేవేంద్ర! విశదంబుగాను
మొనసి యీ కృష్ణుఁడే - మున్ను నీ కొఱకు

సామర్థ్య మెసఁగ మ-త్స్య శరీరమెత్తి
సోమకు మర్దించి - శ్రుతు లుద్ధరించె,

నీ కొఱకై రుక్మి - ణీ మనోహరుఁడె
శ్రీ కూర్మరూపమై - శిఖరి ధరించె,

నెనరుతోఁ గృష్ణుఁడే - నిన్నుఁ బ్రోచుటకు
ఘనతర క్రోడమై - కనకాక్షుఁ ద్రుంచె,

నెళవుగాఁగృష్ణుఁడే - నిన్నుఁగాచుటకు
నలఘున్నసింహుఁడై - యసురేంద్రుఁ ద్రుంచె,

నీ మహామహుఁడె నీ - కిరవు చేయుటకు
వామనుఁడై బలిన్ - వసుధలోఁ ద్రొక్కె,

ఈ మాధవుఁడె లోక - హితముగాఁ బరశు
రాముఁడై బహు దుష్ట - రాజుల గెల్చె,

ఈ ముద్దు కృష్ణుఁడే - యింద్రుని కొఱకు
రాముఁడై జనియించి - రావణుఁ గూల్చె,

బ్రహ్మదేవుఁడు, మీరుఁ - బ్రార్థింపఁగాను
బ్రహ్మమే దేవకి - పట్టియై పుట్టె;

అది మొదల్గాఁ బూత - నాది దుర్మతుల
మద మణఁగింపుచు - మహి నుద్ధరించె,

నీవే శిలావృష్టి - నిం గురియింప
గోవర్ధనాద్రిని - గొడుగుగా నెత్తె,

నరకాసురునిఁ ద్రుంచి - నవ్య దీధితుల
గురుతరంబగుచున్న - కుండల ద్వయము

నీటుమీఱఁగఁ దెచ్చి - నీ తల్లి కిచ్చె,
పాటించి యీ స్వామి - ప్రబలకృత్యములు

వరుసగాఁ గని వెఱ్ఱి - వాని చందమున
నరుఁడు నరుండన్న -నవ్వరే నిన్నుఁ?

బురుహూత! యీ నీచ - బుద్ధిని విడిచి
శరణని యీ పారి - జాత వృక్షమును

తరిగొండ హరికిచ్చి - తరియింపు' మనిన
సురరాజు శంకరుం - జూచి యిట్లనియె:

ఇంద్రుః: క. శ్రీ పార్వతీశ! కృష్ణుఁడు
శ్రీ పతియే, నాకు మేలుఁ జేయుట నిజమే,
నీ పల్కులన్ని సత్యమె;
ఈ పని మాత్రంబు గాని, దెట్లంటేనీ. 223

## *సురపతి పశ్చాత్తాపము*

ఆ.వె. స్వర్గ లోక పారిజాతమున్ భూలోక
మందు నిలుపఁదలఁచె, నందువలనఁ
గోపమెంతొ రాఁగ 'గొల్లవాఁడ' వటంటి,
'నరుఁడ'వంటి మించి నందసుతుని. 224

క. నే నపచారముఁ జేసితి
గానఁ బ్రణామంబుఁ జేసి కడతేఱెద; నా
మానంబు నిలిపి మీరలు
పూనిన వృక్షంబు నిచ్చి పొమ్మనరయ్యా! 225

శివుఁడు: ద్విపద. అని సురపతి పల్కె, - నంత శంకరుఁడు
మనమున హర్షించి - మాధవుఁ గాంచి

'వింటివే శ్రీకృష్ణ! - విబుధనాయకుఁడు
కంటు లే కిటు పల్కెఁ - గాన నీ వితని

దయచేసి యీ దేవ - తరు వీయవలెను,
నయముగాఁ జెప్పి క్ర - న్ననఁ బ్రోవవలెను;

నీకె దెలియుఁ దాని - నెళవు భావించి
పాకారి గౌరవ-ప్రభ నిల్పవలయుఁ

గనుక, పుత్రుని తప్పుఁ - గాచి రక్షించు
జనకుని కైవడిన్ - శాంతి వహించు,

నీవె వేసిన చెట్టు - నీవె పోషించు;
దేవేంద్రుపై నింత - తెగువ యేమిటికి?

విక్రమక్రమముల - వెలుఁగు చున్నట్టి
చక్ర వజ్రములకు - శాంతిఁ బుట్టింపు,

చలమునఁ జక్ర వ - జ్రముల మీరెత్తి
నిలిచిన క్షణమంద - నిఖిల లోకములు

గడగడ వణఁకెఁ ద - త్క్రమమెల్లఁ జూచి
విడిబడి వచ్చితి - వేవేగ నిటకు,

నందనందన! నీవు ననుఁ జూచి శాంతిఁ
బొంది యింద్రునిఁ గావు! - భువనముల్ నిలుపు!'

మనవిని తరిగొండ - హరి నవ్వుకొనుచు
ఘనుఁ డైన శంకరుఁ గాంచి యిట్లనియె:

శ్రీకృ: ద్విపద. 'వినవోయి! శంకర! - విబుధవల్లభుని
మనము భావింప ని - మ్మాడ్కి నీకుజముఁ

జెప్పక నేను దె - చ్చితిఁ గాని, వీని
ముప్పుఱచుట కంత - ముచ్చునే నేను?

చిన్ననాఁడా వ్రజ - స్త్రీలఁ బ్రోచుటకు
వెన్నముద్దలు మెక్కి - వింత చేసితిని,

అందుకు దొంగ దొం - గని దెప్పి పలికె
మందుఁడై యిటు మొగ - మాటంబు లేక,

ఇది మొదల్ గాఁగ వీఁ - డీ వఱదనుక
పదరి నీ యెదుటనే - పలికె నెన్నెన్ని?

వీనితో నేమని - వినుచుంటిఁగాని,
యీ నిష్ఠురోక్తుల - కెగ్గఁబట్టితినె?

మొనసి వీఁడాడిన - మూర్ఖ వాక్కులకు
నినుఁ జూచి నేడు మ - న్నించితిఁ గాని,

నీవు రాకుండిన - నిజముగా వీని
దేవేంద్రు పట్టంబుఁ - దీసి, వేఱొక్క

దేవేంద్రుఁ దెత్తు సం - దేహంబు లేదు,
కావున నీవు రాఁ - గా మేలు గలిగె;

మన్నించి తింద్రుని, - మఱి చింత వలదు,
పన్నగా భరణ! యీ-పారిజాతమును

వింతగా భూమికి - వేగఁ గొంపోయి
పంతంబుతో సత్య-భామ కొప్పించి,

యటమీఁద నేరీతి-నైననుగాని
పటు తీవ్రమున దేవ-పతి మనంబునకు

సమ్మత మే జేతుఁ; - జపలంబు మాని
పొమ్మను నిఁక నాత్మ-పురమున' కనినఁ

దరిగొండ నృహరి చి-త్తంబు భావించి
పరమేశుఁ డనిమిష-పతి కిట్టు లనియె:

శివు: ఆ.వె. వినర! నిర్జరేంద్ర! విష్ణువును జయింప
నాకె వశము గాదు, నీ కుఁ దరమె?
కాన, వృక్షమిచ్చి కరములు ముకుళించి,
శరణుఁ బొందు మింకఁ జలము వలదు. 226

ఇంద్రు:ఆ.వె. పారిజాత మిచ్చి యూరకే పోయిన
నన్ను నవ్విపోరె విన్న వారు?
నా భరంబు నిల్పు మీ భార మటుగానఁ
బారిజాతమీరె! ధీరులార! 227

శివు: ఆ.వె. సొమ్ము గల్గు వారు సొమ్ముఁ గొంపోవుట
కెవ్వరైన నిన్ను నవ్వనేల?
జగములన్ని చుట్టి చంకఁ బెట్టుకొ చన్న
హరికి నర్థ మెన్వ రనిమిషేంద్ర? 228

శివు: ఆ.వె. పారిజాత మిపుడు నారాయణునకు నీ
వర్పితంబుఁ జేసినందువలన
మానమునకు హాని రానేర, దటుగాన
భూజమిచ్చి మ్రొక్కి పొమ్ము శక్ర! 229

## * సురేంద్రుని శరణాగతి - శ్రీకృష్ణుని మన్నన *

ద్విపద: అనిన నింద్రుండు వృ - క్షాసక్తి విడిచి
తన రజో గుణము నం - తట నిరసించి,

ఘనసత్త్వ గుణము ను - త్కంఠతోఁ బూని,
మనసిజాంతకుఁ జూచి - మగుడి యిట్లనియె:

'శంకర! నీమాట - జవదాఁట వెఱచి
బింకంబు విడిచి గాం - భీర్యంబు గాఁనె

భయభక్తు లెనఁగ నీ - పారిజాతమును
నయమొప్పఁ గృష్ణార్ప - ణంబుఁ జేసెదను.'

అని శివసాన్నిధ్య - మందు సద్భక్తి
ననిమిషావళితోడ - నంబుజాక్షునకు

సలలితమగు పారి - జాతవృక్షమును
పొలుపొంద సంకల్ప - పూ ర్వకంబుగను

ఇరవంద ధారాగ్ర - హీతంబుఁ జేసె,
సరవితో శివుఁడంత - సంతుష్టుఁడయ్యెః

నటమీఁదఁ దరిగొండ - హరిని వీక్షించి
పటు భక్తితో దేవ - పతి యిట్టు లనియెః

ఇంద్రుః తే.గీ. వందనము సర్వభూతాత్మ! వందనంబు
వందనము విశ్వపరిపూర్ణ! వందనంబు
వందనము సత్యసంకల్ప! వందనంబు
వందనము కృష్ణ! పదివేల వందనములు. 230

శ్రీకృః తే.శీ ఆయు,రారోగ్య,భాగ్యంబు లమరఁ గలిగి
శ్రద్ధయును,ధర్మమును,కీర్తి,శాంతి గలిగి
వెలయు, మిదిగాక జ్ఞాన భక్తులను గలిగి
దేవతాధిప! నీవు వర్ధిల్లు మింక. 231

ఇంద్రుః తే.శీ.స్వామి! గోవింద!మాధవ!శరణు!శరణు!
షడ్గుణైశ్వర్య సంపన్న! శరణు! శరణు!
చంద్రశేఖర సన్నుత! శరణు! శరణు!
వరద! తరిగొండ నరసింహ! శరణు! శరణు! 232

శ్రీకృః తే.శీ. పాకశాసన! వినుమెట్టి పతితుఁడైన
శరణుఁ బొందిన రక్షించు బిరుదు నాకుఁ
గలదు గావున, శరణంటి వలర నిన్ను
సిద్ధముగ నింక నేను రక్షింతు నింద్ర! 233

## దరువు.ఆదితాళం

ఇంద్రుః కావూ నా నేరములన్నీ - కృష్ణాదేవా! నే
నీవాఁ డా నన్యుఁడఁగాను - కృష్ణాదేవా! ౧

తెలిసి తెలియానేరా కిట్ల - కృష్ణాదేవా! నే
నలిగి నిన్ను దూఱు కొంటి-కృష్ణాదేవా! ౨

తరిగొండా పురనివాస! - కృష్ణ దేవా! నా
తప్పులన్ని మన్నింపావే! - కృష్ణ దేవా! 3

క. అని నమ్రుఁ డగుచు నింద్రుఁ డు
వినుతింపఁ గ,శివునిఁ జూచి విష్ణుఁ డు నగుచున్
నెనరు మనంబునఁ బెనఁ గొన
ననిమీషపతి కిట్టులనియె నాదర మొప్పన్ 234

ద్విపద. 'దేవేంద్ర! యీ మహా-దేవుఁ డిచ్చటికి
నీవేళ నినుఁ గావ నేతెంచినాఁ డు,

కావున శుభములే - కలిగెను నీకు,
దేవేంద్ర పట్టంబుఁ - దిరముగా నిలిచె;

స్వాంతమం దీ-పారిజాతంబుకొఱకుఁ
జింతింప వలదు నేఁ -జేకొంటి ననుచు,

నేక చిత్తమున నీ-విచ్చి యుండినను
నీ కది తక్కువ - నేను చేయుదునె?

పాకారి! నీమీఁదఁ -బగ నాకుఁ గలదె?
ఈ కరణినిఁ జలం - బేలఁ జేసితివి?

యైన మంచిది, యింక - నా మాట లేల?
పోనిమ్ము, శివున కి - ప్డు ప్రణామంబుఁ

జేసి యీ ఘనునిచే-సెలవంది,పురము
వాసిగాఁ జేరి, మా - వాఁడవై యుండు,

మని యిట్లు తరిగొండ-హరి పల్కఁగాను
విని నమ్మతించి యా-విబుధనాయకుఁడు

నరసిజోదరునకుఁ - జంద్రమౌళికిని
మురువొప్ప మ్రొక్కి కే-ల్మోగిచి యిట్లనియె.

## *హరి హర స్తుతి*

ద్విపద. 'జయ రమాహృదయేశ! - జయ చిత్ప్రకాశ!
జయ తరిగొండేశ! - జయ వేంకటేశ!

జయ రజతాద్రీశ! - జయ పార్వతీశ!
జయ సర్వభూతేశ! - చంద్ర సంకాశ!

జయ నిఖిలాధ్యక్ష! - జయ పంకజాక్ష!
జయ దితిసుత శిక్ష! - జయ భక్తరక్ష!

జయ సత్య చారిత్ర! - జయ ఫాలనేత్ర!
జయ పరమ పవిత్ర! - జయ పంచవక్త్ర!

మీ రిద్దఱెపుడు నా-మీఁ ద సత్కరుణ
గౌరవంబుగ నుంచి - కడతేర్చరయ్య!'

అనుచుఁ బ్రార్థింపఁగా- నా హరిహరులు
మనముల మెచ్చి స-మ్మతి నిట్టులనిరి:

'భళి!భళి! యింద్ర! నీ-భక్తి భావంబుఁ
గలకాల మాత్మలోఁ - గా నుంచుకొనుము,

మురువుఁ జూపు రజస్త-మోగుణం బులను
నిరసించి సాత్త్విక-నిష్ఠఁ గైకొనుము,

పరఁగ నహంకార - పటిమఁ బో విడిచి
నిరహంకృతిగ నేలు - నీ రాజ్య పదము'

అని పల్కు తరిగొండ-హరిని, శంకరునిఁ
గనుఁగొని యింద్రుఁ డు-త్కంఠ నిట్లనియె:

## దరువు. ఆది తాళం

పుండరీకాక్షా! ఫాలాక్షా! -పోయివచ్చేనూ ॥పల్లవి॥
మీ,యండఁ బాయకా నా రాజ్యా-మనుభవించేనూ
॥పుండరీకాక్షా!, ॥ఉప పల్లవి॥

దండమూ నా స్వాములారా! - దండమూ దండాము మీకు
కుండ లీంద్ర శయనా! ఘన - కుండ లీంద్రాభరణా!వికచ
॥పుండరీకాక్షా!॥ ౧

శరణు మేరు ధీరులారా! - సకలలో కాధారులారా!
పరమ పురుషు లారా! చాలా - కరుణ యుంచుఁడీ!నామీఁ ద
॥పుండరీకాక్షా!॥ ౨

తరిగొండా నగరా నివేశా! - గురుతారా కైలాసాధీశా!
చిరతరాముగానూ నన్ను-పరిపాలనమూ జేయుఁడింకా
॥పుండరీకాక్షా!॥ 3

క. అని విన్నవించి, హరిహరు
లనుమతి ఁజేయఁగ సురేంద్రుఁ డమరావతికిన్
జని వేడ్క నుండె; నిచ్చటఁ
గనకాంబరుఁ జూచి నీలగళుఁ డిట్లనియెన్: 235

ద్విపద.'ఇది యేమి శ్రీకృష్ణ! - యింద్రుఁ డీవేళ
మదమత్తుఁడై నిన్ను - మఱచి మాట్లాడె,

నందు కత్యాశ్చర్య - మౌచున్న' దనిన
నందకుమారుండు - నవ్వి యిట్లనియె:

'వినవోయి! శంకర! - విబుధ నాయకుని
మొనసియున్న రజస్త - మోగుణద్వయము

నను మఱపించి దు-ర్నయునిఁగాఁజేసె,
ననువెఱుంగని మాట - లాడించె నన్ని,

వాఁ డేమి చేయు స-ర్వజ్ఞ!' యటంచు
వేడుకమీఱ శ్రీ-వేంకటేశ్వరుఁడు

తరిగొండ హరి పల్కఁ ,-దగవు భావించి
పరమేశ్వరుఁ డు నవ్వి - పలికె నిట్లనుచు:

తే.గీ. ముద్దుగోపాల! నీ శాంతమునకుఁ జాల
సంతసంబయ్యెఁ , గైలాసశైలమునకుఁ
బోయి వచ్చెద, ద్వారకా పురమునకును
పోయిరావోయి! నీవు నంభోరుహాక్ష! 236

క. అని శివుఁడు పలుకు పలుకులు
విని కృష్ణుఁడు సమ్మతించి, విశ్వాసము నె
మ్మనమునఁ బెనఁగొన గిరిజన్
కనుఁగొని యిట్లనియె చాల గౌరవమొప్పన్. 237

## * శ్రీకృష్ణుని కుశవచనములు - పార్వతిప్రత్యుత్తరము *

శ్రీకృ: తే.గీ. 'అమ్మ! పార్వతి! వరసామజాననునకుఁ ,
బరఁగ శరజన్మునకు, వీరభద్రునకును,
భైరవునకును, తక్కిన బాంధవులకు
క్షేమమే?' యన్నఁ 'బార్వతి గెలిచి పలికె: 238

పార్వతి:
తే.గీ. అన్న!మీకృపచేత మే మందఱమును
క్షేమమున నున్నవార మీ శివునితోడ;
నొనర దేవకి, వసుదేవుఁ డును,యశోద'
నందుఁడును, శీరి కుశలమె నలిననాభ? 239

క. కుశలమె భార్యామణులకుఁ?
గుశలంబే వారు గన్న కొడుకుల కెల్లన్?
కుశలమె పౌత్రావళికిని?
కుశలంబే బంధు కోటికిని శ్రీకృష్ణా? 240

శ్రీకృ: తే.గీ అద్రివరజాత! యిపుడు నీ వడిగినట్టి
వారికెల్లను గుశల మీవఱకుఁ ,జాల
ప్రొద్దు పోయెను, కైలాసమునకుఁ జనుఁడు!
పోయివచ్చెద ద్వారకా పురికి నేను. 241

తే.గీ. అనుచుఁ గృష్ణుఁడు విహగనాయకుని మీఁద
నొనరు సురభూజ శాఖల నొంచి,కొన్ని
పుష్పములు గోసి 'గిరిజకుఁ , బురహరునకుఁ
పరఁగ నర్పింపు'మని సత్యభామ కిచ్చె. 242

తే.గీ. సత్యభామిని ముదమంది శైలసుతను,
శంకరునిఁ బారిజాత పుష్పములఁ బూజ
చేసి మ్రొక్కిన, వారలా శీర్వచనముఁ
జేసి; రాహరి నీక్షించి శివుఁ డు పలికె: 243

## *శివుని కైలాస గమనము*

శివుడు:క. కైలాస శిఖరి కిప్పుడు
శైలజతో, సకలప్రమథ సంఘంబులతో
మేలిమిగఁ బోయి వచ్చెదఁ
జాలా దయ నుంచవోయి! జలరుహనాభా! 244

శ్రీకృ: తే.గీ. పుణ్య మూర్తి! మహాదేవ! పోయిరమ్ము!
ద్వారకా పురి కేను సంతసముమీఱఁ
బోయి వచ్చెద, నీవు నెప్పుడు మనమునఁ
జాల కృపనుంచు నామీఁదఁ జంద్రమౌళి! 245

ద్విపద. అనవిని హర్షించి - యద్రిజాధీశుఁ
డనువంద రజతాద్రి - కరిగె, నందుండి

కనకాబరుఁడు ద్వార - కాపురిఁ జేరి
జనులంద ఱీక్షించి - సంతసింపఁగను

గరుడుని పై నుండి - కాంతయుఁ దాను
సరగున దిగి, పారి - జాత వృక్షమును

గైకొని, సెలవిచ్చి - ఖగరాజు నపుడు
శ్రీకరం బగుచున్న - క్షీరాబ్ధి కనిచి,

పనిఁ బూని యా సత్య - భామ శృంగార
వనములోపల సుర - వర మహీజంబుఁ

బన్నుగా స్థా పించి, - పాదొప్పఁ దీర్చి,
పన్నీటి కాల్వ లా - పాదుకుఁ ద్రిప్పి,

పరువడి నా సత్య - భామ నీక్షించి
తరిగొండ హరి శేష-ధరణీ ధరేంద్ర

వాసుఁడౌ శ్రీశ్రీని - వాసుండు నగుచు
నా సత్య భామతో - నప్పు డిట్లనియె:

## దరువు

పారిజాత తరువు సత్య - భామా! నీ వనముఁ జేరె
మీఱిన పంతాము నీ - కీడేఱె ( గదవే? ౧

సురుచిరామైనట్టి దేవ - తరువూనీడ నరుదుగాను
మురియూచు మురియూచు - నవ్వి ముద్దుఁబెట్టవే? ౨

'తరిగొండ నివేశా! శేష - గిరివాసా! రార'మ్మనుచుఁ
గరుణించి నీ వింకానైనఁ - గౌఁగిలి య్యావే! 3

ద్విపద. అని సత్య భామతో - నంబుజాక్షుండు
దనర ముచ్చట లాడు - తఱి వచ్చి చూచి

చెలులు కొందఱు పోయి - చెప్పిన, లేచి
వలనొప్పఁగా జాంబ-వతి మొదలైన

కలకంఠు లటకు శీ-ఘ్రంబున వచ్చి,
యలుకతో శేషాచ - లాధీశుఁడైన

తరిగొండ నరహరిన్ - తగవుకుఁ దీసి
చొరవగా నందఱున్ - చుట్టును నిలిచి,

పనిఁ బూని యటు సత్య - భామను ద్రోసి
కినిసి కృష్ణుని నడ్డ - గించి యిట్లనిరి:

## *దరువు. అట తాళం*

ఏమిర! కృష్ణ? యి - దేమిర! కృష్ణ?
ఏమిరా! కృష్ణా? యి - దేమిరా! కృష్ణా? ॥పల్లవి॥

పారిజాతము సత్య - భామీని కిచ్చితి
వీ రీతిగా, దాని - హెచ్చేమి కృష్ణా? ॥ఏమిర!కృష్ణ?॥ ౧

దాని కిచ్చిన యట్ల - తరు వొక్క టొక్కొటి
పూని మా కియ్యక - పోనీము కృష్ణా! ॥ఏమిర!కృష్ణ?॥ ౨

తరిగొండాధిప! శేష - గిరివాసా! యీ ధర్మ
మరసి తీర్చకనే మే -మరుగాము కృష్ణా!॥ఏమిర!కృష్ణ?॥ 3

తే.గీ. అనుచుఁ దనుఁ జుట్టుకొనియున్న యబ్జముఖుల
నేమి యన లేక హరి సత్య భామ మోముఁ
గాంచి 'వీరెల్ల నన్నడ్డ గించి నారు,
సాహసంబున విడిపింపు చంద్ర వదన!' 246

తే.గీ. అనిన విని సత్యభామ దురాగ్రహమునఁ
గన్ను బొమలను ముడి పెట్టి, కనుల నెఱ్ఱ
చేసి, విడిబడి వచ్చి యాక్రోశ మెసఁగ
సవతులను జూచి యట్టహా-సమునఁ బలికె: 247

## * సవతుల కయ్యము *

### దరువు. అట తాళం

సత్య: అగధారు నేమీటి - కర్థగించినారే? సవతులారా! మీకు
పగయుంటె నా కొంగుఁ- బట్టి మాట్లాడరే! సవతులారా! ౧

సవతులు: తక్కాక నినుఁ బట్ట - నక్కాఱ మాకేమె? సత్యభామా!
చక్కాని కృష్ణునే - చిక్కించు కొన్నామే! సత్యభామా! ౨

సత్య: నా యింట నుండాఁగ - నాథునిఁబట్ట సవతులారా!మిమ్ము
ఛీ!యని పోరఁ టే? - చేరి చూచిన వారు, సవతులారా! ౩

సవతులు:తోయజాక్షుని మేము - తోడ్కొనిపోకాను,సత్యభామా!యింక
నీ యింట నెందూకు-నిలువానిచ్చేమే వో సత్యభామా! ౪

సత్య: ఉరగాద్రిపతియైన-తరిగొండ ధామునీ, సవతులారా!యిప్పు
డిరవూగ మీ యిండ్ల - కేల రానిచ్చేనే? సవతులారా! ౫

జాంబ: సత్య భామ! యిట్ల వద రకే!
సత్య: వోసి! జాంబవతి! యిచ్చట నీవు పదరకే! ౧

కాళింది: తాళు తాళు సత్య భామినీ!
సత్య: వోసి! కాళింది! బెదరించ కిట్లనే! ౨

మిత్ర: ఎందుకే కూతాలు గూసేవే?
సత్య: మిత్రవిందా! నన్నిపుడేమి జేసేవే? ౩

నాగ్న: మతిలేని మాట లిట్లనకవే!
సత్య: నాగ్న జితి! నీ వీ మాటలు వినకవే! ౪

భద్ర: క్షుద్రంపు పలుకూలు పలుకకే!
సత్య: వోసి ! భద్ర ! నీ వీరీతి కులుకకే ! ౫

లక్షణ: లక్ష్యాముం జేయా విదెందుకే?
సత్య: వోసి ! లక్షణ! యిది యొక్క మందుకే! ౬

రాధ: క్రోధాము నీ కెంతా మించెనే?

సత్య: వోసి ! రాధా ! నీ కిపు డెంత వంచనే? ౭

రాధ: వళ్లు దెలిసి మాట లాడవే!

సత్య: వోసి ! తుళ్ళాక గర్వము వీడవే! ౮

రాధ: పెద్ద పిన్నంతర్వు లేదఁటే?

సత్య: నీకు పెత్తాన మొక్కాటి గలదఁటే? ౯

రాధ: ఇట్లన నీవెంత దానవే?

సత్య: సిగ్గు బాట్లయ్యె , నీ డబ్బులు మానవే! ౧౦

రాధ: వదరితే దెబ్బాలు తగిలినే!

సత్య వోసి ! పదరితే చెంపాలు పగిలినే! ౧౧

రాధ: ఛీ! పోవే! నీతో మాట్లాడనూ ,

సత్య: వోసి పోవే ! నీమోముఁ జూడనూ. ౧౨

రాధ: శౌరి యిట్లనమాని చెప్పెనా?

సత్య: శేషాచలపతి నీమాట లొప్పెనా? ౧3

రాధ: తరిగొండ హరి భయము లేదఁటే?

సత్య: నీవు తఱిమితే కోపాము రాదఁటే? ౧౪

## దరువు. అట తాళం

రాధ: కొమ్మా! నీ కిపు డింత- కోపాము వచ్చితే
ఇమ్మాహి కీ వృక్ష - మేలా దెచ్చితివే? ౧

సత్య: వోసీ! వేడూకగా నేను - వృక్షాముఁ దెచ్చితే,
చూడఁ జాలక యేల - స్రుక్కేవే! రాధా? ౨

రాధ: వోసీ! శ్రీరుక్మిణీ కొప్పు - పారిజాతముఁ జూచి
అరాట పడుచుంటి - వది యేమె! భామా? 3

సత్య: నాసాటి సవతులు - నన్నిట్ల దిట్ట లే,
దోసీ! నీవెవతెవే? - ఉట్టి పడేవూ! ౪

రాధ: వోసీ! చండిగ్రహమువలె - మెండొడ్డి వచ్చేవు!
కండకావరమఁటే? - గయ్యాళి తొత్తా! ౫

సత్య: వోసీ! రెట్టించి రెట్టించి - ధట్టించి పలికేవు
పొట్టాపోసరమటే? - రట్టాడి సవతీ! ౬

రాధ: వోసీ! సంతోషమున శేషా - చలపతి మముఁ దిట్ట
నింతాటి చనువూ నీ -కిచ్చినాఁ డఁ టవే? ౭

సత్య: వోసీ! పాయకీ తరిగొండ - నాయకుఁ డీ రవ్వఁ
జేయమను చూ మీతోఁ - జెప్పినాఁ డఁటవే? ౮

## దరువు. అట తాళం

సత్య: ఎవతెవే రాధా? - ఓసీ యెవతెవే? ॥పల్లవి॥

రాధ: ఎవతెవే నన్నిట్ల - యెగ్గులాడుచు పెద్ద
శివమెత్తినటువలె - జిరజిర దిరిగే,వీ వెవతెవేభామా?
ఓసే యెవతెవే? ॥ఉపపల్లవి॥

సత్య: ఎవతె వనే విది యేమే? న-న్నెఱుఁగాకమఱచినావేమే?
తవిలి నా సవతి! ట్ల - తబ్బిబ్బు పొందూచు
కవకావ గూయూచు - కలహింపగా రాను నీ
॥వెవతెవే రాధా? ఓసీ యెవతెవే?॥ ౧

రాధ: కలికి! నోటికిఁ దగ్గ - కళ్లూ, బిట్టుక్రోధముచేతనీవళ్లూ
తెలియ కిట్లంటే నీ - తిక్క తెలియాఁ గొట్టి
సలిబిలి జేసేను - నాతో కొట్లాడ నీ
॥వెవతెవే భామా? ఓసీ యెవతెవే॥ ౨

వత్య: నన్ను కొట్టేనంటీవఁటవే? వళ్లు - నలిబిలిజేసేవటవే?
నిన్నిందు కొట్టితే - నీకడ్డ మెవ? రిట్ల
చిన్నెలు జేసితే - ఛీయని పించే, నీ
॥వెవతెవే రాధా? ఓసీ యెవతెవే?॥ 3

రాధ: ఛియ్యాని పించే వఁటవే? నిన్ను - ఛియ్యానువారు లేరఁటవే?
దయ్యామువలె మించి - తగవూ తెలియలేక
గయ్యాళివలె నన్ను - గద్దింపఁ గారాను నీ
॥వెవతెవే భామా? ఓసీ యెవతెవే?॥ ౪

వత్య: తరిగొండపురధాముఁ డైన శేష-గిరివాసుఁడిట్లానమనెనా?
వెఱపు లేశము లేక - విడి బాడి వచ్చేవు
మఱిమఱీ తఱిమేవు - మందూలమారి ! నీ
॥వెవతెవే రాధా? ఓసీ యెవతెవే?॥ ౫

## దరువు . అట తాళం

రాధ: ఎవతెవే?యెవతెవే?-యెవతెవే?' యని నన్ను
వివరించి యడుగఁగా - నీ వెవతెవే? యిట్ల
వెక్కిరించుటకు నీ - వెవతెవే? నన్ను
సవతివనేటందు - కెవతెవే? నాతో
సరిసారిగాఁ బోర - నీ వెవతెవే? వోసి భామా!యెవతెవే?
॥'ఎవతెవే?'॥ ౧

నత్య: చేతూలు ద్రిప్పుచు - చేర చేరఁగ వచ్చి
మూతూలు బొడువ - నీ వెవతెవే? నా
ముంగు లీడ్చ నీ - వెవతెవే? తప్పు
గూతాలు గుయ్యా - నీ వెవతెవే? నన్ను
కొట్టావచ్చే టందు - కెవతెవే? వోసి! రాధా!యెవతెవే?
॥ 'ఎవతెవే? '॥ ౨

రాధ: పదరూచు పదరూచు - కదలీ కదలీ వచ్చి
అదలించి రొప్పా - నీ వెవతెవే? చెంప
లదర వేసేటందు - కెవతేవే? నాలో
కొఱతాలు నెంచ - నీవెవతెవే? పూల
కొ ప్పుఁ బట్టీడ్చ - నీ వెవతెవే?
వోసి!భామా!యెవతెవే? ॥'ఎవతెవే?'॥ 3

సత్య: అందాలు సవతూల - కన్నా కొట్లాటకు
ముందాఱ నడువ - నీ వెవతెవే? చాలా
మొండ్లు పోరేవు - నీ వెవతెవే? కంటి
కందూవ లాడ - నీ వెవతెవే? యింత
కట కాట మనిపించ-నీ వెవతెవే?
వోసి!రాధా!ఎవతెవే?॥'యెవతెవే?' ॥'ఎవతెవే?'॥ ౪

రాధ: తరిగొండాధిపుఁ డైన - యురగా గిరీంద్రుని
మరులూ కొల్పుటకూ - నీ వెవతెవే? యింద్రమం
దీరమునకుఁ బోవ - నీ వెవతెవే? హరికి
సరిగా పూజలు గొన - నీ వెవతెవే? పారి
జాతాముఁ దెచ్చుకొన - నీ వెవతెవే? వోసి !
భామా!యెవతెవే? ॥' ఎవతెవే?' ॥ ౫

సత్య: తరిగొండ హరిమెచ్చి - తరువుఁ దెచ్చిచ్చిన
కరుణా కోరువఁ జా ల-వెవతెవే? పూజఁ
గైకొంటె దండించ - నెవతెవే? యెగిసి
కఱవావచ్చే టందు - కెవతెవే? చాల
గర్వించినావు - నీ వెవతెవే ? వోసి ! రాధా ! యెవతెవే?
॥' ఎవతెవే'?॥ ౬

తే.గీ. అనుచు రాధను పోనాడి నందువలన
జాంబవతి యాదిగాఁ గల జలజల ముఖులు
కమ్ముకొని సత్యభామను దొమ్మి చేసి,
యవల మెడఁ బట్టి నెట్టి, యిట్లనిరి మగుడి. 248

ఆ.వె. 'సత్యభామ! నీతొ సంభాషణంబులు మా
కేల? నవలఁ బోవె! నీలవర్ణు
నడుగఁ దగ్గ మాట లడిగెద'మని మళ్లి
హరినిఁ బట్టి యిట్టు లనిరి సతులు: 249

ద్విపద.'విను కృష్ణ! నీవుబల్ - వేడుక మీఱ
ముని తెచ్చినటువంటి - ముఖ్య పుష్పమును

సొరిదిగా మే మెల్ల - జూచుచుండఁగనె
తెఱగొప్ప రుక్మిణీ - దేవి కిచ్చుటకు

రహి నొప్పఁ బట్టంపు - రాణి యటంచు
సహజంబుగా మేము - సమ్మతించితిమి;

తక్కక మా సాటి - దాని కీతరువు
నిక్కంబుగాఁ దెచ్చి - నీ విచ్చినపుడు

దానెక్కువేమి? మా-తక్కువ యేమి?
యో నీరజాక్ష! మా-కొక్క రొక్కరికి

నొక్కొక్క భూజంబు - నొసఁ గినఁ గాని
యెక్కడఁ బోనీయ- మిపుడు ని'న్ననినఁ

జిఱునవ్వు నవ్వి యా - శేషాద్రి విభుఁడు
తరిగొండవాసుఁ డం - దఱి కిట్టు లనియె:

శ్రీకృ: ద్విపద. 'సతులార! మీ మాట - సత్యమౌ, నైన
హితముగా జెప్పెద - నే నొక్క మాట

నలరు పట్టపు దేవి - యైన రుక్మిణినిఁ
బిలి పింత మిచటి, కా - బింబోష్ఠి వచ్చి

చెలువొందఁ దగవుఁ దీ - ర్చిన చందమునను
నలువొప్ప నే మీకు - నడిపింతు' ననిన

'వరదందశూకాద్రి - వాసుఁ డైనట్టి
తరిగొండహరి మాట - ధర్మం 'బటంచుఁ

దమలోనఁ దాము నం - దఱు సమ్మతించి
'రమణి రుక్మిణి నిందు - రప్పింపు' మనిరి.

## * రుక్మిణిదేవి చెల్లెంద్రను సమాధానపఱచుట*

తే.గీ. జలజలోచనుఁ డపుడొక్క చెలినిఁ జూచి
' వెలది! రుక్మిణి నిటకు వేవేగ నీవు
పిలుచుకొని రావె!' యనఁ గ నా చెలియ పోయి
తోడుకొని వచ్చె నా సతిన్ వేడు కలర. 250

క. వచ్చిన పట్టపు దేవిని
మచ్చికతోఁ జూచి నవ్వి మా ధవుఁ డనియెన్
'కచ్చాడుచు నీ చెల్లెం
ద్రిచ్చట నన్నడ్డగించి రెట్లనె తరుణీ?' 251

తే.గ. అనిన రుక్మిణి నగుచు 'నోయంబుజాక్ష!
పరఁగ భక్త పరాధీన బిరుదు నీకుఁ
గలదు గావునఁ బట్టిరి కాంత' లనినఁ
గృష్ణుఁ డిట్లని పలికె రుక్మిణినిఁ జూచి. 252

క. 'ఘనమగు తగవుకుఁ దీయుచుఁ
గనకాంగులు నన్ను గట్టిగాఁ బట్టిరి,నీ
వనువందఁ దగవుఁ దీరిచి,
నను విడిపింపవె! రయమున నళినదళాక్షీ !' 253

ద్విపద. అనినఁ గృష్ణుని భావ-మా యింతి దెలిసి
తనలోన నగుచు న-త్తఱి వేంకటాద్రి

పతియైన తరిగొండ - పట్టణాధిపుని
నతిరోషమునఁ బట్టి - యట్ట హాసమున

జతగూడి చలమున - సాధించు జాంబ
వతి మొదలైనట్టి - వారి జేక్షణలఁ

గనుఁ గొని దరహాస - కలితాస్యయగుచు
నెనలేని కూర్మితో - నిట్లని పలికె:

## ఏలలు

రుక్మిణి: ఇంతాగా ప్రాణేశునీ మీ-రేలా పట్టీనా? రందూన
పంతామూ లీడేర్చూనా టారే? వో కొమ్మాలారా!
-పరమ పూరూషూనీ విడువారే! వో కొమ్మాలారా! ౧

చెల్లెండ్లు: వారీజాక్షూఁ డాలా దానీకీ - పారీజాతా మిచ్చీనట్లా
కోరీ మా కియ్యాకా తీరునా? వో యక్కా! నీవూ
-కొంకకా దీర్చూ మీ తగవైనా వో యక్కా! నీవూ. ౨

రుక్మిణి: తగవూ ధర్మామూ లేలా? పం-తామీడేరా సత్యాభామా
తెగువా మీరా తపమూఁ జేసేనే! వో చెల్లెండ్లారా!
-దేవకుజమూను సాధించానే! వో చెల్లెండ్లారా! 3

చెల్లెండ్లు: దానిమ్మాత్రా మెవ్వా రిందూ- తపమూఁ జేసేవారూలేరా?
పూని మేమూ తపమూఁ జేసేమూ, వో యక్కా!యిట్లా
-భూజమూలానే సాధించేమూ, వో యక్కా! యిట్లా ౪

రుక్మిణి: అనువందా శేషాద్రి వాసూఁ-డైనా తారీగొండా నృహరీ
మనసూ దెలిసీ-మాటా లాడారే! వో చెల్లెండ్లారా!
-మత్సరా మి ప్పటికీ వీడారే! వో చెల్లెండ్లారా! ౫

## *పత్నుల పరితోషము*

ద్విపద: అనిన రుక్మిణి మాట - లటు మీఱలేక
కనకాంబరునిఁ జూచి - కరములు మొగిచి,

చెలువొప్ప మోములు - చిన్న జేసికొని
అలివేణు లందుండి - యలిగిపోఁ జూచి,

వారి కర్ణము పోయి - వారిజాక్షుండు
కూరిమి మీఱఁ దో-డ్కొని వచ్చి, మగుడి

తెఱఁగొప్ప రుక్మిణీ - దేవి కొప్పించి,
యిరవైన దేవ మ -హీజంబు చెంత

నా రుక్మిణీ ప్రము- ఖాంగనా మణులు
కూరిమితో, గొల్వఁ - గొలువు గూర్చుండి,

పనిఁ బూని హరి సత్య - భామను జూచి
కను సన్నఁ జేసి ద-గ్గఱఁ జేరఁ బిలిచి

'జాణ! నీవీ పారి-జాత పుష్పములు
నాణెంబుగాఁ గోసి, - నవ్వుచుఁ దెచ్చి

యొనర మా కందఱి - కొసఁగుమిం'కనిన
విని సత్యభామ బల్-వేడుక మీఱ

సురపారిజాత ప్ర-సూనముల్ దెచ్చి
తఱచుగాఁ జందన - తాంబూల ముఖ్య

వివిధ పదార్థముల్ - వేగఁ దెప్పించి,
యవిరళ భక్తితో - హరిని, రుక్మిణిని,

వలనొప్పఁగా జాంబ - వతినిఁ బూజించి,
చెలరేఁగి తక్కిన - చేడెల కెల్ల

వరుసగాఁ బుష్పాది - వస్తువు లిచ్చె;
నరమరఁ దీర్చి యి-ట్లందఱిఁ గూర్చి

మురిసి, యా రుక్మిణి - మొదలైన సతుల
కరములు పట్టి వేం-కట గిరీశ్వరుఁడు

తరిగొండ హరి వినో-దములు చేయుచును
చిఱు నవ్వు నవ్వి మ-చ్చిక నిట్టులనియె:

## * శ్రీకృష్ణుఁడు సతీమణులను లాలించుట *

రావే ! రావే ! యో రాధా ! - రావే ! శ్రీరుక్మిణి ! రావే !
రావే ! జాంబవతీ ! రావే ! - రావే! సత్యభామా! రావే !
రావే ! కాళిందీ ! రావే ! - రావే ! మిత్రవిందా ! రావే !
రావే ! నాగ్నజితీ ! రావే ! - రావే ! వో భద్రా ! రావే !
రావే ! శ్రీ లక్షణ ! రావే ! ॥పల్లవి॥

పలుకులు తేనియ - లొలుకఁగఁ గులుకుచుఁ
బలుకరె ! కలఁకలు - నలుకలు నెందుకు
॥రావే ! రావే ! యో రాధా !॥ ౧

అక్కలు చెల్లెం - డ్లొక్కటి యైనను
చిక్కులు పెట్టక - చేకొనఁదగు నిఁక
॥రావే ! రావే ! యో రాధా! ॥ ౨

'తరిగొండా ధీశ్వర! - ఫణిగిరివర!
హరి! యిటు రా' ర-మ్మని కవగూడరె !
॥రావే ! రావే !యో రాధా!॥ 3

ద్విపద. అని వధూమణుల ని-ట్లనురాగ మెసఁగ
మొనసి లాలన చేసి, - ముద్దులు గొనుచు

నరమర దీర్చి, నె-య్యంబుతోఁ గలసి
సురుచిర లీలల - సుఖి యింపుచున్న

తతిఁ జెలుల్ కొంద ఱా-తరిగొండ నగర
వరవాసుఁ డై శ్రీని-వాసుఁ డౌ హరికిఁ

దరుణీ మణులకు సం-తసము రెట్టింపఁ
దఱచుగా మంగళ-ద్రవ్యంబు లిచ్చి,

కరమొప్ప నానంద - కలితాత్ములగుచు
మురియుచు శోభన - మ్ములు పాడి రిట్లు:

## * మహిళా మణుల మంగళగీతములు *
### శోభాన-దరువు

శోభానే ! శోభనమే ! ॥పల్లవి॥
ప్రాభవ యుతునకు భావజ గురునకు
శోభానే ! శోభనమే ! ॥ఉప పల్లవి॥

శ్రీరమణీ హృదయేశునకూ - చిన్మయునకు జగదీశునకూ
నారాయణునకు నందతనయునకు - ధీరున కబ్ధి గభీరునకూ
॥శోభానే ! శోభనమే !॥ ౧

అంతర్లక్ష్య విహారునకూ - నరిషడ్వర్గ విదారునకూ
అంతర్యామికి నఖిల స్వామికి - చింతామణికిని శ్రీహరికీ
॥శోభానే ! శోభనమే !॥ ౨

జాత జరా మృతి రహితునకూ - సన్మోక్ష శ్రీ సహితునకూ
ఖ్యాతిగ శ్రీ వేంకటగిరి పతికిని - శ్రీ తరిగొండ నృసింహునకూ
॥శోభానే ! శోభనమే !॥ 3

### నలుగు పాట

శ్రీమదనా గోపాలా! - శృంగారా రసలీలా !
హేమాభాస్వర చేలా! - యిందిరా లోలా ! ౧

వనదా సన్నిభ గాత్రా ! వసుదేవా వరపుత్రా !
ఘనసత్య చారిత్రా ! కరకంతా మిత్రా ! ౨

గురుశేషాద్రి నివేశా ! ఘోరారీ మదనాశా !
తరుణేందూ సంకాశా! - తరిగొండాధీశా ! 3

## సువ్వాల పాట

సువ్వి సువ్వి యదుకులేశ ! - సువ్వి శేషాచలేశ !
సువ్వి సువ్వి జగదధీశ ! - సువ్వ లాలీ ! ॥సువ్వి॥ ౧

పరమధర్మానుగుణ్య ! - భక్త సంతతి శరణ్య !
సురుచిరామరాగ్రగణ్య ! - సువ్వలాలీ! ॥సువ్వి॥ ౨

విమల పరమ పద విహార ! - వేదవేదాంత సార !
సుమహితాంబునిధి గభీర ! - సువ్వ లాలీ ! ॥సువ్వి॥ 3
శ్రీతరిగొండ నారసింహ ! - శోషితాంహ ! చిత్
జ్యోతి రూప ! శ్రీప ! భూప ! - సువ్వలాలీ ! ॥ సువ్వి॥ ౪

## ధవళం

జయ జయా నిగమాంత సారా !-జయ జయా కనకాద్రి ధీరా !
జయ జయా జలధిగంభీరా ! - జయ జయా భక్త మందారా !
॥జయ జయా॥ ౧

జయ జయా దానవ భీమా !- జయ జయా సుగుణాభిరామా !
జయ జయా పరిపూర్ణ కామా! - జయ జయా దైవలలామా
॥జయ జయా॥ ౨

జయ జయా జలద సంకాశా !- జయ జయా వరచిదాకా శా !
జయ జయా శేషాచలేశా ! - జయ జయా తరిగొండాధీశా !
॥జయ జయా॥ 3

## మంగళము

మంగళం మంగళం ॥పల్లవి॥
కృష్ణా ! కృష్ణా ! మంగళం ॥ఉప పల్లవి॥

లాలిత కృపాలావాలా ! వినత సూరిజాలా ! కనక రుచిరచేలా !
శ్రీలోలా ! మోహన లీలా! సత్వ విశాలా! నీల వర్ణ ! బాల గోపాలా!
॥మంగళం మంగళం॥ ౧

మందరోద్ధారా ! సనందనాది యోగి బృంద సన్నుత గోవిందా ! సం
క్రందన నార్చితా !నందతనయ ! ముచుకుంద వరద ! శ్రీ ముకుంద!
సానందా ! ।మంగళం మంగళం॥ ౨

కుండలిగిరివాసా ! కుండల కర్ణా ! వేదండ శుండ దోర్దండా ! బ్ర
హ్మాండరూప! తరిగొండ వాసా ! దనుజ భండన తిమిర ప్రచండ
మార్తాండా!॥మంగళం మంగళం॥ 3

ద్విపద. అని మంగళారతు - లాయింతు లొసఁ గి,
రనురాగమునఁ గృష్ణు -డందుండి కదలి

యట రుక్మిణీప్రము - ఖాంగనా మణులఁ
బటు మోదమున నాత్మ - భవనముల్ చేర్చి,

యప్పు డందఱికిఁ - దా నన్ని రూపముల
నుప్పొంగి ధరియించి, - యురుతరానంద

కల్లోములఁ దేల్చి,- కందర్ప కేళి
మొల్లంబుగా సల్పి, - ముదమందుచుండె.

## అంకితము

అని యిట్లు సకలవి - శ్వాధారుఁడైన
వన జాక్షుపేర స-ర్వ స్వామి పేర

వాసి కెక్కిన నంద - వరకులోద్భవుఁడు
శ్రీశదాసుండు వా - సిష్ఠగోత్రుండు

కానాల వంశసా - గర శశాంకుండు
నైన కృష్ణార్యున - కతివయై వెలయు

మంగాంబ సుతయను- మహిఁ బుట్టినట్టి
వెంగమాంబిక మోక్ష - విభవంబు కొఱకు

నలు వొప్పఁ దరిగొండ - నరసింహు కరుణ
నల పారిజాతాప - హరణంబు యక్ష

గానంబుఁ జేసి వేం-కట గిరీంద్రునకు
పూని సమర్పించె - బుధ సమ్మతముగ,

భూచక్రమందుఁ బెం-పుగ నీప్రబంధ
మాచంద్ర తారార్క-మై యొప్పఁ గాత!

*****

శ్రీ మంగళ మహాశ్రీంశ్రీం జేయునూ
శ్రీ తరిగొండ్ల లక్ష్మీ నృశింహ్వాయ నమ:

దుర్ముఖి. నామ సంవ్వత్సర ఆషాఢ శు.త్తి గురువారముకు సరి అయ్ని ౧౮౯౬ సంవ్వత్సరం జులాయి నెల తే౧౬ దీ్న శ్రీ తరిగొండ్ల వెంగ్గంమ్మగారికి ముని మనమ డుంన్నా వెంగ్గంమ్మ గారికి కోడలైన చంగ్గ ంమ్మ గారికి మనమడయిన గరిడి మిట్ట గంమ్మంన్న కొమారుడయ్ని గంగ్గాధరప్ప గాదంశెట్టి పుల్లయ వ్రాశ్ని అస్సలు మాతృకను పట్టి నేటికి సంపూన్నా౯ముగా గ్రంథం పూత్తి౯గా వ్రాయడ మైనది.

వ్రాలా శ్రభలు తప్పలు చాలంగ్గా గలవు శబ్ద సంగ్గతు లెరుగన్
గేలింబెట్టక తిట్టక పోలంగ్గా దిద్దరయ్య బుధ జెనులారా.

* శ్రీకృష్ణా ర్ప౯ణమస్తు *



T.T.D. Religious Publications Series No. 776
Price Rs.



హైమోర్ధ్వపుండ్ర మజహన్మకుటం సునాసం మందస్మితంమకరకుండల చారుగండం।
బింబాధరం బహులదీర్ఘకృపాకటాక్షం శ్రీ వేంకటేశ ముఖమాత్మని సన్నిధత్తామ్॥

---

Published by Sri K.V. Ramanachary, I.A.S. Executive Officer,
T.T.Devasthanams, Tirupati and Printed at TTD Press, Tirupati.